# కృతిసమర్పణ.



కృతు లొసఁగ్నగ శేషగ కమనీయాని
కష్టసంద్రమునఁ గూన కలయుచెది
దరికి జేరగ దోఁచితి దయను గనక
తల్లిదండ్రుల బాపితి తాల్మిలేక.

చిరుతప్రాయంబునందు నే నేర్పలేని
వేఱుదిక్కులు లేకయె, వెతలఁ జెంది
గాసిలంగగ వచ్చెను కాలమిహను
కరుణబూన నదేలకో కనుల నేత్రి.

కూర్చుచుండెడి నేఁడిదె కూళజనుల
కుటిలచేష్టల నెల్లను ఘోరముగను
దుష్టశిక్షణ జేయుచు శిష్టజనుల
రక్షణంబును గావింపు రయుతమతిని.

వాక్యధోరణి గూర్చింప వాణి కిపుడు
వేయిమ్రొక్కులు మ్రొక్కితి వినుము తండ్రి
దీనచిత్తత వేడితి దేహి యనుచు
నచ్చఁ జెప్పను వాగతి లబ్ధిలేక.

"అవును. ఇం దేదియో ఘోర రహస్యమున్నది." అని చెప్పుచు తన జేబునుండి అరదండముల జోడును వెలికిదీసి యాయువకుని హస్తములకు దొడుగ జూపెను. ఆయువకు డాయరదండములను—చోరఘాతకుల పాలిటి మృత్యుదేవతలు—చూచినంతనే యతని శరీరమంతయు జల్లుమని గరిపోడిచెను. ముఖమంతయు రక్తహీనమై మెల్లని గద్గదికస్వరముతో "అవి తొడగుట అవసరమా?" అని యడిగెను.

"అవును! ఇంత ఘోరహత్య చేసినట్లు నిందారోపణ చేసియున్న వారికి బంధములు తప్పనేరవు." అని యుద్యోగి ప్రత్యుత్తర మిచ్చెను.

"అయ్యా! నన్నీల యిట్టి దీనత్వమునకు పాల్జేయ జూచెదరు. లక్ష్మాజీ కస్తూర్చందుయొక్క మాటయందు విశ్వాసము లేదా? ప్రభుత్వమువారి యాజ్ఞల కెన్నడైన యడుగు దాటితినా?"

"లక్ష్మాజీ! నీగౌరవాతిశయములను గూర్చి నాకు తెలిపింప నవసరము లేదు. కాని కాలమునకును ప్రభువాజ్ఞకును కట్టుబడి నిన్నీ దీనత్వమునకు పాల్జేయవలసి వచ్చెను. నీపై మోపిన నేరమున కీయరదండప్రయోగము చేయక కొంపోయిన నాయుద్యోగమునకు భంగము కల్గును."

"ఇన్స్పెక్టరుగారూ! యోచింపుడు. ఈయువతి మరణించె ననుట తథ్యమయ్యె. నేను నిర్దోషినని నచ్చజెప్పుట

మిక్కిలి సులభము. నన్నువెంటనే విడచి పుచ్చుదురు. కాని యీకొలదికాలములో నాకిట్టి దుర్దశ నేల తెచ్చి పెట్టనెంచెదరు?”

“ లక్ష్మీజీ! ఆయువతి మరణమును గూర్చి నీవు శంకించుట కేమి కారణమో నాకు తెలియదు. నేనే స్వయముగ నామె కళేబరమును జూచియున్నప్పుడు నీకిట్టి సందేహము నేల యుండవలయును? నేను ఆమె శరీరమున గల్గు కత్తిపోట్లను గూడ నింతకుపూర్వము రెండుగంటల క్రిందనే కన్నులార జూచి యున్నప్పుడు నీకు నామాటలయందు విశ్వాసము లేదా ?”

“ అట్లయిన నేను మారుమాట్లాడను. సిద్ధముగ నున్నాడను.” అని యాయువకుడు దీనవదనముతో తన బాహుయుగ్మమును ముందుకు జాచి యాభయంకరదండములను తగిలించుమని సౌజ్ఞచేయుచు “ నాపై నిందారోపణ జేసిన వారి నాపరమాత్ముడు క్షమించుగాక !” అని యాకసమునకై దృష్టిబరపెను. బంధము లాతని హస్తయుగ్మము నలంకరించెను. ఆయుద్యోగి నేత్రములనుండి యశ్రుకణ మొక్కటి యాతని చెక్కిళ్ళపై బడెను. మారుమాటాడక లక్ష్మీజీ యా రక్షకోద్యోగిని వెన్నంటిపోయెను.

ఈజరిగిన విషాదవృత్తాంతమంతయు షాహుకారుపేట యందున్న యొక పెద్దసౌధాంతర్భాగమున నున్న యొక రక్ష

రేయుగాంతుంచే వై[illegible] యాలక్ష్మాజీ కారాగారమున
జరిగెను. కారాగారమున కట్టబడియున్న చిత్రపటము 'లక్ష్మా
జీ[illegible]వర్, శ్యాంకర్సు, రాజమహేంద్రవరము.' అని
[illegible]స్పష్టని వెలిచేయుచుండెను. అతడు బొంబాయినగర
మందలి యొక గొప్పవంశములోనివాడు. ఆతని తండ్రియు,
తాతయు, తరతరముల నుండియు వచ్చుచున్న మహోన్నతకీ
ర్తిని వేయిరెట్లధికము గావించి ఖ్యాతివహించి యుండిరి.
లక్ష్మాజీయొక్క జనకుడు తనవ్యాపారమునందే మునిగియుండి
వివాహము నాలస్యముగ జేసుకొనెను. తనవైభవమునకు
సరివైభవము కల్గియుండక పోయినను రూపలావణ్యములచే
నొప్పుచుండిన కారణమున నొకబీదవంశమున నుద్భవించిన
కన్నియను పెండ్లియాడి యామెవలన నీలక్ష్మాజీయను పు
త్రుని గాంచగల్గెను. కాని విధివశమున నాల్గుసంవత్సరము
లిట్లు సౌఖ్యముగ కాలము గడపినపిదప నొక్కదుర్ముహూర్త
మున నాతని జనకుడు, ధూమశకటములు గ్రహపాటున డీ
కొనుటలో తక్కిన ప్రయాణీకులతోడ నంతే మృతిజెందెను.
అతని మరణాంతరము వియోగదుఃఖముచే కొలదిమాసము
లలో తల్లియు పరలోకమున కేగెను.

లక్ష్మాజీకి వేరుదకుకు లెవ్వరును [illegible]మున నాతని
యాస్తియంతయు ప్రభుత్వమువారే భద్ర[illegible]చి యాతనికి
యుక్తవయస్సువచ్చినతరువాత నాతని పూర్వస్మృతియంత

యీ నాతని కొప్పగించిరి. తిక్కనధనికుల పుత్రులవలెగాక
నీతడు కష్టశాలియై తనద్రవ్యమును దుర్వ్యసనతయందు
వినియోగించక, స్వకృతమేధావిశేషమున వర్తకశ్రేణులం ద
రకును మించనొప్పుచు తనద్రవ్యమును, కీర్తివిశేషములను
దినదినప్రవర్ధమానము గావించుచుండెను. ఆపుట్టుపల్లెగ్రామ
మునందున్న యొక సామాన్యగృహస్థు యొక్క కన్నియను
వివాహమాడ నిశ్చయించుకొనెను. ఆమె ప్రస్తుతపరిస్థితుల
కనుకూలముగ విద్యాభ్యాసము సల్పి కళలయందారితేరి
యుండెను. ఆమెకు పదునారువత్సరములు. రజస్వలానంతర
వివాహమే కావున, ఆమె సౌందర్యలావణ్యముల కీయువకు
డు కట్టుబడి వివాహమాడ నిశ్చయించెను. వారిరువురు నప్పు
డప్పుడు కలిసికొని తమహృదయజనితవిలాసక్రీడలను వచనా
రూపకమున కొనసాగించి సంతుష్టిజెందుచు, ప్రణయబీజము
ను దినదినప్రవర్ధమానము జేయుచుండిరి. వారొకరినొకరు
ప్రేమించి యిప్పటి కాయుమాసములు కావచ్చెను. సుము
హూర్తములేనందున వేచియుండుటచే వివాహమింకను పొత్తు
బడలేదు.

ఆపట్టణమునందొక దివ్యసుందరభవనము చూపరుల
నేత్రములకు మిరుమిట్లు గొల్పుచుండెను. ఈభవనమునం
దెవ్వరో బొంబాయిపురవాసులు నవీనముగ రాజమహేంద్రి
వరముజేరి విడిసియుండిరి. వారందు ప్రవేశించిన కొలదికాల

మునకే మనలక్ష్మీజీకిని వారికిని ముఖపరిచయమేర్పడినది. ఆమూర్తనగృహస్థున కొక కుమార్తెయుండెను. ఆమెకు పదు నెనిమిదివత్సరములు. వివాహముకాలేదు. ఆమె గానవిద్యా నైపుణ్యమునం దద్వితీయురాలై యనేక కుటుంబములవారిమ నముల నాకర్షించుచుండెను. మనలక్ష్మీజీకూడ నప్పుడప్పుడు వారి గృహమునకేగినప్పుడు, తన సమ్మోహనాస్త్రమును నేత్ర వీటినుండి మాటున నక్క ప్రసరింపజేయుచుండెడిది. ఆమె కులటయా? కాదు. ఆగృహస్థు స్త్రీయైనా, తన భాగ్యభోగ్య ములచే నద్వితీయుడైన మర్యాదకుటుంబీకుని యొక్క నెలదినములలోనే పేరెన్నిక గాంచగల్గెను. అట్టివాని కుమా ర్తె కులట యగునా? ఆమె విద్యాభ్యాసము చేయుచుండు టచే నింకను వివాహము కాలేదు. తగిన వరునికై వెదకు చుండిరి. లక్ష్మీజీ మొట్టమొదట నామె మోహపాశము లకొంత గట్టుపడెను. ఏకాంతమున నప్పుడప్పుడు సంభా షించెను అతనిని మాటిమాటికిని తమ యింటికి బిలుచుట యు నామె తనతో చనవుగ మాటలాడుటయు దుర్భేద్యప్రా కావిశేషమని గ్రహింపజాలకపోయెను.

ఒకనాటి సాయంసమయమున వారిరువురును మోటా రుసైకిలునెక్కి వాహ్యాళికై పోయిరి. మార్గమధ్యమున నామె హఠాత్తుగ నేలపైబడెను. లక్ష్మీజీ యందుల కాతురతతో సైకిలునాపి క్రిందికిదుమికి యామెను లేవనెత్తి తనయొడిలో

కూర్చుండబెట్టి సేదదేర్చుచుండ నామెయు తననయనముల నువిప్పి నాకేమియు దెబ్బ తగులలేదని వారచూపులతో నాతనిహృదయమును నాటజెప్పెను. ఆమెచూడ్కు లాదినమున వింతగ బ్రసరించెను. లక్ష్మాజీ మానవమాత్రుడగుటచే నాక్షణ మానవమ్మోహాస్త్రమునకు గట్టువడెను. కాని క్రమముగ తనప్రేయసి జ్ఞప్తికి వచ్చెను. ఆమెచూడ్కు లేహ్యముగా దోచెను. ఆమెను సామాన్యస్త్రీలవలెనే యొక మోహకత్తెయని గ్రహించెను. అతనియూహల కాధారము లేదు. కాని యతని యంతరాత్మ యాతని కీప్రబోధము జేయుచున్నది. అతనిముఖ మకస్మాత్తుగ కళావిహీనమయ్యెను. కుశాగ్రబుద్ధియగు నామెయు నీతనిహృదయమును పసికట్టగల్గి యానాటినుండియు తన శక్తివంచనలేక పాటుపడి యాతని యాదరణకు పాత్రురాలగుటకు యత్నించెను. ఇప్పటి కారుమాసములు గతించెను. విఫలమనోరథయయ్యెను. ఆమె మనమందీర్ష్యాపిశాచ మావరించెను. దుర్భేద్యమగు వ్యూహము నొక్కదానిని ప్రయోగించి తన యాంతరంగికవాంఛను దీర్చుకొన బ్రయత్నించెను. ఆమెవ్యూహ మెద్దియో కొలదికాలమునకే మనపాఠకులు గ్రహింతురుగాక.

---

# 2

## విచారణ.

మేజస్ట్రీటుగారి కచ్చేరియంతయు కిటకిటలాడుచు ప్రజలచే నిండియుండెను. ఒక సౌందర్యవతియు నుత్తమవంశోజూరాలునగు యువతియొకర్తు మాయమయ్యెననియు, నాల్గురోజులపిదప నామె కళేబరము గోదావరియందు దొరకెననియు, నామెశరీరమున కత్తిపోట్లగపడుటచే నామె నెవ్వరో చంపియుండిరనియు పుకారు వాయువీచికలయందు మహావేగమున పరువులెత్తుచుండెను. ఇట్టివింతకుతోడు ఆపట్టణమునందొక గొప్పమారువాడీ యామెను చంపినవాడని తెలియవచ్చుటచే ప్రజాకల్లోలమునకు మేరలేదు.

ఆకచ్చేరిసావడియందొక బల్లపై నొకస్త్రీశవము పైచెప్పినచిహ్నములతో ప్రదర్శింపబడియుండెను. ముఖమెంతమాత్రమును గుర్తుపట్టుట కలవిగాకుండెను. ఇంతలో మేజస్ట్రీటుగారును ఆర్యులు వ్యక్తులును ఆన్యాయమంటపమును జేరి కొంతవడి యాశవమును పరిశీలించిరి. న్యాయమూర్తి ముద్దాయిని ప్రవేశపెట్టుమని యాజ్ఞనిచ్చి తనపీఠము నలంకరించెను.

తలుపు తెరువబడెను. చేతులను సంకెలలచే గట్టియుండినవిగ్రహము, ఆలఖ్మోజీ యాన్యాయమంటపమును బ్రవేశించెను. అతడట్టి దీనస్థితియందుండి కండ్లబడినతోడనే పాపమనువారును కంట తడిపెట్టువారును ఇతనియందన్యాయముగ

దోషారోపణ జేసిరనువారును వేరువిధములు చింతించువారునుగా నాప్రజాసమూహమంతయు నల్లకల్లోలముగ బరిణమిల్లెను. అతనిని ముద్దాయిప్రదేశమున నిల్వబెట్టిరి. న్యాయమూర్తి తనకాగితములను కలమును సిద్ధముజేసికొని కూర్చుండెను. వేత్రహస్తుడొకడు 'స్యైనాజీ, స్యైనాజీ, స్యైనాజీ' యని మూడుపర్యాయములు పిలచెను. ఆతురతతో నొకపురుషు డావేత్రహస్తుని పిలుపునకు ప్రత్యుత్తరమిచ్చుచు సభామంటపమును ప్రవేశించి వాదిస్థానము నాక్రమించెను. యథావిధిగ నాతని ప్రమాణము చేయించిరి.

నీవాఙ్మూలమును చెప్పుమని మేజస్ట్రీటుగా రుత్తరువానగ నాతడిట్లు ప్రారంభించెను ఆశవము వంక వ్రేలిడిజూపుచు "నే నీ కళేబరమును గుర్తించితిని. అది నాకుమార్తెయొక్క విగ్రహమనుట కెంతమాత్రము సందియము లేదు. ఏప్రియల్ యిరువదియొకటవతారీఖువర కామె జీవించియే యున్నది. సాయంసమయమున వస్తులను ధరించి యెచ్చటికో పయనమగుచుండ చూచి ఎచ్చటికని ప్రశ్నించితిని. "లక్ష్మాజీతో కలసి షికారు పోవుచుంటిని. గోదావరియొడ్డుననున్న వంతెనపై నన్ను కలసికొనవచ్చును." అని ప్రత్యుత్తరమిచ్చెను. వేరొక సందర్భమున నామె యొంటిగపోవుట కిచ్చగించెడివాడనుకాను. కాని, వారిరువురు నొకరినొకరు గాఢముగ ప్రేమించి యుండుటచేతను వారిప్రేమబీజ మట్టి యేకాంతవిహారములం

దు వృద్ధిపొందునని విశ్వసించి యామెపయనమున కిచ్చగించి తిని. అదియే మాకిరువురకును కడసారిచూపు. తిరిగి యామె నాగోదావరియందు మరణించి పడియుండుట చూడగల్గితిని.”

మేజ—నీవా కళేబరమువద్ద కేగి యామెను గుర్తింపగల్గుదువేమో చూతుము.

స్యేనాజీ—చిత్తము. గుర్తింపగల్గితిని. దేవరవారియనుజ్ఞ యయ్యెనేని వేరొక విచిత్రవృత్తాంతమునుగూడ తెలియజేయ నువ్విళ్ళూరుచున్నాడను. సెలవొసంగిన చెప్పెదను.

మే—ఈ కేసుతో సంబంధమున్న చెప్పుము.

స్యేనాజీ—చిత్తము. ఈముద్దాయితండ్రి యీపరదేశములకువచ్చి యొకకన్యను వివాహమాడి యామెవలన నీపుత్రుని గాంచగల్గెను. నే నీతనియందు వర్తకవిషయకక్రోధబుద్ధితో నిందారోపణ జేయుచుంటినని న్యాయవాదులు నాపై నింద మోపవచ్చును. కాని యీయువకుని తండ్రియు నేనును అన్నదమ్ముల మనిమాత్రి మాసమయమున తెలియ చెప్పవలసివచ్చినది. కుటుంబకలహములవలన నాతడీపట్టణమునుప్రవేశించెను. నేను బొంబాయియందే వర్తకము చేయుచుంటిని. కాలవశమున నేనును యీపట్టణమునకే వచ్చి, యిట్టివిషాదముల పాల్గావలసివచ్చెను. మాకులమున నన్నదమ్ముల బిడ్డలను వివాహముచేయుటయం దాక్షేపము లేకుండుటచేతను, మాకుటుంబము నవీననాగరకత ననుసరించి

రజస్వలానంతరవివాహము, స్వేచ్ఛావాదవల కంగీకరించు టవలనను, వర్తకము చేయుచుండెనుగదా యని యీయువతీ యువకుల కలయిక కనుమతించితిని.

ఈవృత్తాంతమంతయు వెలిబుచ్చుసమయమున నత్యాశ్చర్యమున నయనములను ముకుళించి మన లక్ష్మీజీ యాలకించుచుండెను. ఈ బాంధవ్య మాత నిదివర కెన్నడును విని యుండలేదు. తనతండ్రి తనతాత కొక్కరుడేకుమారుడని స్పష్టముగ నెరిగియుండెను. ఇప్పు డీవ్యక్తి తన పెదతండ్రియని బయలుదేరుట జూడ నిందేదియో మహారహస్య ముండి యుండవలయునని గ్రహించి తన దురవస్థకు పరమేశ్వరుని కై దృష్టిసారించి విచారింపజొచ్చెను. అతను తీర్చియున్న న్యాయవాదులను, మేజస్ట్రేటు వారిని సంబోధించి, "దేవర వా రనుగ్రహింతురుగాక! ఈచరిత్రమంతయు సర్వాబద్ధ మని చెప్ప సాహసించుచున్నాను. క్షమింపుడు" అని చెప్పెను. చూడవచ్చినవారియం దల్లకల్లోలము ప్రారంభమగుతరి వేత్రహస్తు డొకడు వారిని మందలింప తిరిగి నిశ్శబ్ద మేర్పడెను. మేజస్ట్రేటుగా రీవృత్తాంతముపై నిట్లు చెప్పిరి. "ఈకథ యంతయు ప్రస్తుతచర్య కెంతమాత్రమును సంబంధములేదు. వేరువిషయములనుగూర్చి చర్చచేయునప్పుడు విచారింపవచ్చును. నీవు నాపూర్వప్రశ్నకు అనగా ఆపడియున్న కళేబరము నీకుమార్తెదయినట్లు, స్పష్టముగా గుర్తింపగల్గితివో లేదో చెప్పుము."

స్నేనాజీ—చిత్రము. ఆమెముఖమంతయు వివర్ణమై గుర్తించుట కలవిగాక యున్నది; కాని తక్కుంగల అవయవ చిహ్నములన్నియు నాకుమార్తెవేయని స్పష్టముగ గాన్పించు చున్నవి. ఆమె భుజముపై నున్న పెద్దమచ్చ, తలవెండ్రుకల నిడివి, పలువరస, శరీరవైఖరి—అన్నియు నాకొమరితవే. ఆమె వ్రేళ్ళనిడికొనియున్న బంగారుయుంగరములను నేనే బహుమానము చేసియుంటిని. అందు శా॥ అని యామెనామ ముగూడ చిత్రింపబడియున్నది. ఆమె దుస్తులపై శా॥ యను నక్షరము లిఖింపబడియున్నది. ఇంకా చెప్పనలవికాని యితర విషయములుగూడ నాకుమార్తెయగు శారదయే యీ మృతకళేబరమని స్పష్టముగ జెప్పుచుండ నాకు సందేహించుట కెంతమాత్ర మవకాశము లేదు.

ఈ వాఙ్మూలము ప్రేతయొక్క నిజానిజములను ధ్రువపర్చెను. తరువాత నిద్దరుసాక్షులు విచారింపబడిరి. వారిరువురును వైద్యులు. వారు శరీరమును పరీక్షించిన సారాంశమంతయు జెప్పి విరమించిరి. తరువాతసాక్షి వెంకటేశ్వరరావు. అత డింతవరకీవాది ప్రతివాదులతో నేమియు సంబంధము కల్గియుండలేదు. అతనిని బోనునందుంచి యథోచితముగ ప్రమాణము జేయించిరి. తరువాత నాత డిట్లు చెప్పసాగెను.

“ ఇరువదియొకటవతారీఖునాటిరాత్రియే యీముద్దా

యుక్తిని నాకును ముఖావలోకన జరుగుటకు ప్రథమవర్యా యము. అతడొక యువతితో గోదావరీవంతెనపై మాట్లాడు చుండెను. ఈపడియున్న ప్రేత ధరించిన దుస్తులే యామె ధరించి యుండెను."

"ఎన్నిగంటలకు?" అని ప్లీడరుగా రడిగిరి.

"తొమ్మిదికి అయిదునిమిషము లుండెను."

"వారిని చూచునప్పుడు నీ వెచ్చట నుంటివి?"

"నేను పట్టణములోనికి కొవ్వూరునుండి వచ్చుచుంటిని."

"నీవు చూచిన దీయువతియే యని నిరూపింపగలవా?"

"స్పష్టముగా చెప్పగలను. అది వెన్నెలరాత్రి. వారికి మూ డడుగుల దూరమునుండి నేను నడచి వచ్చితిని."

"తొమ్మిది గంటలయిన దని నీకెట్లు తెలియును?"

"వంతెన చివరకు వచ్చియుండుటచే నాగడియార మును దీసి చూచితిని. నేను పట్టణమున నాటకమును జూడ వచ్చి యుండుటచే సరియగు వేళకు వచ్చితినా లేదా యని గడియారమును చూచితిని."

"తరువాత?"

"నేను సమీపమున నుండ వా రిరువురును మాట్లా డలేదు. నేను దాటిపోయిన తరువాత సంభాషణను ప్రారంభించిరి. ఆయువతి మాటలు నాకు వినవచ్చెను. "నీవు నా

మొదల నపకృతి యొనర్చుచున్నాడవు. నన్ను ప్రేమించి యిప్పుడు పోద్రోలుట నీకు భావ్యము కాదు" అని. తరువాత పురుషవచనములు వినవచ్చెను. "నేటితో నీవు నాముఖమును జూడ నవసరములేదు. నేటితో నీవు నాపొత్తు నపేక్షించుట సమాప్తమగును" అనెను. నేను వీరి సంభాషణలయం దెద్దియో వైషమ్యము లున్నవని మానవమాత్రుడ నగుటచే నచ్చటనే నిలచిపోయి ప్రక్కనున్న యొకరాతి ప్రక్కనొదిగి వీరిసంభాషణల నాలించితిని. ఆమె యాతని వచనముల కాగ్రహించి ఏమి చేయగలవని రెట్టింప నాత డందులకలిగి తనచేతి నెత్తెను. నే నావెన్నెలరాత్రియం దాతని హస్త మామె శరీరమున మూడుమారులు పడుట జూచితిని. ఆమె యాతనినుండి తప్పించుకొన యత్నించుచు పెనగులాడెను. అకస్మాత్తుగ వా రిరువురును మాయమైరి. నేను విస్మయము జెంది లేచిచూచునరికి నీటియం దొకపెద్దధ్వని యయ్యెను. పరుగుపరుగున పోయి చూచునరికి నీటియందు నాకేమియు నగపడలేదు. వా రిరువురు నా నీటియందు పడి మునిగిపోయి రని యూహించి వెనుకకు మరలిపోతిని."

ఈసాక్ష్యముపై సభయందు కదలిక గల్గెను. ముద్దాయి దీనుడై చూచుచుండెను. అతని మానసభావము లెట్లుండునో యని యందరు నాతనిపై దృష్టులను బరపిరి కాని యతడేమియు కళవళకదు చిహ్నములను వెలిబుచ్చకుండెను.

తరువాత కొందరు సాక్షులను విచారించిరి. వారు శవ మును తీయుట, గాయములను చూచుట మొదలగు వాంశ ములను గూర్చి చెప్పిరి. మేజస్ట్రీటుగారు ముద్దాయివంక దిక్కి, ఏమయిన చెప్పుకొనెదవా? యని ప్రశ్నించెను. తాను నిర్దోషి నని చెప్పెను. ఉత్తరసాక్ష్యు లున్నారా? అని ప్రశ్నించిరి. లేరనియు తన వృత్తాంతమునకు పరమేశ్వరుడే సాక్షియనియు బదులు పలికెను. అత డిట్లు నిర్దోషినని చెప్పినంతనే మేజ స్ట్రీటుగారే తీర్పుచెప్పిన ట్లాతని మిత్రబృందమును తక్కు- గలవారును సంతసించిరి. కాని వేత్రహస్తుడు వారి సంభాష ణల గట్టిపెచెను. మేజస్ట్రీటుగారేదియో చెప్ప ప్రారంభిం చిరి. కాని తిరిగి కలకలము ప్రారంభమయ్యెను. ఈమారు వారియల్లరి ముద్దాయి దుస్థితిని గూర్చి కాదు. ఒకవ్యక్తి వారిని చేతులతోడ నెట్టుకొనుచు వచ్చి సభాస్థలిని నిల చెను. అతని యాకృతి త్రాగుబోతువలె నుండెను.

మేజ—వీరడూ! యేమి పనిమీద వచ్చితివి?

వీరడు—సిత్తం. యీగెందరగోలం అంతా ఎందుకో కనుగొందామ నొచ్చాను బాబూ!

వీరడిని చూడగనే పోలీసువారు పరుగు పరుగున వచ్చి అవతల కీడ్చివేయ నుంకించిరి. కాని మేజస్ట్రీటుగారు వాని వృత్తాంతము విననెంచి వారిని వారించి "యీహత్యను గూర్చి నీకేమయిన తెలియునా?" యని ప్రశ్నించిరి.

వీరడు—సిత్తం. యీలచ్మాజీగో రీయమ్మాయిని సం
పిన్రిని తెలుత్తుండారు బాబూ? యిరవై యొకటో తారీకు
నైతె యియ్యాలకి నాలుగురోజులౌతాది గాదండి మాప్రభో?

మేజ—అవును. చెప్పదలచిన త్వరగా చెప్పు.

వీరడు—అయ్యాలే యని రుజువయిందా బాబూ?

వీరని ప్రశ్నలకు మేజస్ట్రేటుగారికి కోపము రాసాగెను. వాని నవతలకు తరిమివేయ నాజ్ఞనివ్వ జూచుచుండ "సామీ! కోపంవద్దు. యీయిసయాన్ని గూర్చి ముక్యమయిన విసేసం సెప్తాను యినండి. ముందు పెమాణం జేయించండి." అని యాత్రాగుబోతు చెప్ప వల్లె యని యథావిధిగ నాతనిచే ప్రమాణము చేయించిరి.

వీరడు—మహాప్రభో! నే నీసేనాజీగోర్ని, ఆయన కూతుర్ని శానరోజుల్నుం చెరుగుదును బాబూ! ఆతల్లిని సంపినట్టయితే నిన్నను సంపేసుండాలి గాని నాలుగురోజులకింద గాదండి. ఎందుకంటే నాపెమాణపూర్తిగా ఆతల్లి యీసేనాజీగోరు నిన్నపొద్దున్న సౌక్యంగా కూకోని మాట్టాడుతావుండడం నేను నాకళ్ళారా సూశానండి. నమ్మినాసరే నమ్మకపోయినా సరే! నాకు తెల్సింది సెప్పాను.

వీరడుచెప్పిన విశేషము విద్యుచ్ఛక్తివలె నందరిరక్తనాళములందును ఒక్కసారిగ ప్రసరించెను. స్యేనాజీ తోకద్రొక్కిన త్రాచువలెలేచి యావృత్తాంతమంతయు వట్టి కల్ల

యని పాడెను. న్యాయవాదులందఱు నోకరిముఖ మొకరు చూడసాగిరి. ఈసభానదు లందరిలో హృదయమునం దిసు మంతయు కళవరములేక నిశ్చలముగా జూచుచున్న దిరువురు పురుషులుమాత్రమే. వారు ముద్దాయిగా నిలచియున్న లక్ష్మాజీయును, సాక్ష్యమిచ్చిన వీరడును. ఎట్టకేలకు మేజస్ట్రీటుగారు తమ యాందోళనాసముద్రమునుండి దరిజేరి తెప్పరిల్లి వ్రిజాకల్లోలమును వారించి యావీరనివంక తిరిగి యిట్లు ప్రశ్నించెను. "ఓరీ! నీవు త్రాగియున్నావా?"

వీరడు—బాబూ, సత్తెం సెపుతాను. యియ్యాలపొద్దున్నే కొంచెం కల్లునీల్లు తాగినమాట సత్తెం. కాని నేను సెప్పేదంతా బాగా గేనంతోటే సెపుతుండా. నిన్న పొద్దున్న ఆరు మాట్లాడుతూంటే సూసినప్పు డసలేతాగలేదు." ఇంతలో ఫిర్యాదుతరపు వకీలుగారులేచి "అయ్యా! యీవీరడు వట్టితాగుబోతనుట యీపట్టణమందరకును తెలిసినవిషయమే. అదియునుగాక పూర్వమొకప్పుడు వీరడు గోదావరిలో కాలుజారి కొట్టుకొనిపోవుచుండ లక్ష్మాజీ యాతని రక్షించుటగూడ నందరకును తెలసినదే. అప్పటినుండియు వీరడాతని యడుగులకు మడుగులొత్తుచు ననేకమన్ననల బడయుట నావీధివారందరకును క్రొత్తగాదు. అందువలన తనప్రాణదాత కాపద వచ్చినది తెలసి యాతడు వట్టియబద్ధమును కల్పించి తనవిశ్వాసమును జూపవచ్చెను.

ఇతనిమాటలను విశ్వసించుట కెంతమాత్రి మవకాశ ములేదు. కావున కోర్టువారికి మనవిచేయున దేమనగా, నీతని సాక్ష్యమునం దెంతమాత్రమును సత్యము లేనందున వాఙ్మూలములందు రచింపకుండుటయే యుత్తమము." ఆవకీలుగారి మనవికి మేజస్ట్రీటుగారు తలపంకించుచు "అవును. విశ్వసించుటకు వీలు లేదు. కాని ప్రమాణముచేయించి సాక్షిగా నంగీకరించి యుండుటచే వాఙ్మూలము వ్రాసికొనక తప్పదు." అని యాతనికి బదులుచెప్పి వీరనివంక జూచి "వీరడూ! నీవు నీయిష్టముపై సాక్ష్యమిచ్చితివి. నిన్నెవరును కోరుకొనలేదు. నీసాక్ష్యమును కోర్టువా రెంతమాత్రమును విశ్వసింపరు మోతుబరులందరును ఆమె యాతని కుమార్తెయని చెప్పుచుండ నీవు దానికి విరుద్ధముగా చెప్పిన నెవరును విశ్వసింపజాలరు. అసత్యసాక్ష్యమునకు నిన్ను శిక్షింపవలసివచ్చును. నీసాక్ష్యమును వ్రాసికొనుమనెదవా? లేక విడచిపుచ్చుమనెదవా? రెంటిలో నొకటి కోరుకొనుము."

వీరడు—సిత్తం. నాకు తెల్సింది సెబుతుండాగాని, అబద్దం సెప్పునప్పుడు నాకేంబయం. రాసుకోండి సెబుతాను. నాకు యేలపట్టున బువ్వదొరకదని యీ యూరందరికి తెలుసు. అప్పుడప్పుడు కూట్లోకేదీ లేకపోతే సేపలుపట్టేటందుకని బయలుదేరుతా. నిన్న తెల్లారుగట్ల గాలం దీసుకుని గోదారి గట్టుకెల్లి సేపలుపడుతుండంగా ఒకాయన సైకిలేసుకొని గో

దారికట్టంట పోతుండాడు. యింతపొద్దున్నే ఎక్కడకు పోతుం డాడోయని వెనక్కితిరిగి సూసేతలికి ఆ పోతుండాయన్ని గుర్తుపట్టగలిగాను. ఆయనే యీసేనాజీగోరు. కూతురు నచ్చి పోయిందని బెంగెట్టుకొని పోతుండాడేమో అనకొని నాకని నేను సూసుకుంటావుంటే కొంతదూరంపోయి సైకిలుదిగి యేటిదరిదాకా వొచ్చాడు. నేనున్నూ మెల్లిమెల్లిగా నాగా లం యేసుకుంటూ ఆయనదగ్గిరగా వెల్లాను. జేబురుమాలు దీసి చెయ్యియిసిరాడు. అప్పుడే తెల్లారింది. యింకా ఎవరయ్ని గట్టుమీద తిరగటంలేదు. వెంటనే గోదారిలో ఒకపడవమీద యిద్దరు వొడ్డుకొత్తావున్నట్టాపడింది. దగ్గిరకొచ్చేకలికి సూస్తే సాపితేనమ్మతారో నమ్మరోగాని నావొల్లు నీరైపోయింది. శారదమ్మగోరున్నూ యింకోఆయన వడ్డున దిగారు.

మేజ—ఇంకొకాయన వున్నాడని చెప్పినావు. ఆయ న ఎవ్వగో నీకు తెలియునా?

వీరడు—తెల్దుబాబూ! ఆయ న్నిదివరకెప్పుడు సూ డ్లేదు. కాని నిన్ననే సూశాను గనుక గుర్తుపట్టగలను. ఆ బాబిక్కడే వుండాడు.

మేజస్ట్రీ—ఇక్కడనా! గుర్తుపట్టి చెప్పగలవా?

వీరడు—సిత్తం." అని చెప్పు ను వారిద్దరును తగవులాడు కొనుటను చూచితినని చెప్పిన వెంకటేశ్వరరావుకై వేలుచూ పెను. మూగిన జనసమూహమం దల్లకల్లోలము హెచ్చెను.

వెంకటేశ్వరరావు పులికిపడి కోర్టువారిని సంబోధించి "యీనీచుడు తాగ్రి అనవసరప్రసంగములు చేయుచున్నాడు. వీని నిందలూరక పోనీయరాదు. కోర్టువారు చిత్తగించి వీనిని పదిలపరుపుడు. తరువాత వీనిపై చర్యదీసుకొనెదరు?" అని యుద్బోధింప మేజస్ట్రీటుగారును వీరనిమాటలయందు విశ్వాసమిసుమంతయు లేనికారణమున నాతని తాగ్రుబోతుగను, అపవాదులను చాటువానిగను అరెస్టుచేసి పదిలపరిపించెను. వారు తమ పీఠముపై కొంతవడి యోజించుచు జేరబడి "ఈవిషయములన్నియు కూర్చి చూడ లక్ష్మాజీ నేరముచేసినట్లు స్థిరమగుచున్నది. అతడే యామె నానదియందు దోచెననుటకు సందియములేదు. ఇతనిని సెషన్సుకు కమిట్ చేయుచున్నాను." అని తనతీర్పును జెప్పెను. వెంటనే పోలీసువారాసమూహమును గెంటుట ప్రారంభించిరి. లక్ష్మాజీమిత్రులాతనికై చింతించిరి. కాని చేయునదిలేక తిరిగిపోయిరి. లక్ష్మాజీ విచారణదినమువరకును కారాగారమున బంధింపబడెను. హత్య నిరూపింపబడుటచే జామీను నిచ్చుటకు మేజస్ట్రేటుగా రంగీకరింపజాలకపోయిరి.



## 3

### నేటితో నీభూతమున కుద్వాసము జెప్పెదను.

ఇరువదియొకటవ ఏప్రియల్ తేదీ సాయంత్రము యీహా త్యకు పూర్వము గోదావరీతీరమందొక చిన్నయింటి పెరటి యందొక యువతియు యువకుడు విలాసముగ సంభాషించు చుండిరి. ఈమె శారద కాదు. ఆమె యంత యపూర్వసౌంద ర్యవతి గాదు. ఆమె శారదవలె అహంభావగర్వములు గల్గి యుండలేదు. చక్కనిది. నిగర్వచూడామణి. స్వచ్ఛందహృ దయ. ఆమె కనులపొంకము, పెదవులసౌరు, వదనవిలాసము జూడనొక యుత్తమగుణ సౌందర్యరాశి యని జెప్పకతప్ప దు. ఆదినము వారికి సుదినము. మలయమారుతవిలాసముల కుదోడు, వారివివాహశుభముహూర్త మాదినముననే నిర్ణయ ముచేయుటచే వారిహృదయానందము పొంగి పొరలుచుండె ను. "ఈమె నాభార్య యని కరమునుబట్టి నాబంధుమిత్రులకు జూపుభాగ్యము కల్గుచుండెను గదా" యని యాత డువ్విళ్లూ రుచుండెను. ఆమెయు హృదయవిలాపమును వెలిబుచ్చుటకు వచోధోరణి ఓటుబడ రెప్పవేయక తన ప్రాణధవు నిరీక్షించు చు నిలచియుండెను.

నవీన నాగరికత ననుసరించి యామె తలిదండ్రులు బ్రహ్మమతమును స్వీకరించుటచే నామె కిప్పటికి పదునా రు సంవత్సరములు దాటుచుండెను. స్వచ్ఛందమోహపాశ

మామె హృదయము నీయువకుని హృదయమునకు జట్టికొని బంధించివైచెను. ఆమెపేరు లలిత. నామమున కనుగుణ్యమగున ట్లామెశరీరము హేమలతలనుబోలి నిగనిగలాడుచుండెను.

ఇంతలో గోదావరీతీరమున నొకస్త్రీ నడచిన యలికిడి గల్గెను. ఒకసౌందర్యవతి యాగృహమువైపున కొయ్యారముగ నడచివచ్చి తనచూపులను లక్ష్మోజీవంక ప్రసరించి రమ్మని సైగచేసెను. లలిత ముఖాకృతి మారిపోయెను. ఆమె ఖిన్నురాలయ్యెను. లక్ష్మోజీవదనమునుండి రక్త మెచ్చటికో పరువెత్తిపోయెను కాని క్రమముగా తిరిగివచ్చి యాతని ముఖము దు తాండవించి యాగ్రహతీవ్రతను జూపుచుండెను. "ఆమె విలాసగమనముల కెవ్వరును దొరకలేదు కాబోలు. నన్ను బాధించుటకు వచ్చినది" అని విసుగుకొనెను.

లలిత—ఆమెతో మీరు పోవలయునా?

లక్ష్మోజీ—అవును. ఆమె నాపాలిటి పెనుభూతము వలె వచ్చినది.

లలిత—అట్లయిన మంత్రించి యాభూతమును విడిపింపుమనెదరా?

లక్ష్మోజీ— అక్కరలేదు. నేనే యీదినముతో నీ భూతమున కుద్వాసము జెప్పెదను." అని చెప్పుచు నాతడు నిష్క్రమించెను.



# 4

## పైశాచిక నారి.

“అట్లైన నన్ను ప్రేమించుట లేదా?”

“తిరిగి యాప్రశ్న నే యేల యుచ్చరించెదవు?”

ఈసంభాషణ మిరువురు యువతీ యువకులకు జరుగుచుండెను. వారు శారదాలక్ష్మీజీలని మనపాఠకులకు వేరుగ చెప్పనవసరములేదు. వారు గోదావరీనదిపై నిర్మింపబడిన వంతెనపై నిలువబడి మాటలాడుచుండిరి. భూభాగమున అఖండగౌతమి యథాప్రకారము ప్రవహించుచునే యుండెను. వారిముఖకాంతు లుద్రేకపూరితమై యుండెను. యువకుడు వంతెనప్రక్కకమ్మి నానుకొనియుండెను. యువతి వాని కెదురుగ నిలువబడి యుండెను. ఆమె చేతి నాడించుచు నాతని నెద్దియో ప్రశ్నించెను. అతని యుత్తరముపై నామె కోపము క్రమముగ హెచ్చుచుండెను.

శారద—అట్లయిన నీవు లలితను ప్రేమించుచుంటివా?

లక్ష్మీజీ తన సిగరెట్టును తీవ్రముగా పొగలూదుచు తన హస్తముల నాకమ్మీనుండి తొలగించి “శారదా! ఆ ప్రశ్నకు జబాబీయజాలను” అని యథాస్థానము నాక్రమించుకొనెను.

శారద—అట్లయిన నీమనోభావమును గుర్తించితిని.

లక్ష్మీజీ—కావచ్చును.

శారద—నన్నొక కీల్బొమ్మవలె నాడించి పరిహాసా స్పదముగా జేయజూచుచుంటివా?

లక్ష్మీ—ని న్నెన్నడయిన పరిహాసించితినా? లేక నన్ను ప్రేమింపుమని చెప్పియుంటినా?

శారద—నిన్ను ప్రేమింపుమని నన్ను ప్రోత్సహించితివి.

లక్ష్మీజీ—ఎప్పుడు?

శారద—నీనోటితో చెప్పియుంటివి.

లక్ష్మీజీ—శారదా! అబద్ధములు పల్కకుము.

శారద—నేను నిజమునే పల్కుచుంటిని. నిశ్చలముగ ప్రేమించి, నాహృదయము నాకర్షించి, చివర కకస్మాత్తుగ కారణములేకయే వేరొకయువతిని వివాహమాడ సిద్ధముగ నుంటినని చెప్పవచ్చు పురుషు నింకొకని నీమూడుజగములందును విని కని యుండలేదు.

లక్ష్మీ—నీకు పిచ్చిపట్టినది. లేకున్న నిట్లు పలుక సాహసింపవు.

శారద—నీకే పిచ్చిపట్టినది. వలచినయువతి ననాదరణచేసి త్రోయనెంచి యబద్ధముల కొడిగట్టితివి.

లక్ష్మీ—నీవ్యర్థప్రలాపములు కట్టిపెట్టుము.

శారద—నన్ను వివాహమాడువరకును కట్టిపెట్టను.

నీవు నాయెడల నపకృతి యొనర్చుచున్నావు. నన్ను ప్రేమిం
చి యిప్పుడు పోద్రోచుట భావ్యము కాదు.

లక్ష్మి — నేటితో నీవు నాముఖమును జూడనవుసర
ములేదు. నేటితోడ నీవు నాపొత్తు నపేక్షించుట సమాప్త
మగును. నేను లలితను వివాహమాడ నిశ్చయించుకొనియుం
టిని. మొదటినుండియు నామెనే ప్రేమించియుంటిని. ఇప్పు
డు నీముఖావలోకనగూడ నసహ్యకరముగ నున్నది. ఆవలకు
బొమ్ము.

ఈప్రసంగము జరుగుసమయమున నొకవ్యక్తి యీ
వంతెనపై వారిసమీపముగ దాటిపోయెను. అతడు వారిసం
భాషణల వద్దుపరుపకయే వారివంక జూచుచు సాగిపోయెను.
అతనిజాడలు దూరమయిన తరువాత లక్ష్మిజీ "నినొ్కప్రశ్న
వేయవచ్చునా?" యని యామె నడిగెను.

శారద — వేయుము.

లక్ష్మిజీ — నీ కీవిషయమున నాంతరంగికులుగాని స
హచరులుగాని యుండిరా?

శారద — లక్ష్మిజీ! నీప్రేమ నాకవుసరము లేదు. నీ
ముఖమును జూడనొల్లను. నాప్రేమయంతయు నీపై నీర్ష్యా
భావముగ పరిణమిల్లెను. నాహృదయాంతరాళమున పైశా
చిక భావనలు పర్యులెత్తుచున్నవి.

లక్ష్మాజీ—నీవు పిశాచమగుట కెంతమాత్రమును సందియములేదు.

ఈమాటపై శారద పిశాచరూపమును దాల్చిన ట్లాతనిపై నొక్కపెట్టున నురికెను. అతడామె పాటునుండి తప్పించుకొనజూచెను. కాని యజాగ్రతగనుండుటచే నాకమిట్టలపై నుండి గౌతమీప్రవాహమున బడుటకు సిద్ధమై, ప్రాణాపాయమునందున్న ప్రతిమానవునివలెనే శరణోపాయము గానక యామెచీరను గట్టిగ బట్టుకొనగా నామెయు తనతోడనే యావంతెననుండి యూడి యాప్రవాహమున బడెను. కాని యీతయం దద్వితీయుడగుటచే లక్ష్మాజీ తెప్పరిల్లి తనయొనర్చిన యుపకృతిని గుర్తెరింగి యామెను సంరక్షింపనెంచి యామెపడినదికొక్కనకై జూడ నామెను వేరొకవ్యక్తి యంతకుపూర్వమే యొడ్డునజేర్చి మహావేగమున నానిశీధమందు పలాయనమగుచుండిరి. వారు దృష్టిపథమును దాటిపోయినపిదప లక్ష్మాజీ తీరమును జేరి తనగృహమార్గమును బట్టి పోయెను.

---

# 5

## ఊహలు.

దినములు గడచుకొలది తగ్గుటకు మారీపత్రికాకల్లోలము క్రమముగ నభివృద్ధి జెందుచుండెను. వార్తాపత్రిక లన్నియు నీహత్యనుగూర్చి మారుమ్రోత లిడుచుండెను. లక్ష్మాజీ నింద్యారోపణ నిజమగువరకును సన్మార్గవర్తి యని వేనోళ్ల పొగడబడుచుండుటచే నాతనిపై దోచిన నింద యంతెంతమాత్రము విశ్వసింపరా దనియు నత డెంతమాత్రము నట్టిహత్యల నొనర్పజాల డనియు కొందరు విడువక వాదించుచునే యుండిరి. మరికొందరు సాక్ష్యముపై నమ్మకగల్గి యతడే హత్య యొనర్చెననియు, ద్రవ్యవంతుడను మోమోటముచే విడచిపుచ్చిన భవిష్యదావస్థల స్వస్థపరిచారముల కాటంకము గల్గుననియు తగినశిక్ష విధింపవలయు ననియు ఘోషించుచుండిరి. రాజమహేంద్రపురవాసులలో కొందరు పేరని వాక్యము లన్నియు సత్యములే కావచ్చుననియు నతని యాస్తికై యాశించి స్యేనాజీ యీపన్నాగమును పన్నె ననియు లక్ష్మాజీ నిర్దోషి యనియు శంకించుచుండిరి. వారి యనుమానములు వట్టి వాయునిర్మాణములుగాక కొన్నికొన్ని సందర్భములపై నాధారపడియుండెను. శారద యిరువది యొకటవతారీఖునసే కనబడుట లేదని సాక్ష్యమిచ్చిరి. కాని వారు శారదపోయినట్లు యిరువదియైదవ తేదీ మధ్యాహ్నము

వరకును యిరుగుపొరుగువారికి గాని యితరులకుగాని చెప్పి
యుండలేదు. శవము ఉదయము పదిగంటలకు దొరకెను.
ఆమె తమ కూతురగునట్లును, యిరువదియొకటవ తారీఖునుం
డియు కనబడుటలేదనియు, మధ్యాహ్నము పన్నెండు గంట
లకు వెల్లడిచేసిరి. నాల్గుదినములవరకును ఆమె పోయినట్లేల
మరగుపరచితిరని స్వైనాజీ నడుగ తనభార్యకు హృద్రోగ
ముండుటచే నట్టి విషాదవృత్తాంత మామె ప్రాణముల కడ
బట్టజేయునని శంకించి యామెకు తెలియకుండునట్లు చేయవ
లసివచ్చెనని యొకకథ జెప్పెను. కొమరిత పోవుట యింట
యుండు తల్లికి తెలియకుండగ నెట్లు దాచగల్గుదురో కదా !
స్నేహితు లింటివద్ద నుండెనని యామెకు సమాధానము చె
ప్పిరట. ఈచరిత్ర కొందరు విశ్వసించిరి. కొందరు బూటక
మనిరి. స్వైనాజీభార్యను జూచినవా రామె కెట్టివ్యాధియు
లేదని ఘంటాపథముగ చెప్పగల్గుటయే దీనికి కారణము.
అదియునుగాక శరీరమందు నాల్గుగాయములుమాత్ర మగప
డుచుండ ముఖమానం దేవిధమయిన కాట్లును లేకుండగనే
ఆమెముఖము గుర్తుపట్టనలవిగాకుండ మారిపోవు టెట్లు సం
భవించును ? కాని యీప్రశ్న లన్నియు నరణ్యరోదనము ల
య్యెను. లక్ష్మాజీకష్టదశయం దాలిని దాపుననుండి సేదదే
ర్చుటకు లలిత బయలుదేరెను కాని తన్నొంటరిగనే విడువు
మని లక్ష్మాజీ యామెకు కబురంపెను. ఆమెకు పంపిన లేఖ

యందు తాను నిర్దోషినని వ్రాసియుండును. అదియే ఆమెకు వేదవాక్కు; కాని యానాటి సాయంసమయమున తన్ను వీడి పోవుచు చెప్పిన వచన మామెకు జ్ఞప్తికివచ్చి హృదయసీమను ప్రతిధ్వనించుచుండెను. "నేనే యీభూతమునకు నేటితో యుద్వాసము జెప్పెదను." తన్ను సాక్ష్యమునకు బిలిపించి యీవచనమును జెప్పింతురేమోయని భీతిల్లజొచ్చెను. ఈవిపరీత నిందారోపణకుతోడు ఎన్నడును కని విని యెరుగని బాంధవ్య మొకటి బయల్వెడుట యొకటి. స్వైనాజీ లత్స్మాజీకి పినతండ్రియగుట తథ్యమేయగుచో నాతని మరణాంతర మాతని యాస్తికి స్వైనాజీయే వారసుడగును గదా! అదియంతయు నతని యాస్తి నపేక్షించి పన్నినవ్యూహామా యని చాలమంది శంకించిరి. సెషన్సువారి తీర్పునకై యందరును నిరీక్షించుచుండిరి. హత్య జరిగి మూడువారములు గతించినది. నేడే సెషన్సువారి విచారణ ప్రారంభమగును.

యాకస్మికముగ జుట్టుముట్టి యాతని ప్రాణములను గొనిపోయిన నాతని కళేబరమును జూచుచు నొక్కక్షణము చింతించి తమదారినిపట్టి యందరును పోయెడి వారే కాని, యీక్రమవిధానమునందు ముందేమి జరుగనున్నదో, అతడు దోషియగునట్లు నిర్ధారణ జేయబడునో, యుర్రిశిక్ష విధింతురో, యేమి జరుగనున్నదో యని యావప్రజావళి హృదయము, అందు లలిత నిర్మలహృదయము, ఆందోళన

ముతో గొట్టుకొనుచుండెను. ఆమెకు నిద్రాహారములు రుచిం
చుటలేదు. ఒకనాటి రాత్రి వెన్నెల కాయుచుండెను. తాపో
పశమనార్థము తనగృహమును విడచి యఖండగౌతమీవిలా
సముల నొక్కసారి తిలకించుచు రెండడుగులు వైచెను. ఆమె
కు గమ్యస్థానము లేదు. తన హృదయపరితాపమునుండి
తప్పించుక పలాయన మగుటయే యామె యాదర్శకము.
పరమేశ్వరచింతన హృదయమందు నిశ్చలముగ నిలచియుం
డెను. ఆమె మనమందు తన మనోనాథునివచనము లన్నియు
జ్ఞప్తికి వచ్చుచుండెను. "నీవు నాపాలిటి పిశాచమువలె దాప
రించితి" వనుటయే సత్యమయ్యెను. శారదా! తల్లీ! నీవు
నిక్కముగా మరణించి యుండకపోయినచో సత్వరము రమ్ము.
నామనోనాథునిపై మోపబడిన యీఘోరనిందను పారద్రో
లుము. రమ్ము. నన్ను వివాహమాడ నుండెనని యీర్ష్యాభా
వముతోడ నాతని నీపాల్బడజేసికొననెంచి యిట్టి పన్నాగము
ను పన్నినచో తక్షణము రమ్ము. నామనోనాయకుని నీ కీక్షణా
మం దర్పించెదను. ఈప్రపంచమున కగుపడకుండ నేమూ
లనో యొదిగి డాగియుండెదను. తక్షణము రమ్ము. అతనిని
రక్షింపుము. పరమేశ్వరా! దీనబంధూ! గౌతమీతల్లీ!
మీరైన యామెను సత్వరము పంపజూడుడు!" ఆమె యీ
విధి దీనాలాపములు సల్పుచు వనదేవతయో లేక మూర్తీ
భవించిన స్వచ్ఛందవిగ్రహమో యన యానిశీథమం దాక

సమువంక జూచుచు గౌతమీతీరమున బోవుచుండెను. ఆమె తనచుట్టునున్న సర్వమును మరచి తన యాలోచనలను బిగ్గరగ పల్కుచుండెను. ఇప్పటి కామె వంతెనను జేరెను. పూర్వమువలెనే "గౌతమీతల్లీ! పంపజాడవా" యని సంబోధించుచుండ నొక్కదిక్కునుండి యకస్మాత్తుగ "పరమేశ్వరుడు నీయార్తి నాలించును. భయపడకుము. నీహృదయేశ్వరుని నిర్దోషత్వమును ప్రపంచమునకు వెలిపుచ్చుము. వేచియుండుము" అని యొకపురుషవచనములు వినవచ్చెను.

---

## 6

### లలిత.

దూరమున మనుష్యవిగ్రహ మొకటి సమీపించుచుండ పసిగట్టి యది నిశీథసమయమగుటచే భీతిజెంది యాలలన యతివేగమున తనగృహామార్గమును బట్టెను. కాని యామె పదియడుగు లిడకపూర్వమే పురుషు డామె మార్గమందు నిలచెను.

లలిత—నీ వెవరు? ఏమి కావలయును?

వ్యక్తి—నాపేరు వీరడు. లక్ష్మాజీ శ్రేయము కోరినవాడను.

లలిత—వీరడూ! నీ వెచ్చటినుంచి వచ్చుచుంటివి?

వీర—చెరసాలనుండి. నిజము చెప్పినందుకు నన్ను

చెరబెట్టి యబద్ధ మొకటి పలికిన విశదిపుత్రుని యాన జూపిరి.

లలి—నీ వెట్లు రాగలిగితివి? కోరిన అబద్ధమును చెప్పితివా?

వీర—అమ్మా! ఒక్కమాట చెప్పెదను వినుము. నన్నింతవరకు నాల్గుసంవత్సరములనుండి యీపట్టణవాసు లందఱును తాగుబోతుగను, తుంటరిగను, యెరిగియుండిరి. పట్టణమునం దేదియైన దుండగము జరిగిన నన్ను చెరయందుంచెడివాడుక కనేటివరకును మాన లేదు. కాని చంద్రబింబము సాక్షి. గోదావరితోడు. ఇంతవరకును నాబుద్ధిపూర్వకముగ నబద్ధ మాడి యుండ లేదని నమ్మును.

లలి—నీ వెట్లు తప్పించుకొంటివి?

వీర—పారిపోయి వచ్చితిని.

లలి—అట్లయిన లక్ష్మాజీకి మరణదండన విధింతురు. నీకలాయన మాతని ప్రతికక్షులకు సాయమొనర్చి వారి సాక్ష్యమును ఋజువుచేయును.

వీర—నేను నాస్వలాభ మపేక్షించి తప్పించుకు రాలేదు. నాకీ చెరయందే సౌఖ్యముగ నున్నది. వేళకు భోజనము దొరకుచున్నది.

లలి—ఎందువలన వచ్చితివి?

వీర — లక్ష్మోజీ ప్రాణరక్షణకొరకు - అతని నిర్దోషత్వ మును స్థాపించుటకు యత్నము చేయుటకొరకు.

లలి — ఆమె బ్రదికియుండుట చూచిన నీకన్న వేరు సాక్ష్య మెచ్చటనుండి తేగలవు?

వీర — ఆశారదనే పట్టి కోర్టువారికి చూపెదను.

లలి — వీరమా! నీవు భ్రమించుచున్నావేమో? ఆమె వేరొక యువతియై యుండవచ్చును.

వీర — నాకు మతిభ్రమ లేదు. కన్నులార చూచియుం టిని.

లలి — విచారణసమయమున నీ వెచ్చటనో తిరుగు చుండిన, వున్నసాక్ష్యమొకటియు అదనున లేకున్న శిక్ష విధింతురు గదా! నీవిపు డామె నెచ్చట బట్టగలుగుదువు; ఎచ్చ టనున్నదో?

వీర — ఆవిషయమును గూర్చి నీవు వెరపుజెంద నవు సరములేదు. సాక్ష్యముసమయమునకు నేనే కోర్టుకు వచ్చి సాక్ష్య మిచ్చెదను.

లలి — వీరమా! నీచరిత్రయంతయు దేదియో రహస్య మున్నట్లు తోచుచున్నది.

వీర — నీయాలోచనకు కారణము -

లలి — ప్రారంభమునుండియు వినుచున్నాను. నీ వచ నధోరణి నీస్వభావికమును మీరి యొక యున్నతవంశజుని మాటలవలె స్పష్టముగ నుండుటయే దీనికి కారణము.

వీరడు చిరునవ్వునవ్వుచు వామెను వింతతెరగునజూచి "అవును. నీయూహ సరియైనది. నాకొక చిత్రవృత్తాంతము న్నమాట సత్యమే. నేను బి. ఏ. పరీక్షకూడ ప్యాసు అయి నాను."

లలిత—యిప్పు డీ నీచదశ కేల రావలసివచ్చెను- నీ మాట సవ్వడి మెల్లమారిపోయెను?

వీర—నేనొక మహోద్యమమునం దప్రమేయుడనై చరించుచుండుటచేతను.

లలిత—నీస్వభావమును ఔన్నత్యపదవులను విడచి యీ నీచవేషము దాల్చిన నేకార్యము సానుకూలము కాగలదు?

వీర—నీహృదయేశ్వరుడు నే నెవరినైనదియు నెరుంగ కుండనే నా కనేక సమయములందు మహోపకారము లొన ర్చెను. అతనివంశమును భాగ్యమును మించినవంశమం దుద్భ వించినవాడనని యిసుమంతయు తెలియకయే నేను నిజముగ వీరడనియే యూహించియుండెను. కాని యిప్పు డాతని యుప కారమునకు ప్రత్యుపకారము చేయుటయందు నేను నాప్రా ణములనైన ధారపోయుటకు సిద్ధముగ నున్నాడను. అతనిని విడిపించువరకును నాయుద్యమము నొకమూల దోచి, నా శక్తికొలదిని లక్ష్మాజీ ప్రాణరక్షణకై పాటుపడెదను. దైవము నాకు తోడ్పడుగాక. ఈయుద్యమమునందు నీసహాయము

కూడ కావలసివచ్చును. నీవుమాత్రి మెల్ల వేళల నతిజాగరూక తతో సంచరించుచుండవలయును.

లలి—నీనిజనామ మెద్దియో గదా ! నీవాక్యములు నామనమున కూరట గల్గించుచున్నవి. నీవేమి చేయుమన్న నది చేయుటకు సంసిద్ధురాలనై యున్నాను నిన్నిప్రాంతములందొరు లెవ్వరైన చూచిన మోసము వాటిల్లదా ?

వీర—మోసమే సంభవించును. నీవు రేపు లక్ష్మోజీ యొద్దకు పోవలసియున్నది. నాకు కొంతద్రవ్యము కావలసియున్నది. నాస్వలాభమునకు గాదు. ఆతనినిగూర్చియే వెచ్చింపవలసియున్నది. రేపురాత్రి యీవేళకే యీవంతెనవద్ద నన్ను కలసికొనుము. నేను కనుబడకున్న నీ రాతిని తీసిచూడుము.” అనిచెప్పుచు నామెను వంతెనవద్దకుతీసుకపోయి యొకరాతినిజూపి “నీవు నన్ను కలుసుకొనకపోయినపక్షమున నీరాతిక్రింద చూడుము. దానిక్రింద నొకయుత్తరముండును. దానిని నీవు లక్ష్మోజీ కందీయవలయును. ఇచ్చి యారాత్రి తిరిగి వచ్చి నాకు పరియవసానమును చెప్పవలయును. నే రాకపోయిన యొకయుత్తరమును వ్రాసి యీరాతిక్రింద నుంచిన చూడగలను. ఈపనిని చేయగలవా ?

లలి—చేయగలను.

వీర—అటియుచుగాక నీవివరికంటను బడకుండ వర్తించవలయును. నీనీడ ననుసరించి నీకై నీహృదయేశ్వరుని ప్రతికక్షులు తిరుగుచున్నారు.

లలి—వారికి నాతో నేమిసంబంధము!

వీర—చాల కారణములున్నవి. మీాయిరువురవివాహ ముస్థిరమగుట యొక కారణము. నీవు తక్కినవారికంటె లక్ష్మీ జీవద్దకేగుట సులభము. అందువలన నాతనివైపువా రెవరైన నీముఖమున కుట్రలను చేయుచుండిరని వారిభయము.

లలి—కుట్రలు చేయుచున్నట్లు యనుమానించవల యును?

వీర—ప్రభుత్వమువారికి జోక్యముకలుగ జేసికొనరు. స్వనాజీమాత్రము కొన్నికారణములచే భయపడుట కవకాశ మున్నది.

లలి—ఆకారణము లెవ్వియో చెప్పరాదా?

వీరడు కొంచెమాలోచించి "లక్ష్మీజీ కిరువైపుల నెవ్వ రును బంధుగులు లేనికారణమున ఆస్తియంతయు నీపేర వ్రా యునేమోయని వారిభయము."

లలి—ఆయాస్తి నాకవుసరము లేదు. అతనిజన్మకొఱ నాజన్మయు నంకేరించవలసినదే!

వీర—అతడు మరణించునని చెప్పుటలేదు. కాని, ఈశ్వరేచ్ఛ నెవ్వరును తెలియజాలరుగదా! వారిహృదయము నందలి యాలోచనలను నీకు చెప్పుచున్నాడను. అదియును గాక వారు బొంబాయినుండి రాజమహేంద్రవరమునకువచ్చి నదియు లక్ష్మీజీ యాస్తికొరకే. తమకూతునిచ్చి వివాహము

చేసి యా స్త్రీని సంపాదింపనెంచిరి. కాని యా వ్యూహము భిన్న మగుటచే పెనురక్కసులవలె నీయభేద్యవ్యూహమును పన్ని యుండిరి.

లలి—నీ వెట్లెరింగితివి?

వీర—అవుసరమున్నంతవరకును చెప్పితిని. తక్కిన విషయము లన్నియు క్రమముగ చెప్పెదను. నీవుమాత్రి మతి జాగ్రతగ సంచరించుచుండవలయును.

ఎవరో యింతలో నావంతెనను సమీపించు యలికిడి వినవచ్చెను. వీరను వంతెనుండి క్రిందికిదిగి యాపరిసరము లనున్న తుప్పలయందు మాయమయ్యెను. లలిత యొకతూముపక్కనొదిగి వారుపోయినతరువాత గృహమున కేగనిశ్చయించెను. అయిదునిమిషములామె యొకతూముపక్క డాగి యుండెను. నడచువారి యలికిడి క్రమముగ కర్ణపథమునుండి దాటిపోయెను. ఆమె మెల్లనలేచి మార్గమునుబట్టి పోసాగెను. కాని, యకస్మాత్తుగ "ఎవరు వారు? లలనా! యీనిశీథమున దొంటిగ నెచ్చటికి పోవుచుంటివి?" అని యొక శబ్దము వినవచ్చెను. లలిత నిలచెను. ఆమెప్రాణములు కంఠగతమయ్యెను. కాళ్ళు వణకుచుండెను. ఆమె నోట మాటరాక నిశ్చేష్టయై నిలచిపోయెను. ఆవ్యక్తి సమీపించెను. అతడే స్యైనాజీ మరణించిన శారద తండ్రి. అతడామెను తేరిచూచి

లలితయగుట గ్రహించి 'లలితా ! నీవేనా?' అని ప్రశ్నించెను.

"నన్ను నాదారిని పోనీయుము' అని లలిత పల్క "నిన్నడ్డుపెట్టున దెవరు? కాని పోవుగోపల నాకొక్క ప్రశ్న కుత్తర మీయుము."

లలిత—నేనేమియు ప్రత్యుత్తర మీయజాలను.

స్వామీజీ—ఇప్పు డెన్నిగంటలయ్యెనో తెలియునా ?

లలిత— తెలియును,

స్వా—రాత్రి పన్నెండుగంట లయినది.

లలిత—అట్లయినచో నేను త్వరగ గృహమును చేర వలెను.

స్వా—నీ వేకారణమున నిచ్చటకు వచ్చియుంటివో అడుగవచ్చునా ?

లలిత—నీవు క్రొత్తవాడవయ్యును చనవుగ మాట్లాడుచున్నావు. నీవు నన్నేమియు ప్రశ్నింప నవుసరములేదు.

స్వా—శారదయొక్క తండ్రినని నీవు మరచియుందువేమో ?

లలి—కావచ్చును. అయిననేమి?

స్వా—ఏమియులేదు. నీకును ఆహత్యకును సంబంధమేమియా అని యోచించుచుంటిని.

లలి—ఒంటినున్న స్త్రీని నీవు చెనకనుంటివి; జాగ్రత!

స్త్రీ—నిన్నేమియు చేయుటలేదు. నీవాతనికి కాబోవు భార్యవగుటచే నీహత్య జరిగినప్రదేశముకు రాత్రిరెండుజాములకు నీవేమిచేయవచ్చితివోయని శంకించుచుంటిని.

లలి—నీతో మాట్లాడజాలను. నాదారిని నన్ను పోనిమ్ము.

స్త్రీ—నిస్సంశయముగా. నీనోటినుండి యీప్రశ్నకు సమాధానము చెప్పించువారు ప్రభుత్వమువారె యున్నారు." అని చెప్పుచు మార్గమునుండి యొకప్రక్క కొదిగెను.

లలి—నీవుమాత్రము నీచర్యలకు సమాధానము చెప్పవలసియుండదా ?" అని చెప్పుచు నామె తనదారినిబట్టి పోయెను.



## 7

### మాయలమారి.

మరునాడుదయమగుసరికి వీరడు చెరసాలనుండి తప్పించుకుపోయినసంగతి కర్ణాకర్ణిగ ప్రజలందరకును విశదమయ్యెను. ఆమె తెల్లవారగనే మేల్కని కాలోచితకృత్యముల దీర్చికొని, రాత్రి యెప్పుడువచ్చునా యెప్పుడాయుత్తరమును గ్రహించి తన మనోనాథుని కిచ్చి వత్తునా యనువారాటముతో దిరుగుచుండ వాకిట నెవ్వరో వచ్చి నిలచెను.

అతడెవ్వరయిన ప్రభుత్వపుయుద్యోగియా, తన్నరెస్టు జేసి తీసికొనిపోవచ్చెనా? యని యామె పరిపరివిధముల తల

పోసెను. ఆమె కిట్టి స్వస్త మనమునందంకురించుట యిదియే ప్రథమతూరి. కాని యామె మనస్థైర్యమును వీడక వేగముగ తలుపును దెరచి చూచునరి కాత డొక సామాన్యపురుషుడే. ఆమె వెంటనే యాతడు సావడిలోనికి ప్రవేశించి కుర్చీపై గూర్చొనెను. వారి కీక్రిందివిధముగ సంభాషణము జరిగెను.

లలిత—మీ రెవ్వరో తెలియజెప్పకోరుచున్నాను.

వ్యక్తి—నీపేరేనా లలిత?

ల—అవును.

వ్య—నాపేరు సుందరరావు. నీహృదయేశ్వరుడగు లక్ష్మీజీవల్ల నియమింపబడిన న్యాయవాదిని. అతనివిషయమై కొన్నిసంగతులు తెలియనెంచి యిటకు వచ్చితిని. అతడే నన్నిచ్చుటకు పంపెను.

ల—అయ్యా! నామనోనాథు డీయపనిందనుండి త ప్పించుకొనునా, మీకేదయిన మార్గము స్ఫురించినదా?

సుంద—లలితా! జయాపజయములు మానవమాత్రు డెరుగజాలడు. నాశక్తివంచనలేక వాదించెదను. తరువాత వానిని యదృష్టము- నీయదృష్టము.

ల—అతడు దోషికాడు.

సుం—కావచ్చును. నాకును అదియే యభిప్రాయము. కాని పంచాయితీదారుల నొప్పించుట యెట్లు. అతనికి వ్యతిరిక్తముగ సాక్ష్యము మోపైయున్నది. అతనికిగల యో

క్కసాక్షియు తాగుబోతు. గోరుచుట్టుపై రోకటిపోటన్న ట్లాతనుగూడ నచ్చటికో పలాయనమగుటచే నీహృదయేశ్వ రునిపై నిందారోపణ జేయుట కెంతమాత్రము సందియము లేదు.

లలిత తన పెదవిపై వ్రేలిడి తలుపులను భద్రముగ మూసి తమ్మెవ్వరును చూచుచుండలేదని నిశ్చయముజేసి కొని మెల్లగా "విచారణసమయమునకు వీరడు కోర్టునకు వచ్చు" నని చెప్పెను.

సుం—నిశ్చయముగనా ?

లలి—నిశ్చయముగ.

సుం—నీనమ్మకమున కాధారము ?

ల—వీరని వాగ్దానమే.

సుం—నీ వతని కలుసుకొంటివా ?

ల—అవును.

సుం—ఎప్పుడు ?

ల—నిన్నటిరాత్రి.

సుం—నిన్ను కలసుకొనుమని కబురంపెనా ?

ల—లేదు.

సుం—లేకున్న నెట్లు?

లలిత యతనితో రాత్రి జరిగినవృత్తాంతమంతయు పూసగుచ్చినట్లు చెప్పెను. అత డాశ్చర్యముతో "నేడు నీ

వద్దకు వచ్చుట మంచిపనియే జరిగెను. నేను వీరనితో కొ
న్నివిషయములు చెప్పవలయును.

ల—మాట్లాడవచ్చును. నేటిరాత్రి నన్నాతడు కలు
సుకొని యొక కాగిత మిత్తునని చెప్పెను. దానిని నామనో
హరుని కీయవలయును.

"నిజమా?" అని రెట్టించుచు నాతడు నయనములను
విప్పి యామెను వింతగ పరిశీలించుచు "ఎన్నిగంటలకు పోవ
లె" నని యడిగెను.

ల—పదిగంటలన్నర ప్రాంతములను. నాప్రతికక్షకులు
నన్ను వెనకనుండిరనియు జాగ్రతగనుండుమనియుకూడ నాతడు
నాకు బోధించియుండెను.

సు—పాపము!

ల—నేను వచ్చుచుండ స్వైనాజీ నన్నడ్డగించి బెద
రించెను.

సు—అతని మాటలకు లక్ష్యముచేయకుము. నేటి
రాత్రి వీరని తప్పక కలసికొనుము.

ల—నాహృదయేశ్వరుతోడ మాట్లాడనిత్తురా?

సు—మాట్లాడవచ్చును. కాని ప్రస్తుతము మీయు
త్తరప్రత్యుత్తరములయందు నన్ను రాయబారిగా నుపయో
గించుకొనుడు.

ల—నే నాతని జూడవలయునని యున్నది.

సుం—చూడవచ్చును. ఏలనంటివా రెండుమూడు దినములలో అనుమతిని దెచ్చెదను. ఈలోపున నీహృదయమును నాకు వెలిబుచ్చిన నీమనోనాయకునకు జెప్పివచ్చెదను. నేను పోవలయును. కాలాతీత మగుచున్నది. మన సంభాషణ మతిగూఢముగ నుంచవలయును. ఒకకారణమున వీరనికిగూడ చెప్పవలదు. రాత్రి తప్పక యాతనితో మాట్లాడిరమ్ము.

లలిత—మన సంభాషణ వీరనికి జెప్పిన నేమిప్రమాదము?

సుం—లీడర్ల కనేక కారణము లుండును. పార్టీలకు చెప్పనవుసరము లేదు. నారాకనుగూర్చికూడ వీరనికి చెప్పవలదు. తెలిసినదా?

లలి—సరే! అప్పుడు నాహృదయ మెట్లు పరిణమించునో?

సుం—కారణము?

ల—స్త్రీల కనేక కారణము లుండును. అన్నియు విపులముగ చెప్ప నవుసరము లేదు.

సుందరరావు గృహము వెడలెను. లలిత సంధ్యారాగమునకై వేచియుండెను. ఆమె తన కుర్చీపైగూర్చొని జరుగుచున్న చిత్రవృత్తాంతములనుగూర్చి తలపోయుచున్నట్లు కూర్చుండెను.



# 8

రాయబారములు.

తుట్టతుదకు గడియారము పదిగంటలు కొట్టెను. పట్టణవాసు లందరును గాఢనిద్రాపరవశులై యుండిరి. లలిత తల్లిదండ్రులుకూడ జీవన్మృతులవలె పడియుండిరి. లలితమెల్లగలేచి తలుపును దెరచి, తిరిగి బయటగొళ్ళెము పెట్టి గోదావరీతీరమున గట్టబడిన గట్టుపై వడివడిగ వంతెనమార్గమును బట్టి నడువసాగెను. ఆమెహృదయ మానిశీధ నిశ్శబ్దమందు తటతట కొట్టుకొనుచుండెను. గోదావరీతరంగము లెడతెరపి లేక తీరమును జేరుచు నీకాంతామణి సాహసగమనమును వీక్షించుచునే యుండెను. లేశమాత్ర మలికిడి వినబడిన తన్నెవ్వరయిన వెన్నంటుచుండిరో యని యామె భీతిచెందుచు మాటిమాటికి వెనుదిరిగి చూచుచుండెను. పదియడుగు లిడునరికి దూరమున నొక మానవాకృతి నయనముల బడెను. అతడు వీరడని యూహించి యామె హృదయమును చిక్కబట్టి వడివడిగ నడచిపోయెను. వంతెనను సమీపించెను. కాని యచ్చట వీరడుగాని తరితర పురుషుడుగాని యెవ్వరును లేరు. మెల్లగ వీరని పిలచెను. కాని జవాబులేదు. తిరిగి బిగ్గరగా పిలచెను. కాని ప్రత్యుత్తరము లేదు. ఆమె వచ్చుట యాలస్యమగుటచే నాతడు వెనుదిరిగి పోయెనని నిశ్చయించి గుర్తుజూపిన రాతివద్దకేగి దానిని దీయుసరి కందొక కాగితముండెను.

వీరడు దాని నచ్చట భద్రముచేసి పోయియుండెనని నిశ్చ యించి దానిని తన రయికసందున మాటుజేసి మరునాడుద యమున తన మనోనాథుని దర్శింతును గదా యని వెనుదిరుగునరి కామె యెట్టయెదుట నొకమానవాకృతి నిలచియుండెను.

అతడు వీరడు కాడు. ఆయాకారము నింతవర కామెం జూచియుండలేదు. ఆవ్యక్తి యామెను సమీపించి "కాంతా యేమి చేయుచుంటి" వని ప్రశ్నించెను.

ల—నీవెవరు; నీకేమి కావలయును?

వ్య—ఆరాతికిందనుండి తీసిన కాగితము కావలయును. దాని నిచ్చి నీయింటికి బొమ్ము. ఈమారు నీ వీప్రాంతములకు వచ్చిన సులభముగా పోజాలవు. తిరిగివచ్చిన నిన్ను అరెస్టు చేయవలసి వచ్చును.

ల—నేను కాగితమును తీయుట నీ వెట్లెరుగుదువు! నావద్ద నేదియు కాగితములేదు. ఉన్నను నీవి కాదు. నీకీయజాలను.

వ్య—ఇచ్చివేయుదు వని నాయభిప్రాయము.

ల—ఇవ్వనని చెప్పుట వినజాలవా ?

వ్య—నిన్ను గోదావరీగర్భమందు దోచిన నేమిచేయగలవు?

ల—చేతనయిన ట్రోయుమా చూచెదను." అని చెప్పు చు భీతహరిణమువలె నానదీతీరమున పరువెత్తసాగెను. కాని స్త్రీని బట్టుట యెంత! ఒక్కనిముసము నాత డామెను వె న్నంటి సిలిపివైచెను. పాప మామె యేమి చేయుగలదు. అబలయు నిస్సహాయయు నగులలిత యాదుష్టుని మోాలనే మిచెప్పినచెల్లును! కాగితము నిమ్మని యాతడు బలవంతము చేయుచు నామెకంఠమునుబట్టి యిచ్చెదవా లేక చచ్చెద వా యని నిర్బంధించెను. ఆమె తన ధైర్యమును వీడి చేయున దిలేక తనరైకసందున డాచిన కాగితమును దీయుటకు హస్త ము నందుజొనిపెను. ఒక్కక్షణమున నాత డాకాగితమును గ్రహించియుండెడివాడే! కాని యకస్మాత్తుగ "దుష్టా! ఆగు మాగు" మని యొకశబ్దము వినవచ్చెను. మాటనవ్వడినిబట్టి యాకేకవైచినది వీరడని యామె గ్రహించి సహజస్త్రీస్వభా వముతో "వీరడూ! రమ్మురమ్మ"ని బిగ్గరగ నరచెను. ఆపలుకు ల కావ్యక్తియులికి "సరియే కాశికిబోనునున్న గంగయే యెదు రయ్యెనని వెదుకబోవు వీరడే యిచ్చటకువచ్చిచేరెను" అని చెప్పుచు నొకసన్నని యీలవైచెను.

పార్వతమ్మని వీరడు హెచ్చరించుచు సమీపించు నంతలో నావ్యక్తి యాకస్మాపై కురికి కాగితము నూడబెరుక జూచెను. కాని వీరడు మహావేగమున సమీపించి యాతని భుజములుపట్టి వెనుకకులాగి పార్వతమ్మని యామెను హె

చ్చరించుచు నాతనితో పెనగులాడసాగెను. లలిత పరువెత్తి పోవుచుండెను. కాని యామె వాల్గడుగులిడునంతలో నావ్యక్తి పంపిన సైగకుమారు వేరొక యువకుడు పరుగుపరుగున వచ్చి వీరనితో కలియబడెను. కాని యాపురుషు డాతని వారించి 'కాగిత మాకన్యకవద్దనున్నది. పోనీయకు'మని హెచ్చరించ నా నూతనవ్యక్తి యాకాంతామణి వెన్నంటి నిముషమాత్రమున కేశములనుబట్టి యాపె నాపగల్గెను. నిర్దయాత్ముడై యామెను వెనుకముందులకు కంపింపజేయుచు "కాగిత మెచ్చటనున్నది. తెమ్ము. లేకున్న నీప్రాణముల దీసెద"నని బెదరించుచు నామెను నేలపైబడగొట్టి తనహస్తము నామెరైకలో జొనిపి కాగితమును దీయ సిద్ధపడెను. కాగితము తనహస్తము లబడెననియే సంతసించుచుండెను. కాని వీరడు తనవైరుల నిరువురను గూడ లోబరుచుకొనగల సామర్థ్యము గల్గియుండెను. మహాబలముతో నాతని క్రిందబడగొట్టి శక్తికొలదిని మోది యాతనికి నిస్పృహ గల్పించి లలితను చెనకనున్న బందిపోటుపై యకస్మాత్తుగ నురికి క్రిదబడవైచి కంఠమునొత్తిపట్టెను. ఆవ్యక్తి దీనార్తుడై "నన్ను విడువుము. నేను పోలీసుయుద్యోగిని." అని చెప్పుచుండ, వీరడు వాని నోటిని నొక్కుచు జేబులను తడిమి యందుండి రెండరదండములను దీసి యవి తనకై తెచ్చినవని గ్రహించి, శంకలేక వాటిని యాతనిహస్తములకు గరిపించెను.

"పడియుందును. ఇకముం దెన్నడు నాజోలికి రాకు"
మని చెప్పుచు వానినోరు తన్నుదన్ని లలితను సమీపించెను.
ఆమె భయముచే వణకుచు "అతడు కేకలిడిన మోసమువాటి
ల్లును. పారిపోవుదము ర" మ్మని హెచ్చరించెను.

వీ—అతడు కేక లిడనేరడు.

ల—పోలీసువాడు గదా!

వీ—కాదు. అతడు స్వైనాజీవల్ల నియమింపబడిన
యనుచరుడు.

ల—అయిననేమి? సహాయార్థ మార్తి సల్పవచ్చును
గదా!

వీ—అట్లు కేకలిడకుండుటకు రెండుకారణము లున్న
వి. నన్ను పట్టుటకు నియమింపబడి నాబదులు తానే పట్టు
బడుట తన యజమానున కెరింగింపనేరకపోవుట యొకటి.
రెండవది నేనే కారణమునైన వారిహస్తములయందు పడిన
తక్షణము ప్రభుత్వమువారి కొప్పగించుటకు మారు వేరొక
సంకేతస్థలమునందు నన్ను నిర్బంధించియుందురు. ఒక కారణ
మున స్వైనాజీకి నాపేరు జెప్పిన సింహస్వప్నము.

ల—అట్లయిన నిన్నింకెవ్వరైన వెన్నంటియుండి
రేమో?

వీ—ఉండవచ్చును. అంతమాత్రమున పట్టుబడితినా!
అది యటుండనిచ్చి నీకీరాత్రి నేను కాగితము నిచ్చుచున్నట్లు
స్వైనాజీ కెట్లు తెలిసెను?

ల—నాకెట్లు తెలియును? గ్రహచారవశమున సంభవించెనేమో!

పీ—ఇందేదియో గూఢచర్య యుండుట స్పష్టము. ఈవ్యక్తు లిరువురు మనకై వేచియుండిరనుట కింతమాత్రమును సందేహము లేదు. నీవు నిన్నటిరాత్రి మనసంభాషణల నెవరికైనను చెప్పియుంటివా?

ల—ఎవ్వరికిని చెప్పలేదు. కాని—

పీ—నిజము బయల్వెడుచున్నది. ఎవ్వరికి చెప్పియుంటివి?

ల—లక్ష్మాజీచే నియమింపబడిన ప్లీడరుగారికిమాత్రము చెప్పియుంటిని.

పీ—ఆహా! స్వైనాజీ యెంతజిత్తులమారి!

ల—ఏమి యట్లనుచుంటివి?

పీ—ఏమియులేదు. నిన్ను స్వైనాజీ మోసముచేయ గల్గినందులకు విస్మయమందుచున్నాను.

ల—నన్నెవ్వరు మోసముచేసిరి?

పీ—స్వైనాజీ.

ల—అతడు రాలేదే!

పీ—ఆవచ్చిన ప్లీడరుగారు లక్ష్మాజీచే నియమింపబడియుండలేదు. స్వైనాజీ యనుచరులలో నొకడు మారువేషమునవచ్చి నిన్నుమోసగించి మనరహస్యముల నెరుగగల్గెను.

ల—నమ్మజాలను.

వీ—నిజమే. అత డెట్లుండునో వర్ణింపుము.

ల—పొడుగుగ సన్నగ నుండును. తలవెండ్రుకలం నెరసెను.

వీ—ఆహా! సుందరరావుగారు కొంచెము పొట్టిగను లావుగను వుండును ఒక్క వెంట్రుకయు తెల్లబడలేదు. బట్ట తలగల్గి యుండును.

ల—అట్లయిన మోసము జరిగెను. కర్తవ్యమేమి?

వీ—నీవు క్రొత్తవారి నెవ్వరిని నమ్మవలదు. స్వేచ్ఛాజీకదు జిత్తులమారి ఇకముందు నీవొంటరిగ బయల్వెడలకుము. నేనే నిన్ను కలుసుకొందును.

వారిట్లు సంభాషించుచుండగనే లలిత గృహమును సమీపించిరి.

నేననేక వేసములతో నకస్మాత్తుగ వచ్చుచుందును. ఆ కారణమున నీ వెంతమాత్రమును భయము జెందక ధైర్యమవలంబించియుండుము. ఎత్తులకు పైయెత్తుల బ్రయోగించుచు వైరిబృందమును కొరగాకుండ చేయవలయును. వీర డెవ్వరో తరువాత వారికి తెలియగలదు.

ల—తిరిగి యామోసగాడు మాయింటికి వచ్చిన నేమిచేయమనెదవు. అతని తప్పును వెలిచేయ మనెదవా?

వీ—ఎంతమాత్రము వైరభావము జూపకుము. ని

న్నెంతమాత్రమును శంకింపకుండునట్లు నటింపుము.

ల—నాహృదయము నీరగుచున్నది కాని ధైర్య మవలంబించెదనుగాక.

వీ—సరే- కాలాతీతమగుచున్నది. ఆకాగితమును జాగ్రతగ నీహృదయేశ్వరున కిచ్చిరమ్ము మార్గమధ్యమం దెవ్వరైన దాపరించి నిన్ను మోసముజేసినను, బలాత్కరింప జూచినను, ఆకాగితమును నాశనముజేసికపిదప నీప్రాణము లను బాయుము. ఈదినమును రేపును విడచి వేరొకదిన మున చెరసాల కేగుము. మారువేసమున బోవుట యుక్త ము.

అని చెప్పుచుండగనే యొకసన్నని యీల వీచులపోక వారు తమతమ మార్గములనుబట్టి యాయంధకారమం ద దృశ్యులైరి.

---

# 9

## వృద్ధవనిత.

లక్ష్మిజీ తనచెరసాలయందొక గోడకు చేరబడి దీర్ఘ ముగ నాలోచించుచుండెను. అత డొక దవ్య్రవంతుడును, ఉత్తమవంశజుడగుటచే కోటినపక్షమున నాచెరయందొకపా న్పును తదితరసౌఖ్యపానాదులను సమకూర్చియుండెడివారే, కాని యతని కేలనో యట్టివాంఛలు రుచింపకుండెను. అత

నిచే నియమింపబడిన వకీలుగారుకూడ శారద చంపబడెనని యే నమ్మియుండెను. వీరని వృత్తాంతమంతయు వట్టికల్లలని యూహించెను. కాని వాదమున కాతని సాక్ష్యమునే యాధారముగ జేసికొని శక్తివంచనలేక లక్ష్మోజీని తప్పింపనెంచెను. కాని వీరకు చెరనుండి తప్పించుక పారిపోవుటచే నాతని యాశలన్నియు నిరాశచెందెను. లక్ష్మోజీ కూడ నీవిషయమునుగూర్చియే పరిపరివిధముల చింతించుచుండెను. "ఏదియో గొప్పవిపరీత మున్నది. నాతండ్రియు తల్లియు చిరుతప్రాయముననే మరణించియుండుటచే నాకీయునస్తయుందు నాప్రశ్న కుత్తరమీయువారెవరును లేరు. అదియు నాదౌర్భాగ్యమే. ఈపురవాసులు నాతండ్రి నెరుంగుదురు. వారితోడనైన తనకొక సోదరు డున్నట్లు చెప్పియుండలేదే! అదియునుగాక యిప్పటి కారునెలలనుండి నేనాతని గృహమునకు వచ్చుచు పోవుచుండ నొక్కనాడుగూడ మాయిరువుర బంధుత్వమును గూర్చి ముచ్చటించలేదే! ఇందేదియో ఘోరకుట్ర యుండితీరవలయును. రెండవది శారద యెట్లు చంపబడెను? ఆమె యాప్రవాహమునుండి రక్షింపబడి పారిపోవుట కన్నులార చూచియుంటిని. ఈప్రేతయే శారదయై యుండుట నిక్కమగుచో నామె తిరిగి తనంత తానే యాప్రవాహమం దురికియైన యుండవలెను. లేదా దరిమిలా వేఱొకడు హత్యయొనర్చి యాప్రవాహమున విసరియుండవలయును. ఆమె

నిశ్చయముగ మరణించెనా? నమ్మకము కల్గుటలేదు. వీరని వృత్తాంతము నాయనుమానములను ధృవపరచుచున్నది. ఆమె జీవించియేయున్నది. ఇదియొక వ్యూహము. నాయాస్తి కై సన్నిసన్నాగము. ఇందేదియు నసత్యము లేదు. హా పరమేశ్వరా! దరిద్ర్యమన్న నెట్టివారలనైనను గడ్డిగరపించును కదా!” అని తనలోదాను వితర్కించుకొనుచుండ నొకరి వచ్చి యెవతెయో ముసలిది యొకతె మిమ్ము చూడవచ్చెనని చెప్పెను “నేనెవరిని వాతో సంభాషించుట కనుమతి నీయజాలను ఆమె యెవ్వరో కనుగొనరమ్ము. తరువాత చెప్పెదను.” అని ప్రత్యుత్తరమిచ్చి తన యాలోచనలలో మునిగి యుండెను. రక్షకుడు తిరిగి ద్వారము వెలుపలికేగి యావార్త నాముసలిదానికి చెప్పెను. ఆముసలిది చూపులకు విచిత్రము గనుండెను. ఆమె ధరించినదుస్తులు బహుపురాతనములు. ముఖము కనబడకుండ ముసుగు వేసికొనెను. ఆవార్త వినంతనే యామె యొక్క క్షణ మాలోచించుచు నారక్షకభటుని వీక్షించి యెద్దియో చెప్ప జూచుచుండ బహిర్కవాటమునద్ద నెవ్వరో పిలచినట్లయ్యెను. ఆవచ్చినవా రెవ్వరో కనుగొనుటకు నిశ్చయురాలైన యామె యొక బల్లపై మూరు మాట్లాడక కూరుచుండ నొకసేవకుడు గేటుదీయ నొకవ్యక్తి లోన ప్రవేశించెను. అత డాచెరసాలయందు నియమింపబడినయుద్యోగితోడగాని, రక్షకభటులతోడగాని, సంభాషించుటకుమూరు

కూర్చునియున్న వృద్ధవనితను తదేకదృష్టితో నొక్క క్షణము వీక్షించి "లలితా! బాగుగ వేషము ధరించితివి" అని యొక చిన్న నవ్వు నవ్వెను. ఆవృద్ధాంగన యాతనిపలుకుల కులికి యారక్షకభటుని సంబోధించి "యీతని నావలకు బంపివేయు మని ప్రార్థించెను. రక్షకభటు డానూతనవ్యక్తిని దిలకించి "అయ్యా! మీ రీవనిత నెరుగుదురా!" యని ప్రశ్నింప "యీ వృద్ధవనిత యెవరో తెలియదు కాని, యువతియగు లలితను మాత్రము బాగుగ నెరుగుదును." ఆయుద్యోగి కొంచెము కినుకవహించి "నీవు నాయుద్యోగసరణి కాటంకము గల్గించు చున్నా" వని యాతని గదిమెను. ఆవ్యక్తి యెవ్వరోయని వాత కు లనుమానింపనవుసరము లేదు. అతడే స్వైనాజీ. ఈరక్ష కభటుడును చెరయందు వినియోగింపబడిన యుద్యోగులంద రును గూడ నాతనికి పరిచయులే.

స్వై—నీయుద్యోగసరణి కేమి యాటంకము గల్పించి తిని. చెరయందున్నవానితో కుట్రలు చేయుట కొకయువతి వగాను వేసమున వచ్చెనని చెప్పితిని.

రక్ష—నే నంతమూఢుడనా. నేనుమాత్రము గ్రహిం పజాలనా?

వీరిసంభాషణల నాలించుచున్న యావృద్ధవనిత తన యాసనమునుండి లేచి, "అయ్యా! మీకొరకు లలిత వచ్చియు న్నదని లక్ష్మాజీ కెరింగింపు" డని యారక్షకభటుని సంబోధిం చెను.

స్వై—లలితా! నీమారువేసమును నీవే వెలిబుచ్చితివి కాని నీ విచారయం దేగుటకు పూర్వము నిన్ను సోదాచేయ వలసియున్నది.

ల—నేను సూపరింటెండెంటుగారివద్దనుండి యనుజ్ఞా పత్రమును దెచ్చియుంటిని. నావర్తమానము తక్షణము లక్ష్మీ జీ కెరింగింపుము. నేను వేగముగ పోవలయును.

ఈమాటలపై నారక్షకభటుడు లక్ష్మీజీవద్ద కేగ సంసిద్ధుడయ్యెను. కాని స్వైనాజీ యాతని వారించి "యీమె యీ చెరసాలనుండి గృహమున కేగినపిదప, నీవెవరిని నిందించినను లాభములేదు. జాగ్రత. ఈమె యొక మాయావిని. ఖైదీపారి పోయిన నీకు మాటవచ్చుటయేగాక యుద్యోగముకూడ పోవును." అనిచెప్ప నారక్షకభటుడు వెనుదిరిగెను. స్వైనాజీ యొక గౌరవనీయుడగుట యాతనికి తెలియును. అదియును గాక యీవిషయమునం దాతనికున్న జ్ఞానము వేరొకని కుండ నేరదు. తనకూతురు హత్యను నిరూపించుటకు పాటుపడు చున్న ట్లాత డెరిగియే యుండెను. మీదుమిక్కిలి యావనిత మారువేసమున వచ్చుట యొకయనుమానకారణము. ఈవిష యములన్నియు నాత డొక్కక్షణము పరిశీలించి యావనిత నుద్దేశించి "లలితా! నీవేదియో కుట్రచేయుటకు వచ్చియు న్నట్లు తెలియవచ్చుచున్నది. నీవేమి జవాబిచ్చెదవు?"

ల—వట్టియబద్ధము.

స్త్రీ— అట్లయిన నీ వీమారువేసమున వచ్చుట కేమి యగత్యము?

ల— నీబారినుండి తప్పించుకొనుటకు. నీవు నాప్రాణనాథుని చూడనీయక యాటంకపరచెదవను యుద్దేశ్యముతో!-

స్త్రీ— అది వట్టికల్ల. నీమనోనాథుని చూడనీయకుండ జేయుటకు నాకేమి యవసరము.

ల— కారణమును నీవే యెరుగుదువు. నేను చెప్పనవసరము లేదు." అని చెప్పుచు తనవృద్ధవేషమును దీసి మేలిముసుగును దెరువ దివ్యమంగళవిగ్రహామువలె లలిత యచ్చట సాక్షాత్కరించెను.

స్త్రీ— ఆకారణమును తెలియుటవలననే యిచ్చటకు వచ్చియుంటిని. కోర్టువారికి నీవు నీచర్యలను గూర్చి సమాధానము చెప్పుకొనవలసియున్నదని జ్ఞప్తియందుంచుకొనుము. నీవు లక్ష్మోజీ నాకొమరితను ప్రేమించకుండున ట్లొనరించుట యేగాక నామెను హత్యజేయుటకు పురికొల్పినదియు నీవే యని నాకు తెలియవచ్చినది.

ల— నేనే పురుషుడనై యున్న నిన్నివాక్యములకు భూమియందు మట్టుబెట్టి యుందును. వ్యర్థప్రలాపములను గట్టిపెట్టుము.

స్త్రీ— మగవాడవు కాకపోవుటచే నావెనుకనుండి కుట్రలు పన్నుచుంటివి కాబోలు.

ఈ వాగ్వాదమును వినుచున్న రక్షకభటుడాయువతి సౌందర్యవిలాసముల కచ్చెరువందుచు యామెపై జాలివహించి సేనాజీవంక దిరిగి "అయ్యా ! మిమ్మిక్కడ వాదులాడుట కనుజ్ఞ నీయజాలను. లలిత తనచర్యకు తగుకారణమును జెప్పికొనగలదు. మీ రీవిషయమున జోక్యము కలుగజేసికొనకు" డని వక్కాణించెను.

ల—అయ్యా ! యితని నావలకు బంపివేయుడు. తగు సమాధానమును జెప్పెదను.

సే—నేను పోవుటకు పూర్వ మొక్కమాట చెప్ప వలసి యున్నది. ఆస్త్రీ తనతోడ నొక కాగితమును దెచ్చియుండెను. దానిని లక్ష్మాజీ కీయయత్నించుచుండెను. ఆమె మనోరథము సఫలముగుచో నాతడు చెరనుండి తప్పించుకపోవునని మాత్రము గ్రహింపుము. ఈ కాగితమునందు లక్ష్మాజీ చేయవలసిన కార్యవిధానము లిఖింపబడి యుండెను. ఇప్పటి కప్పుడే మీ బారినుండి యొకడు తప్పించుక పారిపోయెను.

ఈవృత్తాంతముపై నారక్షకోద్యోగికి కోపమును, ఆశ్చర్యమును, అనుమానమును ఒక్కసారి తీవ్రమైనవి. అత డాయువతిని తదేకదృష్టితో తిలకించి "నిజముగ నీవద్ద నట్టి కాగితమున్నదా?" యని ప్రశ్నించెను. "ఆపురుషుని ముందర నేనట్టి సమాధానమును చెప్పజాల" నని ప్రత్యుత్తరమీయ వెంటనే యాతడు సేనాజీ నావలకేగుమనెను. కొంతవర కందరు

ను నిశ్శబ్దముగ కూరుచుండి స్వేనాజీ లేచి బయలుదేరి "ఆయువతి తనవద్ద కాగిత మేమియు లేదని చెప్పజాల కున్నది. ఆమెను తక్షణము శోధింపుము. లేకున్న నీవు మేజస్ట్రేటు గారికి సమాధానము చెప్పకొనవలసి యుండును."

---

## 10

### పరిశోధన.

"లలితా ! నీశరీరమంతయు శోధించిననే గాని లక్ష్మాజీ వద్దకు పోనియజాలను. నీపై యనుమానమునకు కారణము నీమారువేసమే."

లలిత తెల్లబోయెను. నిశ్చయముగ నామె కిప్పుడు తన మార్గమందలి యవాంతరములు ప్రారంభమయ్యెను. ఇదియే యామె నిర్మలప్రేమానిరూపణయందలి ప్రారంభ పరీక్ష. ఆమెవద్ద కాగితమున్నమాట నిజము. దానియందు కొన్నిముఖ్యవిషయములు రచింపబడి యుండుటయు తథ్యము. దానిని నాశనముజేసినపిదప తనప్రాణములను బాయుమని వీరడు హెచ్చరించి యుండెను. ఆకాగితము నిప్పుడు తన ప్రతికక్షులకు గాని ప్రభుత్వమువారికి గాని సమర్పించిన తన మనోనాథునకు ముప్పువాటిల్లుట కెంతమాత్రమును సందియము లేదు. కాలయమునివలె స్వేనాజీ యామెను వెన్నంటి తన మారువేసమును వెలిబుచ్చెను. ఆహా ప్రేమతరంగము

లందు పయనము సాగించుచు తన ప్రేమపుంజము సంద్రమ ధ్యమున బడి మునిగియున్న విషమసమయమున స్వాభావిక హృదయ ప్రోద్బలమున నాప్రవాహమున నురికెను గాని యందు ఘాతుకజంతుసముదాయములం తన్ను జుట్టుముట్టి తన యుద్యమము నాటంకపరచునని యామె కేమి తెలియును!
ఆచెరసాలాకార్యక్రమస్థాన మిప్పు డేకచిత్రకళ లీనుచుం డెను. రక్షకోద్యోగి చేత తాళపుచెవులను బట్టినిలచియుం డెను. వేరొకడు కుర్చీపై గూరుచుండి యామాయావనితను వింతగ జూచుచుండెను. స్వైనాజీ తనచేతులను వక్షమునలంక వైచి విజయోత్సాహమున చిరునవ్వు నవ్వుచు లలితను వీక్షిం చుచుండెను. లలిత తన విషమసంస్థ నెట్లు విచ్ఛేదము గావిం తునా యని వివిధమార్గముల నూహించుచు నిలచియుండె ను. పరిశోధనచేయుట మానరని గ్రహించెను. కాని స్వైనాజీ నావలకు బంపివేయు నుపాయ మాలోచించుచుండెను. ఎట్ట కేల కామెమన మూరట జెంది "నేను లక్ష్మీశ్రీతో ప్రసం గింపవలయును. మీపరిశోధనకు నేనొడబడను." అని నిరాద రణతో ప్రత్యుత్తర మిచ్చెను.

రక్ష—యువతీ! నీయొద్ద నారహస్యకాగిత మున్నట్లు స్పష్టమగుచున్నది. అట్టి వస్తువులతో నిన్ను చెరయందు ప్ర వేశింప నీయజాలను. అది నావిధి. నిన్ను శోధించి తీరవల యును. నీవు శోధన కిచ్ఛగించవేని యాకాగితము నిచ్చివేసి లోనికి బొమ్ము. నిన్నెవ్వరు నాటంకపరుపజాలరు.

ల—అట్లయిన నేను లక్ష్మోజీతో మాట్లాడక నాదా
రిని నేను పోయెదను.

రక్ష—ఆకాగితము నిచ్చిన తరువాత నీయిచ్ఛవచ్చి
నట్లు చేయవచ్చును. నావిధిని నేను నెరవేర్చి తీరవలయును.
నీచర్యను జూడ లక్ష్మోజీని చెరనుండి తప్పింపవచ్చి యుంటి
వని స్పష్టమగుచున్నది.

ల—నీవు నన్ను నిర్బంధించి శోధింతువా?

రక్ష—నీ వొడంబడకున్న నట్లే చేయవలసివచ్చును.
ఈపురుషుడు సత్యమును వచించెను. నీవద్ద నట్టికాగితము
న్నది. తక్షణ మిచ్చివేయుము.

ల—నావద్ద కాగితమున్నదియు లేనిదియు చెప్పజాల
ను. లేదని చెప్పిన మీకు నమ్మక మెట్లు గల్గును. శోధించి
కాగితమున్న తీసికొనుడు.

రక్షకోద్యోగి యామెను శోధింప నిశ్చయించి వారిరు
వుర నావలకుబొమ్మని యాజ్ఞాపించెను. స్వామీజీ తా నావలకు
పోవుట కవుసరము లేదని యెద్దియో చెప్పజూచెను కాని
యా రక్షకోద్యోగి తీవ్రముగ నాతని ప్రత్యుత్తరములను వారిం
చి యావలకేగ నాజ్ఞాపించుటచే నాతని యాజ్ఞలకు కట్టుబడవ
లసి వచ్చెను. ఇప్పుడు ఆకార్యస్థానమునందు లలితయు రక్షకో
ద్యోగియు తప్ప నెవ్వరు లేరు. రక్షకోద్యోగి "లలితా!
కాగితము నిచ్చివేయుము" అని యెన్నిమాటలు ప్రబో

ధించినను ఆమె నూరుమాట్లాడక యట్లే యాతనిముఖము ను తేరి జూచుచు మిన్నకుండెను. అంత నాతనికి విసుప్పు జనించి యామెదుస్తులను దడిమెను. కాని యెచ్చటను ఆర హాస్యకాగితము కాన్పించలేదు. "సరే! నాభార్యను పంపె దను. ఆమె నిన్ను బాగుగ శోధింపగలదు." అని చెప్పుచు, యొకసేవకు నామెకడ కాపుండ నియమించి తనభార్యను పం పుటకు బయల్వెడలెను.

ఆమె యట్లరగంటకాలము వేచియుండుసరి కొక స్త్రీ యామెను సమీపించెను. ఆమెయే యారక్షకోద్యోగి భార్య. ఆమె పొడవుగను, తీవ్రవీక్షణములతోడను వింతగ నుండెను. ఆమె లలిత నొక్కసారి తిలకించి "యిప్పటికిని నీవా కాగితము నిచ్చివేసిన నీకేమియు ప్రమాదము కలుగదు. నామాట వినుమ" మని బోధించెను. కాని దానికి మనయువతి కాగితము నీయుట కంగీకరింపలేదు. సేవకులందరును వారి నొంటివిడచి యావ లకేగిరి. ఆమె నలువైపుల నొక్కసారి పరికించి "యీశోధ నలన్నియు నిష్ఫలములు. కాని విధిని నెరవేర్పక తప్పదు" అని యాయువతిని వీక్షించెను. ఏలనోకాని లలిత యామె చూడ్కుల ననాదరించెను. ఆమె కీప్రపంచకభావములు తెలి యకపోవుటయే దానికి కారణము. కాని యామెహృదయాం తరాళముల ధనాశచే నాయువతిని గట్టవచ్చునేమో యని యొక యుపోహము గలుగ తనమెడనుండి యొకహారమును

దీసి యామె కిచ్చి "నాపై ననుగ్రహింపుము. ఈహారము
ను బహుమానమిచ్చుచున్నాను. కైకొనుము" అని చెప్ప
నామె యందుల కచ్చెరువొందుచు నాహారమును గ్రహించి
"నిజముగ నాకిచ్చుచుంటివా" యని రెట్టింప లలిత యామె
యనుమానమును నివారణజేసెను. ఆయువతి హారమును
గ్రహించి, యెద్దియో ప్రసంగించుచు లలితవస్త్రములను శోధిం
ప ప్రారంభించెను. ఆమె యా శోధన పూర్తిగ జేయ నుద్యమిం
చినట్లామె ముఖమే స్పష్టము జేయుచుండెను. లలిత తన యపో
హము వట్టిదయ్యెనుగదా యని విచారించి చేయునది లేక విధి
కి కట్టుబడెను. "నీ జాకెట్టు నిట్టీయు"మని యా స్త్రీ యాజ్ఞా
పింప లలితముఖము వివర్ణమయ్యెను. కాని యాజ్ఞననుసరించి
తనజాకెట్టును విప్పి యామె కందీయ నామె యొకకత్తెరను
చేబూని యందలిరహస్యస్థలములన్నియు చక్కగ విప్పి పరి
శీలించి యొకకుర్చీపై బెట్టెను. అట్లే తక్కినదుస్తులను క్ర
మరీతిని పరిశీలించెను. కాని యేమియు దొరకలేదు. "నీశ
రీరముపై నేమియుదొరకలేదు. నీచర్మమున కంతర్భాగ
మున దాచితివేమో తెలియదు. నేను మొదటనే చెప్పి
యుంటిని. ఇట్టి పరిశోధనలన్నియు వ్యర్థము లని." అని
చెప్పుచు పోవుటకు సమకట్టెను. లలిత ముఖము
వికసించెను. మందహాస మామెపెదవులనందున తాండవ
మాడుచుండెను. ఆమె తనదుస్తులను తిరుగ ధరించి జాకెట్టు

ను తొడుగుటకు యత్నించ నామె నా స్త్రీ వారించి "దానిని తొడుగకుము. అచ్చటనే యుండనీయుము. నాభర్తను దీసికొరావలయును. అని చెప్పుచు వెడలిపోయెను." ఆమె నొక సేవకుని గాచుచుండెను. హారమును ఆయుద్యోగిభార్య కంఠమునందు ధరించిపోయెను. పరిశోధన పూర్తియైనను, తనవద్ద కాగితము లేదని చెప్పినను లలితముఖ మప్పుడు కళావిహీనమయ్యెను.

రక్షకోద్యోగియు స్వేనాజీయును తిరిగి ప్రవేశించిరి.

పాఠకులారా! చెప్పమరచితిని. వీరదు మారువేసమున లలితననుసరించియే వచ్చుచుండెను. ఆతడు కారాగారకవాటమున జరుగుసంభాషణయంతయు వినుచుండెను. సత్వర మాతడు రక్షకోద్యోగి భార్యకడకేగి తన యపరాధ పరిశోధక ముద్రికను జూపి, యామెతో 'నీవు లలితను పరిశోధించినను, ఆమె కాగితమును దీసికొనవలదు. ఇదియొక కుట్రం. దానిని వెలిబరుపవచ్చితిని. నీవు నాకు సహాయము చేయవలెను.' అని వేడ నామె యతనివాక్యములకు వల్లెయని బయలుదేరెను. తనవాగ్దానమునకు బద్ధురాలై యామెవద్దనుండి కాగితమును పరిగ్రహించలేదు.

కాగితము దొరకినదా యని యారక్షకోద్యోగి యడుగునప్పుడు లలితముఖమంటపమున చెమట ధారాపాతముగుచుండెను. అత్యాతురతతో నామె యేమిప్రత్యుత్తరమీయ

నోయని చూచుచుండ "నామెశరీరముపై నేవిధమగు కాగితమును దొరకలే" దని యాపరిశోధకి ప్రత్యుత్తరమిచ్చి తన భర్తయనుజ్ఞవడసి తనదారిని బోయెను.

రఘు—ఈసంగతిని ముందే యేల చెప్పియుండలేదు.

లలిత—తనవద్ద లేదని చెప్పిన మీరు విశ్వశింతురా?

రఘు—అనవసరముగ శ్రమకలుగజేసినందుకు క్షమింప వేడెదను.

స్వైసా—ఆ పరిశోధకి యెవరు?

రఘు—నీయనుమానము లన్నియు గట్టిపెట్టుము. అనవసరకాలయాపనము జేయించితివి. ఆమెయందు నీకు విశ్వాసము లేనట్లు తోచుచున్నది. నాభార్యయే యామెను స్వయముగ పరిశోధించినప్పుడు నీకీయనుమాన మేలకలుగ వలయునో నాకు విచిత్రముగనున్నది. ఈవిషయమున నిక ముందు కలుగజేసికొనబోకుము.

స్వైనా—ఆమెకడ నాపత్రము లేకపోయినను, వచనారూపమున తనభర్తకు కార్యవిధానము నెరింగింపవచ్చును. ఆమెను లోనికి పోనీయవలదు.

రఘు—ఆమె నాపుటకు నాకేమియు నధికారము లేదు. సూపరింటెండెంటుగా రామె కనుజ్ఞాపత్రము నిచ్చియున్నారు. నావిధిని నేను నెరవేర్చితిని. తక్కుంగల విషయములతోడ నాకేమియు నిమిత్తములేదు. అని స్వైనాజీ హిత

బోధల ననాదరముజేసి లోనికేగి లక్ష్మీజీవలన ననుజ్ఞను
గొని లలితను లోన ప్రవేశపెట్టెను. పులిగహ్వరమునుండి
రక్షింపబడినట్లామె సంతసించుచు తనజాకెట్టును గా నయమున
గ్రహించి తనమనోనాథుని మ్రోల నిలిచెను. రక్షకోద్యోగి
తనపని నెరవేర్చినపిమ్మట "నీకొక్క అరగంటకాలము గడు
విచ్చెదను. తరువాత నీవీప్రదేశమునుండి వెడలవలయు"
నని యాజ్ఞనిచ్చి వెడలిపోయెను. లక్ష్మీజీహృదయాంతరా
ళములయందు ప్రేమతరంగములు పొంగుచుండి ప్రవహింప
వట్టజాలక తనబాహుయుగ్మములను జాపి 'లలితా' యని
యామెను బిగ్గకౌగలించి లోనికి గొంపోయెను. లలిత యా
తని నూరార్చుచు తనజాకెట్టునుండి యొకకాగితమును పైకి
దీసి లక్ష్మీజీ పరుండు తలగడక్రింద భద్రము చేసి తనహృద
యపరితాపమును క్రమముగ వెలిబుచ్చగడంగెను. వారి
సంభాషణను వర్ణించుట లిఖితపూర్వకముగ వ్రాయసమ
కట్టుట యసంభవము. పాఠకమహాశయులే యాయుత్సాహ
భయవిషాదములను, మానసవీధియందు గుర్తెరుంగుట కోటు
పడుదురని నాయభిప్రాయము. లక్ష్మీజీ తా నాసాయంసమ
యమున లలితను విడచిన దాదిగ జరిగినవృత్తాంతమంతయు
పూసగుచ్చినట్లు వాకుచ్చెను. లలిత యాతనివృత్తాంతము
నకు విషాదముజెందెను. వీరదు సాక్ష్యము సమయమునకు
వచ్చునని హెచ్చరించెను. ఇంతలో తమకు నియమించిన

యరగంటయు వ్యయమగుటచే వారిసంభాషణల నాటంక
పరచుటకు వచ్చు రక్షకభటుని పదతాడనము వీనుఁబడ
నాయువతి యతిత్వరితముగ "నీతలగడక్రిందనున్న కాగితమే
నీకు సర్వమును బోధింపగలదు. నిన్ను రక్షింపజాలనిచో
యివియే కడసారిచూపులు." అని వడివడిగ తనహృదయేశ్వ
రుని వీడజాలక వీడుచు, చెరసాలకవాటమును బ్రవేశింప
రక్షకభటు డామెను వెలుపలికి గొంపోయెను. లక్ష్మీ తన
చెరయుండె మ్రగ్గుచు తనప్రాణనాయకి యందిచ్చిన పత్రి
మం దేమిలిఖింపబడియుండెనో యని యత్యాతురమున తన
శయ్యను సమీపించెను.



## II

### విపత్తు.

లలిత కారాగారమునుండి వెల్వడునప్పటికి భానుడు
దివమునంతయు ప్రచండకిరణములచే వేల్చుచుండెను. ఆమె
యాప్రదేశమునకు వచ్చి మూడుగంటలన్నరకాలము దాటి
పోయెను. ఆమె తన సందేశమును జయప్రదముగా నెరవేర్చి
తి నను మనశ్శాంతిగల్గి యుండినను వివిధభావప్రళయముల
యందును సూర్యతాపమువలనను, మార్గాయాసమువలనను,
ఆమె కడుంగడు డస్సి నడువజాలకుండెను. మార్గకూడలి నెట్టు
లో సమీపించి బండియొకటి కుదురుచుకొన యత్నించెను.

కాని యాపాడుదినమునం దొక్కశకటము గూడ నామార్గ
మును బట్టి పోవదయ్యె. వర్షపాతమునకై వేచియుండు చక్రి
వాకమునవలె నామె యామార్గకూడలియందు నలువైపుల
జూచుచు నిలువబడి యుండెను. ఆమె తన వృద్ధవనితావేష
మును దాల్చియే యుండుటచే మార్గగాము లెవ్వరు నామె
ను గమనింపక తమదారిని బట్టి పోవుచుండిరి. ఇట్లామె పది
నైదు నిముసములు వేచియుండుసరికి చక్కని వలువలను
ధరించిన యొకయువతి తన్ను సమీపించుట యామె గాంచ
గల్గెను. ఆమె ఎవ్వరాయని తలపోయుచుండగనే యానూతన
యువతి యున వృద్ధవనితభుజముపై చేయివైచి యీమార్గమున
పోవుదము రమ్మని చెప్పుచు నడువసాగెను. లలిత యామెను
మున్నెన్నడు చూచియైన యుండకపోవుటచే విస్మయమునంది
నీ వెవ్వరవు ప్రశ్నింప నాయువతి తన పెదవిపై చేయినిడుకొ
ని "నేను నీకు మిత్రురాలను, మాట్లాడక నావెంటర"మ్మని
హెచ్చరించెను. కాని ఉదయమునుండియు పెక్కిడుముల బడి
యుండుటచేతను, తనవైరిబృందము తన్నువిశేషము వెంబడించి
మాయోపాయమున తన కైగ్గొనరింప సంకల్పించియుండుటచే
తను, లలిత యానూతన యువతిని విశ్వసింపజాలక "నీ వెవ్వ
రో తెలియజెప్పిన గాని నీవెంట రాజాల"నని ప్రత్యుత్తరమిచ్చి
యామెచేతిని విదలించి పారవైచెను. ఆయువతి లలితను చమ
త్కృతిగ వీక్షించి "ఆహా! అసాధ్యకార్యము నొనర్పగల్గిన

యువతియే యిట్లొక సామాన్యురాలి ననుసరింప వెరపుజెందిన లోకమునం దింకెట్టి విపరీతము లుండగల్గును." అని యా యువతి పరిహసింప లలితముఖము కళావిహీన మయ్యెను. ఆమె భావప్రపంచమున శంకానినాదము మారుమ్రోగ జొచ్చెను. "మాయలాడీ! పొమ్ము. ఆవలకుపొమ్ము. నిన్ను నమ్మజాలను." అని యామెనుండి పోవ యత్నించుచుండ వేరొకవ్యక్తి సమీపించుట దృష్టిపధమున బడెను. అత డొకపురుషుడు. లలిత తన మేలిముసుంగునుండి వీ రిరువురకును జరిగిన నేత్రాభినయనము గాంచగల్గెను. అయ్యో! యిప్పు డామె హృదయాంతరాళములయం దూహ్యాతరము గాని భావములు పర్వులెత్తుచుండెను. విదలించి పారవైచిన స్త్రీ తిరిగి తన్ను సమీపించుచుండ నామె యాశలన్నియు కంఠగతము లయ్యెను. తానొక భీతహరిణమువలె పులిబారికి వేచియుండెను.

"అనాదృశముగ. వచ్చినప్పుడు వీరడు నీకేమని చెప్పియుండెనని యాయువతి ప్రశ్నించెను. ఆమెమాటనవ్వడి పూర్వమువలె సన్నముగ లేదు. మున్నెన్నడో వినియున్న ట్లుండెను." నీవెవ్వరో తెలియజాలకున్నదానను" అని లలితప్రశ్నింప "నేను వీరడ్ని" అని తన సహజ కంఠస్వరమున యువతీవేషధారి యగువీరడు ప్రత్యుత్తర మిచ్చెను.

పాఠకమహాశయులారా! యూహింపుడు, తనయాశలన్నియు నిరాశ గావించుకొని, ఒంటిగ శత్రుమధ్యమున

జిక్కితిని గదా యని విలపించు లలితకు, తనవైరిబృందమే మిత్రబృందముగ పరిణమిల్లుసమయమున నామె భావపరంపర లెట్లు కుప్పించి గంతులువైచునో యూహింపుడు. అయినను ఆమె కింకను శంకానివారణ గల్గకుండుటచే నీముఖమును చూపిన గాని నమ్మజాలనని యామెచెప్ప వీరడు ఆమె యమితజాగరూకతకు సంతసించి తాము నిలచియుండినది యొక బహిరంగస్థల మగుటచే నొరు లెవ్వరైన తన్ను గుర్తించిన మోసము-వాటిల్లునని యామెకు నచ్చజెప్పి యామె నొడబరచెను. ఒకవృద్ధవనితయు, నొకయువతియును మార్గమున మాటలాడుచు పోవుచుండుట యందేవియు వింతయుండదు గదా! ఆకారణమున మన తెరువరుల నెవ్వరును ప్రత్యేకముగ వీక్షించి యుండకపోవుటయం దాశ్చర్యము లేదు. వారు కొంతదూర మట్లు నడచిపోయిన తరువాత జనబాహుళ్యము లేని ప్రదేశమును నిరపాయముగ జేరగల్గిరి.

వీర—అమ్మయ్య! యిప్పటికి వారి బారినుండి తప్పించుకొన గల్గితిమి.

లలిత—మనల నెవ్వరైన యనుసరించి వచ్చుచుండిరా?

వీర—మనలను గాదు. నిన్ను.

లలిత—ఎవరు?

వీర—స్యైవాజీవల్ల నియమింపబడిన యొక తెరువరి.

లలిత—నీవెట్లు జూచితివి?

వీర—ఉదయము నుండియు నేను నీవెంటనే వచ్చు చుంటినిగదా.

లలిత—చిత్రము.

వీర—అది యటుండనిమ్ము. లక్ష్మీజీ యేమి చెప్పెను?

లలి—ఆకాగితము నందిచ్చుట మహాకష్టమై పోయెను.

వీర—అదియంతయు నే నెరుంగుదును. మీయిరువుర సంభాషణనుగూర్చి చెప్పుము.

లలి—నీ కెట్లు తెలసెను?

వీర—నీవిప్పుడు చూచిన యాపురుషుడు చెప్పెను.

లలి—అతనికిమాత్ర మెట్లు తెలియును?

వీర—అతడే నిన్ను పరిశోధించిన యువతి. నీక్షేమమును కోరియున్న యామె ప్రధానకారాగారరక్షకోద్యోగి భార్య. లక్ష్మీజీయందామెకు గలయభిమానము వేరెవ్వరికిని లేదు.

లలిత—అట్లయిన నన్ను పరిశోధించినప్పుడామె నా కాగితమును జూడగలైనా?

వీర—ఆమె మనకు సహాయమొనర్పకున్న మన ప్రయత్నము లన్నియు నొక్కత్రుటిలో భగ్నములయి యుండెడివి. అవి యటుండనిచ్చి మీయిరువుర సంభాషణను గూర్చి చెప్పుము." అనియాతడు వేగిరింపలలితతనమనోనాథునితోడ భాషించినవిధమంతయు జెప్పెను. వీరడు తనముఖమున కారుచున్న

చెమ్మటను వ్రేలితో దుడుచుకొనుచు "అట్లయిన యాతడింక
ను కాగితమును చదువలేదా" యని చెప్పుచు నేదియో ప్ర
స్తావింపబోవుచుండ దూరమునుండి ఎవ్వరో యొకవ్యక్తి జూడ
నయ్యెను. వెనుకకు దిరిగిచూడ వేరొకరు వచ్చినట్లయ్యెను.
"ఆహా వారువచ్చియుండిరి. లలితా! భయము జెందక యుండు
ము. దైవానుగ్రహము మనపై యుండెనని యీకష్టసముద్ర
మును దాటి గట్టెక్కగల్గుదుము." అని చెప్పుచు నాతడామెను
చేయిబట్టి వేరొకమార్గము గుండ దీసికొనిపోజొచ్చెను. కాని
వారికన్న యతిత్వరితముగ యావ్యక్తు లిరువురును సమీపిం
పగల్గుటచే వారి పలాయనమున కాటంకము గల్గెను. "లలి
తా! ఆగుము. నీతోడ నొక చిన్నమాట జెప్పవలయు" నని
యందొకవ్యక్తి పిలచెను. అతడే స్యేనాజీ. "ఆగు" మని వీర
డుహెచ్చరింప మనలలితావీరుడు లిరువురును నిశ్చేష్టులై నిలచి
మహావేగమునవచ్చు స్యేనాజీహంతకుని జూడగల్గిరి.

## 12

### చిత్రచర్య.

స్యే—లలితా !. నీవెంటవచ్చు యీమె యెవ్వరు?

లలిత—నీకు చెప్పనవుసరము లేదు.

స్యే—నీకు చెప్పుట కిష్టము లేకున్న పోనిమ్ము కాని
నాకొమరిత మరణమునకు లక్ష్మాజీయొక్కడే కాక నీవును

కారణభూత మయినటుల తెలియవచ్చినది.

లలిత—స్త్రీనాజీ! నీకుతంత్రములకు నీవు తప్పక యొకసమయమున సమాధానము చెప్పికొనవలసి యుండును సుమా!

స్త్రీ—నీ దౌర్భాగ్యము చూడజాలవని విచారించుచున్నాను. నీపై ఫిర్యాదు చేసియున్నాను. నిన్నరెస్టు చేయుటకు యిదిగో రక్షకభటుడు. అని యాతనిప్రక్కనున్న రక్షకభటుని జూప నాతడు ముందునకువచ్చి లలితహస్తములను బట్టి సంకెలలు వేయబోవ వీర డాతని వారించి "అగుము! ప్రభుత్వము వారి యాజ్ఞ జూపింగాని యీమెను బట్టజాలవు" అని యారక్షకోద్యోగిని ఆవలకు ద్రోచివైచెను.

"నావద్ద వారంటు వున్నది"

"చూపుము."

"నీవెవ్వరు?"

"నే నెవ్వరయిన నీకేమి. వారంటు చూపుము.

ప్రభుత్వమువారిని తిరస్కరించుచున్నావు జాగ్రత.

"నే నేమియు తిరస్కరించుటలేదు. అనుజ్ఞాపత్రము నుజూపు వేడుచుంటిని. అట్టియాజ్ఞ లేనిదె యీమెను అరెస్టు చేయనీయజాలను.

"వ్యక్తీ! నీతోడ వాదించుటకు నాకు కాలాతీతమగుచున్నది!!

"కాలాతీత మేలచేయవలయును. వారంటును చూపి యీమెను గొనిపొమ్ము. లేదా! నీమార్గమునుబట్టి గృహమును జేరుము."

"వారంటు చూపనవసరములేదు ఈమెను కొంపోయెదను. ఎవ్వ రడ్డువచ్చెదరో చూచెదను."

అని యారక్షకభటుడు బలుక వీరడిసుమంతయు భీతి జెందక తన సహజస్వరమున "బాగు బాగు అట్లయిన నేనును చూచెదను నీసాహసము" అని ముందున కడుగిడెను. అకస్మాత్తుగ యువతీకంఠమునుండి పురుషస్వరము వచ్చుటచే యాతెరువరు లిరువురును విస్మయమంది జూచుచుండ "పోండు. యిట్టి మాయావేషము నరెస్టుచేయుందమని వచ్చి మోసగించుట కిచ్చట నెవ్వరును వెర్రివారులేరు. మీవారిని మీరుపొండు" అని వీరడు లలితను చేయిబట్టి తీసికొనిపోవ యత్నించెను కాని వారిరువురు నడ్డుపడి, "నీవు పురుషుడవయినను సరియే స్త్రీవైనను సరియే, రక్షకోద్యోగియొక్క విధి విధానమున కభ్యంతరము గల్పించితివేని నిన్నుకూడ నరెస్టుచేసి తీసికొనిపోవలసివచ్చును. జాగ్రత" యని స్వేనాజీ బెదరింప వీరడు చిరునవ్వునవ్వుచు "జయసేనా! యువతినా కదాని నరెస్టుచేయు మిషతోడ తస్కరింపజూచు దుర్మార్గమునకు నీవే సమాధానము చెప్పికొనవలసియుండును."

జయసేనా యనుపదము వీనులబడిన తోడనే స్వేనా

జీ ముఖమం దెచ్చటను ఒక్క రక్తబిందువును లేక సర్వము-
ను ధవళాకృతిని దాల్చెను.

అతడు వీరని సమీపమునుండి రెండడుగులు వెనుక
కునడచి ''నీ వెవరని ప్రశ్నింప వీర డాతనిముఖమునుచూచుచు
''నీయుదంతమంతయు సమగ్రముగ నెరింగియుండిన విపరీత
వ్యక్తిని" అని ప్రత్యుత్తరమిచ్చి తిరిగి తనమార్గమునుబట్టి పో
వుచుచుండ నొకశకటము వాయువేగమునవచ్చి వారిప్రక్కన
నిలచెను. స్వేవాజీ యుత్సాహాతురమున దానిసమీపించి తలు
పుదెరచి "ఆహా ! సరియైన సమయమునకే వచ్చితిరి.
ఈ తెరువరి స్త్రీ వేసమును దాల్చి ప్రభుత్వము వారియాజ్ఞ
నుల్లంఘించుచుండెను. వీరిరువురను బట్టి గొనిపొండు." అని
రక్షకభట వేషమున నున్న యిరువురు నూతనవ్యక్తులను సం
బోధించి వీరనివంక దిరిగి "నీ ప్రగల్భములు నావద్దసాగరావు.
జాగ్రత"యని బెదరించెను.

వచ్చినరక్షకభటు లిరువురును ముందునకువచ్చి "వీరి
రువురలో అపరాధి యెవరు?" అని ప్రశ్నింప స్వేవాజీ "ముసలి
వేషముననున్న యువతి" యనిజూప వారు లలితనుబట్టి యాశ
కటమునకై గొంపోయిరి. అబలయు బేలయు యగుటచే సహ
జగుణమును మాటుపరుపజాలక, వారామెను బండియం
దెక్కించునపుడుపట్టజాలక "వీరడూ! నన్ను విడిచిపోదువా?"
యని విలపింపదొడగెను. "వీరడు" అనుశబ్దము వీనులబడిన
తోడనే విద్యుచ్ఛక్తివలె యచ్చటివారందరు నొక్కసారి కుప్పిం-

చి పారిపోయినవీరడు దొరకెను దొరకె నని సందడిచేయుచు నాతని చేతులను కాళ్ళను గట్టిగపట్టికొని యాబండియందు పడవైచిరి. వీరడు వారిచర్యల కేమియు నాటంకము కలుగ జేయలేదు. రక్షకభటులలో నొకడు బండికి ముందును ఒకడు వెనుకను నిలచి బండిని పోనిచ్చుచుండిరి. స్వానాజీయును, అతని యనుచరుడును దృష్టిపథమును దాటిపోయిరి. వీరడు నలు దెసలజూచి "రక్షకీ! బంధముల నూడదీయుమని కేకవై చెను. చిత్రము బండియాగెను. వెనుకనున్న రక్షకభటుడు త్వరితముగవచ్చి సంకెలల నూడదీసెను. వీరడు చిరునవ్వు నవ్వుచు "లలితా! నీవు రక్షింపబడితివి?"

లలి—ఎట్లు? మనల నెరస్టుచేసి యుండిరిగదా?

ఆమాటలకు ప్రత్యుత్తర మారక్షకభటులలో నొక రు లేదని చెప్పిరి. ఆద్దాని యొకస్త్రీస్వరము. లలిత విస్మయ మునకు మేర లేదు. నీ వెవరని యావ్యక్తి నడుగ "నన్ను గుర్తింపజాలవా!" యని యారక్షకభటుడు తనటోపీ దీసెను.

పాఠకులారా! గమనింపుడు. పురుష వేషమున నాప్రధానకారాగారరక్షకోద్యోగిభార్య వీరల గాచుచు, రక్షకభటవేషమున వారల నరెస్టుచేయవచ్చిన స్వానాజీ హంతకుని చర్యలను గ్రహించి తా నతిత్వరితముగ నొక గుర్రపుబండిపై నొకసేవకునితోడ రక్షకోద్యోగవేషమునవచ్చి స్వానాజీ జిత్తులను విచ్ఛిన్నము గావింపగలైను.

# 13

"కొంచెం దాగమిత్తావూ"

స్వేనాజీకుమరిత యగుశారదను, ఆమెను ప్రేమిం
చిన యొకయువకుడు, లక్ష్మోజీ చంపి నీటబడవైచె నను
వార్త పరిసరగ్రామపట్టణములన్నియు క్షణమాత్రమున వ్యా
పించెను. యువతిపక్షమువారు సాక్ష్యములను బలపరుచుకొ
నుచు విశ్వప్రయత్నములు చేయుచుండిరి. లక్ష్మోజీ మిత్రు
లు పెక్కుకష్టములకు లోనయునను సరియేయని యాతని
నిర్దోషత్వము బుజువుచేయ నయకట్టి శారద మరణము జెంద
లేదనియు, నెచ్చటనో సంకేతస్థలమున జీవించియుండెననియు
వాదులను దేశదేశములను వ్యాపింపజేయుచుండిరి. ఆనాటి
దురంతము ననుభవించి చెదరియున్న లలిత గృహమునుండి
యొంటిగ బయల్వెడలుటకు సంశయించుచుండెను. శారదా
లక్ష్మోజీయుదంతమును విచారించుదినము, యింకను మూడు
దినములుండెను. ఆవిషమదినమందు తనమనోనాయకుని కెట్టి
కీడు వాటిల్లునోగదాయని లలిత తలపోయుచు తనశయనా
గారముననే మగ్గుచుండెను. వీరుడు తన్ను వీడిపోవునప్పుడు
గృహమును కదలిపోవలదనియు నెవ్వరిని విశ్వసింపవలదని
యు చెప్పియుండుటచే నామె స్వేచ్ఛాగమనముల కెల్లయు
నాటంకము గలిగెను.

ఆమె తన మనోవల్లభుని గూర్చి తలపోయుచు గూ
రుచుండి యుండ పరిచారిక యొకతె వచ్చి, "అమ్మా ఎవ్వరో

యొకవృద్ధుడు వచ్చియున్నాడు. ప్రవేశపెడుదునా" యని యడిగెను. లలిత కు పూర్వభీతి తిరిగి యావేశించెను. ఈనూతనవ్యక్తి యెవ్వరోగదా! తన మిత్రబృందమందు వీరకు తప్ప విశ్వసింపదగినవారు వేరెవ్వరునులేరు. వైరులెవరైనవారు వేసమున వచ్చియుండిరేమోకదా! అయినను నామమెరింగిన పిదప యా వ్యక్తి నీయవచ్చునని తలపోసి, యావ్యక్తి నామము మెరిగిరమ్మని సేవకురాలిని బంప నామెయు తనవిధి నొకత్రుటిలో నెరవేర్చి తిరిగివచ్చి "అమ్మా! వచ్చినవానిపేరు చెప్పలేదు. [illegible] మిత్రుడనియు కారాగార ప్రధానరక్షకుని మిత్రుడనియు చెప్పెను." అని చెప్పి యాజ్ఞకై నిలచియుండెను. కాని యామె ద్వ్యాతము ముగియకపూర్వమే యావ్యక్తి లోనబ్రవేశించి లలితహృదయము నొక్కసారి విచ్ఛిన్నము గావించివైచెను. తానెవ్వరివలన ప్రథమమునసే మోసగింపబడెనో, ఎవరిని తనమనోనాథుని న్యాయవాది యని విశ్వసించి తనరహస్యము లెరింగించెనో, ఎవడు తనవైరియగు స్త్రైనాజీకి దక్షిణభుజమువలె వెలయుచు సంతతము తన్ను మట్టుబెట్ట యత్నించుచుండెనో అట్టి మాయకాడు, యాకపటవర్తనుడు, న్యాయవాదిరూపమును దాల్చి వచ్చిన తెరువరి తిరిగి లలితమ్రోల దాపురించెను. లలిత మెరుగువలె తనయాసనమునుండిలేచి యొకమూల నిలచి "కపటీ! నీ వృత్తాంతమంతయు నేనెరుంగుదును. పొమ్ము; ఆవలకుబొమ్ము"

అనుగ్రహించి సహాయాపేక్షచే కేకలిడయత్నించెను. కాని యా
నూత్నవ్యక్తి తన హస్తమును పైకెత్తి "కదలకు. నామాట మీ
రక నిలచియుండుము. లేకున్న ప్రాణాపాయము వాటిల్లగల
దు." అని హెచ్చరింప లలితముఖము రక్తవర్ణముగాంచి క్రుద్ధ
యై యా తెరువరి నావలకుబొమ్మని కసరుచుండ, నాతడు మం
దహాసము జేయుచు నామెను సమీపించి "లలితా! కోపింపకు
ము. వచ్చినవాడు న్యాయవాదికాడు. వీరడు. జాగ్రతగ
పరిశీలింపుము." ఈవృత్తాంత మెరింగించినతోడనే లలిత
ముఖమండలము వికసించెను. సమీపమునకేగి పరిశీలించు
నరి కాతడు నిశ్చయముగ వీరడే. తనవైరులరహస్యము లె
రుంగుటకై యిట్టి మాయవేషము నతినైపుణ్యమున దాల్చి
తిరుగుచుండెను. లలిత తన విస్మయసంద్రమునుండి కొలదిని
ముసములవరకును బయల్పడజాలకుండెను. వీరని ప్రక్ష
క తని వేనోళ్ళ బొగడెను. వీరడుమాత్రము తన యాలోచ
నల నెంతమాత్రము చంచలముగానీయక తన యంగీనుండి
కొన్ని కాగితములను దీసి యామెకిచ్చి "సినాథుని విచారణ
దినము నేటికి మూడుదినములుండెను. శారద యింకను జీవించి
యుండెననుట కెంతమాత్రమును సంశయములేదు. నేనే కార
ణమునైనను, విచారణసమయమునకు హాజరుకాజాలని పక్ష
మున నీవీ కాగితములను భద్రముగ దాచియుంచి వీటిపై వ్రా
యబడియున్న చిరునామాల కందీయుము. కాని నేను మక

ణించితినని నీకు దృఢవిశ్వాసము గల్గినప్పుడుగాని, ఒక్కసం
వత్సరమువరకును నాజాడ తెచ్చుటను గాన్పింపకపోయినప
క్షమునగాని, యీ కాగితముల నీయవలయును. అంతదనుక
నీవద్దనే దాచియుంచుము. ఈ కాగితమును జూడుము. దీని
ని విచారణకాలమున నేను రాజాలికున్న లక్ష్మోజీ కందీయు
ము. అట్లందీయుటకు వీలుచిక్కకున్న నిర్యాలను జేయుము.
ఇంకొకమాట. నీవు కారాగారరక్షకోద్యోగి భార్యయగు
రుక్మిణీబాయిని విశ్వసించి నీకార్యములను నెరవేర్చుకొను
ము. ఆమె నీకు వలయుసహాయ మాచరింపగలదు." అని యే
దియో చెప్పబోవుచుండ కవాటము నెవ్వరో తట్టిరి. వీరడు
కళవరపడి "ద్వారముకడ కేగి వారితో సంభాషింపుము. ఈ
లోపున నేను తప్పించుకపోయెదను." అని యాజ్ఞనీయ లలిత
కవాటమును సమీపించి గడగడవడకుచు తెరచెను. ఆమె
యనుకొనునట్లు పెక్కురుపురుషులు లేరు. ఒకపశులకాపరి
వలెనున్న పదునైదువత్సరముల బాలుడొకడు "కొంచెము
దాగమిత్తావూ" యని యడిగెను. అనవుసరముగ భీతిగల్పించి
నందుల కాబాలుని రెండుదిట్టి తలుపుగడియవైచి లోనికివచ్చు
నరికి వీరడు కాన్పింపలేదు. మెల్లగ నామె "వీరడూ" యని
రెండుమూడుసారులు సంబోధించెను కాని ప్రత్యుత్తరము రా
లేదు. ఆమె తన శయనాగారమును పరీక్షించుసరి కాతడాగ
వాక్షమునుండి తప్పించుక పోయెనని స్పష్టమయ్యెను.

# 14

## నా పేరు యెంకడు.

రాత్రి పదకొండుగంట లయినది. ప్రకృతికన్నియ లలిత నోదార్చుటకో యన తన యాకసవదనమునుండి జలబిందువులను క్రమముగ ప్రవహింపజేసి, దుఃఖమును మర్మరము గుతరి నాపజాలక విలపించెనోయన భోరున వర్షింపదొడగెను. అంధకారము ప్రపంచమున దట్టముగా వ్యాపించెను. లలిత తలిదండ్రు లామెనూరార్చుచు విసిగి వేసారిరి. కాని వారుమాత్రము చేయున దేమున్నది. గృహమునకు వెలుపల ప్రకృతికన్నియ రోదనమును, గృహమున లలితరోదనమును దప్ప నింకేమియు కర్తవ్యము గాన్పింపజేసెను. కొంతవడి వారామె నోదార్చి తమతమ కార్యములు నిర్వర్తించుటకై విరమించిరి. లలితమాత్రము సావడియం దొంటిగ గూర్చుని విలపించుచుండెను.

రాత్రి పదిగంటలయ్యెను. కిటికీవద్ద నేదియో గోటితో గీరిన శబ్దము విననయ్యెను. దానికి కారణ మారయుచు లలిత శబ్దమువినబడినవైపునకే చూచుచు కూరుచుండెను. ఎంతసేపునకును తిరిగి యాశబ్దము వినబడకుండుటచే నది వృక్షశాఖల రాపిడివలన గల్గెనోయని యూరటజెంది తన యకారణభీతికి లోలో నవ్వి తనయేకాంతాలోచనయందు తిరుగజొచ్చెను. కాని మరుక్షణమునందు తిరిగి పూర్వశబ్ద

ము వినబడెను. లలిత లేచి కిటికీవద్దకేగి తలుపును దెరచి
తొంగిచూచెను. కాని ఎవ్వరును కాన్పించలేదు. ఒకవృక్ష
శాఖమాత్రము కిటికీప్రక్కను దట్టముగ నాక్రమించియుండె
ను. ఆశబ్దమునకు కారణ మాశాఖయొక్క రాపిడియే యని
యూహించి యామె విరమింపనుంకించుచుండ నొకచిన్న
యీలయు, నొక చిన్న గురకయు వినబడ్యెను. ఈసంజ్ఞలు
వినినతోడన లలిత మిగుల భీతినంది ముందేమియో మహాపా
యము జరుగనున్నదని తలచి తనతల్లిదండ్రుల కేకవేయనుం
కించుచుండ "లోపలకు పొమ్ము. సమీపమున నెవ్వరో దా
గియున్నారు. లేకున్న యీశునకము గురకపెట్టను." అని
యొకవార్త వినవచ్చెను. ఆయాజ్ఞననుసరించి లలిత తన శిర
మును లోనికీడ్చి కిటికీమూసి యామాటున నొకవైపున కొది
గి జరుగనున్న విధానమునకై వేచియుండెను. శబ్దమేదియో
యొకసంజ్ఞయనియు, ఆమాటలాడినయాతడు తనకొక మి
త్రుడై యుండనోపుననియు, నాతనివద్ద నొకశునకముగూడ
నుండెననియు, వేరొక డెవ్వడో యాసమయముననే యచ్చ
టికి వచ్చియుండుటచే, లోనికేగుటకు శంకించి యతడచ్చట
వేచియుండెననియు నూహింపగల్గెను. కాని యతడెవ్వరో
ఎచ్చటినుండి ఎవరిపనుపున వచ్చియుండెనో యని యామె
యారాటము క్రమముగ నభివృద్ధిజెంద తిరిగి గవాక్షమును
దెరచి వెలికి జూచెను. వెంటనే పూర్వకంఠము "ప్రక్కగ

నిలువుము. లోనికివచ్చుచుంటిని" అని వినబడ నామె తన శిరమును లోనికి జేర్చి గవాక్షమునకు ప్రక్కగ నొదుగునం తలో రొుక పదునైదువత్సరముల బాలుడొకడు గవాక్ష మునుండి లోనికి దుమికి "కొంచెము దాహ మిచ్చెదవా"యని చిరునవ్వుతో నడిగెను.

లలిత విస్మయమునకు మేరలేదు. వీరనితో మాట లాడుచుండ ద్వారమునుతట్టిన కొంటెబాలుడే తిరిగితనహృద యమును కలచివేయవచ్చెను. ఆమె కోపమునకు మేరలేదు. గుడ్లెర్రజేసి "నీవెవ్వ"రని ప్రశ్నించెను.

"నాపేరు యెంకడు."

"ఇచ్చటి కెందుకువచ్చితివి."

"నీకొకవార్త తెచ్చా."

"ఎవరివద్దనుండి?"

"ఊరడికాడ్నుంచి."

"ఏమని?"

"ముందునామాటకి సమాధానమియ్యి. మీయింట మీతండ్రికంటె యింకోఆయనున్నాడా?"

"లేరు"

"బాబో! అట్టయితే యెవరో దొంగతనంగా కిటికీ కాడ దాగున్నారన్నమాటే."

"నీవెటు లెరింగితివి?"

"నాకుక్క గురికెక్కింది."

"నీ వెచ్చటనుంటివి?"

"కొమ్మమీద. లోపలికి పొమ్మని చెప్పినప్పు డెవడో పోతున్నాడు"

"సరే! ఎవరో నాకొరకు తిరుగుచున్నట్లున్నది. వర్తమానమేమి?"

"ఇదిగో యుత్తరము"

లలిత యుత్తర మందుకొని చదువ మొదలిడెను.

"లలితా,

శారదను తిరిగి కన్నులార జూచితిని. నేను విచారణ సమయమునకు రాజాలనందుకు క్షమింపుము. నేను పట్టుబడిన మనవ్యూహమంతయు విచ్ఛిన్నమగును. నా సాక్ష్యము లక్ష్మాజీ కెంతమాత్రమును మేలు కలుగజేయ నేరదు. శారదను ప్రత్యక్షముగ కోర్టువారికి జూపి నీమనోనాధుని నిర్దోషిత్వమును స్థాపించెదను. లక్ష్మాజీకి శిక్షవిధించిరి. కాని వీరని బొందియందు జీవములున్నంతదనుక యాతనిమాత్రి మురి దీయజాలరు. నీవు నిస్పృహ జెందకుండుటకై యీయుత్తరమును వ్రాసితిని. లక్ష్మాజీకికూడ నీవర్తమాన మెరింగింపవచ్చును. నీవు సర్వకాలమును యీ వెంకని మాటలయందు విశ్వాసముంచవచ్చును. ఇతనిముఖమున నాయభిప్రాయములను నీకెరింగించుచుందును. వీరడు."

ఈ యుత్తర మామె కాహ్లాదము గూర్చెను. కాని ప్రత్యక్షముగ శారదను చూచియున్నపుడు తగుసహాయమును గైకొని యామె నేల పట్టి యీడ్చికొనిరాకుండెను? ఇది చిత్రము! తిరిగి యాబాలునివంక దిరిగి,

"ఇంకేమయిన సంగతులున్నవా ?" యని ప్రశ్నించెను.

"అంతే కాని నేను మళ్ళి పారిపోవాలి."

"నీ వయసెంత?"

"పదిహేను."

"మీయిద్దరకు పరిచయ మెప్పటినుంచి?"

"మూడేళ్లనుంచి."

"మీయిద్దరకు స్నేహమా?"

"సాలరోజులు మేమిద్దరం సేపలు పట్టేవాళ్ళం. యీరడు నాకు సదువుసెప్పాడు. తుపాకి సేయడం సెప్పాడు. యీతనేర్పాడు. ఓమాటు గోదార్లో కొట్టుకుపోతావుంటే రచ్చించాడు కూడాను."

"మూడురోజులకింద నీవు వచ్చినప్పుడు వీరడు యిచ్చట నున్నట్లెరుగుదువా?"

"ఆ."

"దాహమిచ్చెదవా యని యేలనడిగితివి?"

"మాయిద్దరికి అదె గుర్తు. ఎవరో యీరద్ని పట్టుకో

డానికి వత్తావున్న ట్లనుమానంగా చింది. అందుకని సెప్పేటం దుకొచ్చు. నేను పోవాలి. యీాధిలోంచి పోతాను.”

“కిటికీనుండి పోరాదా?”

“నాకోసం కాపలాయేశారు. నన్ను పట్టుకోడానికి.”

“పట్టుకొనదలచినవారు నీవుచెట్టుపైనుండ నేలపట్టు కొనలేదు? వారీపాటికే వెడలిపోయియుందురు.”

“నీకు కొంచెంకూడ తెల్దు. సెపుతాయిను. యిద్యా ల యీారడ్ని పట్టుకున్నవోరికి వెయ్యిరూపాయలు బహు మానమిత్తారంట. అందుకని ఎంతోమంది తిరుగుతావుండారు. నేను నీకు కబురుతెచ్చినట్టు సూశారు. కాని ముందే పట్టు కుంటే యే లాభం. నీదగ్గిరనుంచి తిరిగి జాబట్టుకెల్లేటప్పుడు పట్టుకుంటే సంగతులు బాగా తెలుస్తాయని వాళ్ళనమ్మకం. అందువల్ల కిటికీకాడ కాపేస్తారు. నేను యీాధిగుమ్మంలోంచి పోతే వారికి కాఋడను.”

వారిట్లు సంభాషించినపిదప లలిత వీధితలుపు తెరువ వెంకడు ఒకక్షణములో నాయంధకారమం దదృశ్యుడయ్యెను. లలిత తలుపుమూసి లోనికేగుచు తనచరిత్ర యింతవిచిత్రము గా పరిణమిల్లినందులకు విస్మయమందుచుండ తుపాకిపేల్చిన శబ్దము వినవచ్చెను. వెంటనే రోదనధ్వనికూడ వీనులబడెను. సహజముగ జాలిగల్గినదగుటచే తనకు వర్తమానముదెచ్చిన బాలుని వారు హింసించిరని యెంచి నూతియందు బడినవాని

హై నిచ్చెనగాని తాళ్ళుగాని లేకయే పరువులిడునటులా తలుపుదెరచికొని యూరోదనమువచ్చినదెసకై పరువెత్తెను.

---

## 15

### ప్రమాదము.

శీతవాయువు చీదరించుకొనుచు నామెను ఖనుండలామును దాకి కలతబెట్టుచుండెను. ఆమెసమీపమునుండి యొక నల్లని యాకృతి పరువెత్తినటు లలికిడి కలుగ నాదెసకై తేరి జూచెను. అదియొక శునకము. వెంకని యార్పు విని యతని శునక మాతనికై పోవుచుండెనని గ్రహించి యామె దాని వెన్నంటి పరువెత్తెను. కాని యావరణను దాటి పెక్కు గజముల దూరము పోయినను ఆజంతువు తనస్వామిని జేరదయ్యె. క్రమముగ నామె పూర్వము నున్న ఘాసంగ్రహమునకు మూలపీఠికయగు వంతెనకడకు వచ్చి చేరెను కాని యింకను వెంకనిజాడ గాన్పింపలేదు. ఆమె తనతప్పిదమును గ్రహింపగల్గెను. వెనుకనుండి "కాంతా! పరువెత్తకుము. నిన్ను తప్పింప నెవ్వరును నేడు రాజాలరు." అనుశబ్దము వినబడెను. దినదినగండము వేయివర్షముల జీవిత మనునట్లామెకు నిమిషనిమిషమునకును గండములే కల్గుచుండుటచే మతిమిసుమంతయు చలింపలేదు. దైవముపై భారమిడి పరువెత్తసాగెను. కాని కొలదికాలమునందె యామె తెరువరి యా

మెను సమీపించి వేణీభరమును చేతబట్టి నిలిపివేసెను. ఆమె
నాతని బలాత్కారముగ గొంపోయి యుండెడివాడే కాని మ
రుక్షణమున ''కొంచెము దాహమిస్తావా?" యని యొక కేక
వినవచ్చెను. ఆ తెరువరి తన్నెవ్వరును పరిశీలించుటలేదని
దృఢముగ విశ్వసించియుండుటచే ననాదృతముగ నీకేక యా
తని కలచివైచెను. "ఎవరక్కడ?" యని ప్రశ్నించెను. కాని
యాబాలుడు దిక్కులు ప్రతిధ్వనించునటు లొక పెద్దనవ్వు
నవ్వుచు "నేనే" యని ప్రత్యుత్తర మిచ్చెను. తెరువరి తన్నె
వ్వరో వెంబడించుచుండిరని గ్రహించి తనచేతనున్న తుపా
కిని గాలిలోనికి పేల్చెను. కాని దానికి ప్రత్యుత్తరము తిరిగి
యొక పెద్దనవ్వు వినవచ్చుట తప్ప తన్ననుసరించువారు పలా
యనమగు గుర్తులు పొడసూపలేదు. కాని యొకవాక్యము
"తెరువరీ! ఆమెను వదలి నీదారిని నీవుపొమ్ము లేకున్న
నిదే పేల్చుచున్నాడను. ఈదెబ్బతో చచ్చెదవు" అని
వినవచ్చెను. మనహంతకుడు యోజించి తానెవ్వరిని జూడ
జాలకున్నను తన్నెవ్వరో పరికించుచుండిరని గ్రహించి యా
యువతిని బట్ట నది సమయముగాదని ప్రాణరక్షణార్థమై యా
మెను విడచి యతివేగమున పలాయనమైపోయెను.

మరునిమిషమున వెంకడు లలితను సమీపించి యా
మెను దోడ్కొనిపోయి గృహమందు ప్రవేశపెట్టి యంతర్ధా
నమయ్యెను. లలితకై యామె తలిదండ్రులెంతయు చింతించు

చు నా యావరణమునందంతయు కొదకుచుండిరి. లలిత జన
కుడు జరిగిన వృత్తాంతమునుగూర్చి పోలీసువారి కెరింగించి,
స్వైనాజీ తనకూతును బలాత్కారముగ తస్కరింప జూచు
చుండెనని ఫిర్యాదుచేయ సమకట్టెను. దానివలన లక్ష్మాజీ
వైపు సాక్ష్యము బలపడునని యాతనియాలోచన. కాని
సహజనైపుణ్య విచక్షణశీలయగు లలిత యాతని వారించి,
తీర్పు పూర్తియగునంతవరకును విఘాతము లెన్నటికినైన
రామోర్చియుండి తుట్టతుదకు పరియవసానము ను జూడవలయు
నేగాని, ఋజువుచేయనలవిగాని యిట్టి ఫిర్యాదులవలన ప్రి
యోజనము లేదని తనజనకునకు నచ్చజెప్పి యతని యుద్యో
మమునుండి మరలించెను.

---

# 16

## మరణదండన.

నేడు లక్ష్మాజీకేసు విచారణదినము. సెషన్సువారు
తీర్చి కూర్చుండియుండిరి. క్రిమప్రికారము ముద్దాయిని కోర్టు
నందు ప్రివేశము జేయించి విచారణను ప్రారంభించిరి. చూ
డవచ్చిన జన మొకవైపునను, యిరుకక్షుల బంధుమిత్రు
లింకొకవైపునను కోర్టునందు దట్టముగమూగి యల్లకల్లోలము
గావించుచుండిరి. క్రిమముగ వాది వాదితరఫుసాక్షులను
విచారణజేసిరి. తరువాత ముద్దాయితరఫు న్యాయవాది లేచి

తన వాదనను ప్రారంభించెను. బాహ్యప్రపంచ మంతయు నొక్కపర్యాయము నిశ్శబ్దమయ్యెను. అన్యాయవాది విపులముగ తనముద్దాయి చరిత్రాంశములనుజెప్పి లక్ష్మీజీవంక దిరిగి "లక్ష్మీజీ! ఇరువదియొకటవతారీఖు ఏప్రియల్ నాటి మధ్యాహ్నమును, సాయంత్రమును, రాత్రి పన్నెండుగంటల వరకును యేమిజరిగెనో చెప్పు" మని యడిగెను. లక్ష్మీజీ యిట్లుప్రారంభించెను.

"ఏప్రియల్ ఇరువదియొకటవతారీఖు మధ్యాహ్నము నేను వివాహమాడనున్న లలితయను యువతి గృహపెరటి వాకిటనిలచి యామెతో సంభాషించుచుండ శారద యచ్చటకు వచ్చెను"

లక్ష్మీజీ న్యాయవాది లేచి కోర్టువారిని సంబోధించి "అయ్యా! గమనింపుడు" నేను వివాహమాడనున్న లలిత యనుపదమును గమనింపుడు. వివాదకారణము- ఆత డెవరిని ప్రేమించి వివాహమాడనుండెను. అనునది యొకముఖ్యాంశము. ఈలక్ష్మీజీ యీమెను సంవత్సరమునుండి ప్రేమించుచున్నటుల ఋజువుచేయగలము. అతడు తనప్రేమ నిశ్చలముగను, నేకాగ్రబుద్ధిగను జేసియుండునటులగూడ నిర్దేశింపగలము. ఈకారణమున శారదతో నీతని కేవిధమయిన బాధ్యతయు లేదని తేటతెల్లమగుచున్నది. బాధ్యతలేని సమయమున నామె నకారణముగ నిట్టిమతిహీనుడును చంపియుం

డజాలడు. అనేక సిరిసంపదలయందు తులదూగుచు, నుత్తమ
వంశజుడును, ఉత్తముడును, మాన్యుడును, బుధజనవిధేయుడు
ను వివేకియునని ఎన్నోసారు లెందరెందరి ముఖమునుండియో
మన్ననలనందిన యీయుత్తమపురుషుడు, భావిమహాదశాకాం
క్షకుడైన యీలక్ష్మోజీ, యకారణముగ చిత్తభ్రాంతిగల్గి,
యపరిచితయగు నొకయువతినిచంపి మహాప్రవాహమునందు
ద్రోయునా? కోర్టువారు న్యాయబుద్ధితోడ నీప్రశంస
ను విచక్షణ జేసి న్యాయము ప్రసాదించెదరు గాక. అది
యును గాక యొకజిత్తులమారి, క్రూరుడు, వేరువ్యాపారములు
లేక యొకరూపవతి నెరగాజేసి యొకద్రవ్యవంతు నాపా
మాయోపాయముల బడనేసి, యామె నాధారభూతముగాజే
సికొని యాయువకుని సర్వసంపదలను బడయనుంకించి, తుట్ట
తుద కాయువకుని ధీరచిత్తమును విచ్ఛిన్నము గావింపజాలక,
ద్రవ్యాపేక్షచే నొక దుర్నయవ్యూహమును బన్ని, వారస
త్వము నొకదానిని గల్పించుకొని యతని తుదముట్టింప
నెంచుటయం దెద్దియైన యసత్య ముండగల్గునా? దుష్టుల కిది
సామాన్యకార్యము. మున్నెన్నియో జరిగెను. నేడు మరి
యొకటి జరుగనున్నది.

ఈవాక్యములు చెప్పుసమయమున స్వైనాజీ కొద
మసింగమువలె యరుణనేత్రములతో కుప్పించుచుండెను.
ప్రేక్షకులయం దల్లకల్లోలము మిన్నుముట్టెను. కాని నేత్ర

హస్తులు వానిని వారింప తిరిగి లక్ష్మీజీ యిట్లు ప్రారంభించెను.

"శారద మాసమీపమున నిలచి నన్ను రమ్మనిసైగ జేసెను. నేనామె చెప్పునదెద్దియో వినగోరి మనమునందెంతయు నిచ్ఛలేకుండినను, యామెను సమీపించితిని. సభలయందుగాని, తదితర బహిరంగస్థలములందుగాని యామెను కలసికొని యుంటినే కాని యిటు లొంటరిగ నెన్నడును మాటలాడియుండలేదు. ప్రథమమున మాసమావేశము ఆమె తండ్రియని చెప్పు యీస్సీనాజీ యామెనుగూర్చి నావద్ద ప్రసంగించినపుడు. రెండవమారీమెను నేను జంపి యుంటినని చెప్పిన విషమసమయమందు.

నేను సమీపమున కేగినపిదప నాతో నేదియో యొకవార్త చెప్పవలయుననియు రాత్రి ఎనిమిదితొమ్మిదిగంటలకు తన గృహమునకు రమ్మనియు జెప్పెను. ఆమె గృహము వంతెన కావలిభాగమున ఆర్యాపురమువైపున నుండుటచే నేను భోజనానంతరము బయలుదేరి పోవుచుండ వంతెనవద్ద నన్ను శారద కలుసుకొని "నీవాలస్యముగ వచ్చుచుండుటచే నిన్ను గొంపోవుటకు నేనె వచ్చుచుంటి"నని నాకెదురుగవచ్చెను. అట్లు నన్నొంటరిగ వంతెనవద్దకలసి మాటలాడుచు వంతెనపై జేర్చి, చాలవరకు ప్రసంగించెను. మాప్రసంగములనుగూర్చి చెప్పనవసరములేదు. కాని మమ్ము ప్రత్యక్ష

ముగ మాటలాడుట జూచితినని చెప్పిన సాక్షి వాక్యములు సత్యములు."

ఇతనికే వీరడు మూడుదినములతరువాత శారదతో మాటలాడుట జూచెనని చెప్పుటచేతను, లక్ష్మాజీ, యా సాక్షి నిజమేకల్పించుండెనని యొప్పుకొనుటచేతను, దానిసారాంశము బోధపడక ప్రజావళియందు వేరువేరు భావములు తాండవమాడజొచ్చెను.

వాదితరపుప్లీడరుగారు లేచి కోర్టువారి నభినందించి, లక్ష్మాజీ తనతప్పిదము నొప్పుకొనుచుండెనని వాదింప మొదలిడెను. కాని ముద్దాయితరపు ప్లీడరుగారు లేచి వారిని వారించి "లక్ష్మాజీ నిజమును చెప్పుచుండెననియు, తాను హత్య చేయలేదని వక్కాణించుననియు, సర్వమును వినిసపిదప వాదింపవచ్చుననియు జెప్పి కూరుచుండెను. లక్ష్మాజీ తిరిగి ప్రారంభించెను. "నేటితో నీవు నాపొత్తు నపేక్షించుట సమాప్తమగునని నేను వచించిన మాటలథ్యము. అందులకు నా యర్థ మామె మరణించునని కాదు. ఆనాటినుండి యామె నాతోడ సంభాషింపకుండును గదా యని నాయభిప్రాయము. మేమిద్దరము కొంతవరకును వివాదపడి పోరాటమానల్పునంతలో నన్నకస్మాత్తుగ ద్రోయ నీట బడితిని. పడుచు సహాయాపేక్షం జేసి యామెంబట్టి యీడ్వ మేమిరువుర మొకేపర్యాయ మానీటం బడితిమి. నేను యీత

బాగుగ వచ్చినవాడనగుటచే నాప్రాణముల దక్కించుకొని యామెను రక్షించుట కామెపడినదిక్కునకై పరికింప వేరొక వ్యక్తి యామెను రక్షించి కొంపోవుచుండెను.

. అనిమిషసమునుండి నామనమునం దొక శంకపొడమె ను. నే నొక దుష్టవ్యూహమునం దిరికికొని యుంటినని గ్రహింపగల్గితిని. నేను నానయనములతో ప్రత్యక్షముగ తీరమును జేరుటయు నాయంధకారమందు వడివడిగ నదృశ్య మగుటయు చూడగల్గితిని. ఇట్లనాదృశముగ నేడు శారద చంపబడి నీటబడియుండె ననియు, సీలక్ష్మో జీ యామెను వధించెననియు వక్కాణించుట జూడ నాయను మానము లన్నియు ధృవమయ్యెను. నావచనములయందలి సత్యాసత్యములు ప్రజలనెల్ల బోధించెడి యాపరమేశ్వరునకే తెలియును. ఆపరమేశ్వరుడే నన్ను రక్షించుగాత."

ఈచిన్న విపరీతగాధను చెప్పునరికి ప్రేక్షకులయందు వివిధభావములు విద్యుచ్ఛక్తివలె ప్రసరింప స్తంభీభూతులై నిలచిపోయిరి. వారు తమ భావములను వెలిచేయకపూర్వమే ప్లీడరుగారు క్రాసుపరీక్షచేయ మొదలిడిరి. లక్ష్మోజీ యించు కయును చలింపలేదు. తరువాత పీరనిసాక్ష్యమును గూర్చి కొంతవరకును వివాదు జరిగెను. ముద్దాయితరపు ప్రదర్శించిన కాగితము లేవియును లేవు. అతనితల్లి తనదేశమునుండి వ్రా సిన యుత్తరములో నతని తండ్రి కిరువక్షములయం దొక్క

బందుగుడైనను లేనందున తమకు సహాయ మొసఁగువారు లేకపోయిరను వాక్యమును కోర్టువారికి ప్రదర్శించిరి. కాని యీ వాక్యమునందు పరిగణింపదగిన నిశ్చితార్థము లేదని కోర్టు వారు దానిని త్రోసివైచిరి. అది లక్ష్మీజీ దౌర్భాగ్యమని చెప్పుటకు సంశయము లేదు. తక్కిన విచారణ యంతముఖ్యముగానందుచే విస్తరించి వ్రాయలేదు. తీర్పునకు మరునాటికి వాయిదా వేయుటవలన నాదినముననే ప్రజలందరును తమ తమ నివాసముల కేగిరి.

మరునాడు పదకొండుగంటలకు తిరిగి య దరును సమావేశమయిరి. న్యాయమూర్తులందరును తీర్చి కూరుచుండి యుండిరి. ప్రధానన్యాయమూర్తి ముద్దాయి అపరాధియా కాదాయని ప్రశ్నించెను. మొదటివాడు అపరాధియని లేచి చెప్పెను. ఆవాక్యమే తక్కుంగలవా రందరియందును ప్రతిధ్వనించెను. అందరును మారుమాటాడక తమతమ యాసనములయందు శిరములను చేతులయం దిమిడ్చి కూలబడిపోయిరి.

పాఠకులారా! యూహింపుడు. ప్రజావళియందును మనకథానాయక నాయకీ హృదయములందును భావకీలిక లెట్లు ప్రజ్వరిల్లుచుండునో యూహింపుడు. ఆసముదాయమునందు విచారసూచకముగ మూల్గువారును, కంట తడిపెట్టెడు వారును, వికటముగ మందహాసము జేయువారును, కర్మమున

కవ్వ డేమి చేయగలడనువారును, చేసినపురాకృతకర్మమ
నువారును, ఇట్టిచిత్రమెన్నడును జూడలేదనువారును వేనవే
లుగనుండిరి. తక్కుంగల ప్రేక్షకులలో ద్రోహి తగువిధ
మున గురుతింపబడెను. న్యాయమూర్తులు బాగుగ యోజిం
చిరని సంతసించుచుండిరి. కాని యాసమూహమునం దొక్క
డుమాత్రము నిశ్చలహృదయముతో, నంతమాత్రము కొం
కును జంకును విచారమును లేక తనచిత్తమును దేనియందో
లీనముగావించి నిలచియుండెను. అతడే మనలక్ష్మాజీ. అతనికి
తీర్పువలన భావము లెంతమాత్రమును వైకల్యమునందలేదు.
భీకరరూపమును దాల్చలేదు. నిశ్చలముగ నట్లే తనశిక్షకై
వేచియుండెను.

ఈవిషాదాంశముపై పెక్కుకాలము వేచియుండి
పాఠకుల హృదయవీథియందు దుఃఖపరంపరలను పర్వాలె
త్తించుట భావ్యముగాదు. లక్ష్మాజీకి మరణదండన విధింప
బడెను. తిరిగి విచారణచేయుమని విన్నవించుకొనిన యర్జీ
నిరాకరింపబడెను. శిక్షను మార్పుజేసి వేరువిధముగ శిక్షిం
చుడని వేడుకొనినప్రార్థన లన్నియు నరణ్యరోదన మయ్యెను.
లోకు లందరిచే సుగుణాభిరాముడని పేరుగాంచిన మన ల
క్ష్మాజీ నేడు, తన తరుణవయస్సునందు, భావిమహాఫలము
లన్నియు గోల్పోయి, యనాదృతముగ, నన్యాయముగ, దు
ర్నయవ్యూహముల కీల్గి, కారాగారమునందు బంధింపబడి

యొక్క స్త్రీహత్యామహాపాతకమునకు తన ప్రాణములను ధారపోయవలసివచ్చెను. ఆహా! విధికృతమును దప్ప నెవ్వరి తరము!

## 17

### మాయింట భుజింపబాలను.

ఈమరణదండన విధులబడునప్పటికి లలిత తనగృహముందు వీధివాకిట నిలచియుండెను. ఆమె తన తలిదండ్రులకై వేచియుండెను. ఇంతలో కొందరు బాలురామార్గముననే పోవుచుండ "నేమయిన" దని ప్రశ్నించెను. దోషియని తీర్పుజెప్పి మా—అని చెప్పబోవుచుండిరి. లలితముఖమంతయునొక్కసారి వికారరూపము దాల్చెను. కండ్లు మిలమిల ప్రకాశింపజొచ్చెను. దుర్భరవిషాద మెట్టిదోగదా! వారందరును చూచుచుండగనే నేలకొరగి నిశ్చేష్టయై యొక్కక్షణమున స్పృహదప్పి పడిపోయెను. మధ్యమధ్య యామె నయనములను విప్పి చూచెను. కాని యవి విపరీతకాంతులతో వికటరూపమును ప్రదర్శించుచుండెను. ప్రేమపూరితములును, ధీరోదారగుణ ప్రదర్శకములునగు నామె నయనములు నేడు భీకరోన్మాద ప్రదర్శకము లయ్యెను. బాహ్యప్రపంచము నామె గాంచుచుండినను, మానసప్రపంచమునం దామె చూచు వస్తుసముదాయము ప్రతిఫలించుట లేదు. ఆమె జననీజనకులు గృహమునకు జేరి యామెను లోనికి గొంపోయి

యూరడింపజూచిరి గాని ప్రయోజనము లేకపోయెను. వై
ద్యుని బిలిపించి పరీక్ష జేయింప నామెకు మతిభ్రమణము కల్గె
నని చెప్పి యెద్దియో యౌషధమిచ్చెను. కాని యామె యున్మా
దమిట్టి సామాన్యౌషధసేవవలన నుపశమించునా? ఆమె భా
వనాప్రపంచమం దనుమాన, భయ, ఘాతుకాపైశాచ మా
వరించెను. మాటిమాటికి 'లక్ష్మాజీ లక్ష్మాజీ' యని విచారిం
చుచు అకస్మాత్తుగ "దుష్టులారా! తొలగిపొండు. ఇదె వచ్చు
చుంటి. మీ కండకములను మాపుజేసి మీ రూపుమాపెదను."
అని యీవిధముగ వివిధ తెరంగుల పరితాపము నందుచుండ
శారదహత్య కిరువురు వ్యక్తు లెరగా సనుష్ఠింపవలసి వచ్చె
నాయని సందేహింపదొడంగిరి. ఆమెకు తీవ్రమగు మతిభ్రమ
ణము కల్గెననుట తథ్యము. ఆమె దృష్టిపథమున బడిన ప్రతి
వస్తువును "నీకు శారద కనుపడినదా? లక్ష్మాజీ యేమని చెప్పె
ను? తిరిగి వచ్చెదననెనా? నన్నెవ్వడు రా నియమించెను?
వీర డింకను బ్రతికియుండెనా?" యని యనేకవిధముల పిచ్చి
దానివలె భాషణలు చేయుచుండెను. చిన్నవాడు విలాసార్థ
మై నేర్చినపాటల నన్నియు నిముస నిముసమునకు నేకరు
బెట్టుచుండెను. ఆమె ప్రాణత్యాగము చేయునా? యనుశంక
యామె తలిదండ్రుల హృదయమును పీల్చి పిప్పి జేయుటచే
సర్వకాలము నామె నొకకంట గాచుచుండిరి. ఘనవైద్యులచే
చికిత్స చేయించుచుండిరి. కాని యామె మనస్తాప మంతకు కది

రెట్లు హెచ్చుచుండ నేగాని యువళమన మెంతమాత్రమును గలుగదయ్యె. క్రమముగ శరీరము కృశించిపోవుచుండెను. "ల త్ఖ్మాజీ దోషియని తీర్మానముజేసిరి." అనువాక్య మామెకర్ణ ములయం దెల్లకాలము ప్రతిధ్వనించుచుండెను.

*   *   *   *   *   *   *

ఈనాడు మధ్యాహ్నసమయమందు వైద్యులవాక్యము ల ననుసరించి యామె తనయింటి వరండాయం దొకపడక కుర్చీపై నరుండి యాగౌతమీనదినుండి వీచు చల్లనిగాలిని మనసార గ్రోలుచు సృష్టివైపరీత్యమును గాంచుచు తనహృ దయతాపము నొక్కింత శాంతపరచుచుండెను. ఆమె యాలో చనాసంద్రమునందుండి బాహ్యప్రపంచమును మరచెను. ఆమె తనదృష్టుల నెదుటనున్న వృక్షములవంకను పచ్చికబయ ళ్ళవంకను నిగుడ్చి చూచుచుండ దూరమున నొకవృద్ధుడు కుంటుచు సమీపించుచుండెను. తెల్లని వెండ్రుక లాతనివయ స్సును బాగుగ ప్రచురణజేయుచుండెను. అతనిముఖమంత యు వాడిపోయి, ఎండవాన లనక జీవితమంతయు నొకేవిధము న కష్టపరంపరలందు గడపినటుల వివర్ణత గాంచియుండెను. తా నావిచారావస్థయందుండియు నావృద్ధునిపై నామె కొ క్కింత జాలికలైను. అతడు తనకర్ర నాధారముజేసికొని కుం టుకొనుచు, లోనేదియో గొణుగుకొనుచువచ్చి లలిత కెదు రుగ కొంతదూరమున కూలబడెను. నిముసమొక్క యుగ

ములవలె గడపువారి కెద్దియైన విచిత్రాదర్శకము కనులబడినపుడు దానిని జోవికుపక తమబుద్ధినంతయు నాయాదర్శకమున కే బినిచెతురుగదా! అట్లనే మన లలితయు నావృద్ధుని జూచుచు కూరుచుండెను. చేష్టలనుబట్టి యతడు మిక్కుటముగు యాకలిచే పీడింపబడుచుండినటు లామె గ్రహింపగల్గెను. తన చేతితో రమ్మని సైగజేయ నావృద్ధు డతికష్టమున లేచి యామెసమీాపమున గూరుచుండెను.

"నీ వెక్కడనుండి వచ్చుచున్నావు?"

"అమ్మా! నాకొక యూరును యిల్లును గలదా? చాల దూరమునుంచివచ్చుచుంటిని. ఆకలి-ప్రాణము పోవుచున్నది" లలిత తనజననిని పిలచి యాముసలివానికి కొంచె మన్నము బెట్టుమని చెప్పెను. మున్నెన్నో సారులు మారువేసమునవచ్చి తమకూతును బలాత్కరించి గొంపోవయత్నించి యుండుటచే నాయమ యాతని విశ్వసింపజాలక సమీాపమునకేగి యాతని పరీక్షింపదొడగెను. అభికుకుడు తనశిరమును పైకెత్తి తానెవ్వడను మోసకాడను కాదనుచుండెనోయన దృష్టుల నామెపై బరపెను. ఆమెయు నాతని యూరుపేరులనుగూర్చి కొంతముచ్చటించి యాతనియంతటి వృద్ధున కొక గృహము లేదని చెప్పుమాటయందు విశ్వాసములేక యత డెవ్వరయిన మోసగాడా యని శంకించెను. కాని, తిండిలేక యార్తి నల్పువాని నావలకు నిర్దయబూని బంపజాలక కొంచెమన్నమును

దెచ్చుటకై పోసికిబోయెను. ఆభిక్షుకుడును ఆమెచర్యల నా మూలాగ్రము పరికించి పెదవివిరచి లలితనుజూచి "అమ్మా! నేను మీయింట భుజింపజాలను. 'భక్తిలేనికూడు పట్టెడైన నేమి' యనునట్లు నీతల్లి నన్ను శంకించు కారణమున మీరిడు భోజనము నాకు రుచింపదు. నాదారిని నే బోయెదను."

లలిత—భిక్షుకా! నీకువచ్చినభయమేమియును లేదు మాకు పెక్కురు విరోధులుండుటచే మాతల్లి శంకించుట కవకాశముగలైను. నాకు నీయం దేవిధమగు శంకయును లేదు. కావున మాయన్నమును నీవు దినవచ్చును.

భిక్షు—సరే. అమ్మా! నీశరీర మస్వస్థతగానున్నట్లు గాన్పించుచున్నది. జబ్బుగానున్నదా?

లలి—అగును. నాకు జబ్బుగనేయున్నది.

భిక్షు—నీవు సౌందర్యవతిగను దయార్ద్రహృదయవుగను గన్పట్టుచున్నావు. ఆపాపిభగవంతుడు నీకొకరోగమును గల్పించి శుష్కింపజేయుట జూడ సన్మార్గులకే యిక్కట్టులు సంభవించుననుమాట నిజమగును.

లలి—నాకంటె నెందరో సన్మార్గులు కష్టములపాలైరి. నామాట లెక్కయేమి?

అని వారిరువురును సంభాషణోద్యుక్తులగుచుండ నామెతల్లి భోజనమునుదెచ్చి యాలతనిముందిడి తనకుమార్తెను జూచి యాభిక్షుకు డెవ్వరో మోసగాడని తనయనుమానము

నువెలిబుచ్చి తనదారిని బోయెను. ఆమె లోనికేగినపిదప నావృద్ధుడు లలితనుజూచి "మీతల్లి యేలకో నన్నుజూచి శంకించు చున్నది."

లలి—నీ వెట్లు గ్రహింప గల్గితివి?

వృ—ఆమె చూపులవలనను, మాటలవలనను.

లలి—నేను నిన్ను నుమాని పనంతవరకును నీకేవియు భయములేదని మున్దె చెప్పితిని గదా! కడుపు నిండినదా?" యని, భోజనమును ముగించు నాభిక్షుకుని సంబోధించుచుండ నామార్గమును బట్టి యిరువురు వ్యక్తులు వీరిని తదేకదీక్షతో జూచుచు పోవుచుండిరి. ప్రారంభమున మన భిక్షుకుడు వారిని జూడలేదు. కాని లలిత ముఖవికాస మకస్మాత్తుగ మారుటచే దానికి కారణ మారయుచు వెనుదిగిరి చూచి కారణమును గ్రహింపగల్గెను. అతడు తన శిరమును పంకించి,

"అమ్మా! కడుపు నిండినది. కాని నీకు శరీరమందలి వ్యాధి తిరిగి యుద్రేకము జూపుచున్నట్లున [illegible] శ్నించెను.

"అవును. నీవెట్లు గ్రహించితి!

"నీ ముఖమును బట్టి"

"నీవు నిపుణుడవువలె నున్నా

"అది నిపుణత్వము గాదు. [illegible]రముల నుండి కాచి పడపోయుచుంటిని. మీతండ్రి యింట [illegible]

“లేదు. గ్రామములోని కేదియో పనియుండి వెళ్లి యున్నాడు.”

“సాయంత్రమునకు తిరిగి వచ్చునా?”

“రాడు. పనియుండుటచే నీరాత్రి వేరొకరి యింటనే యుండును.”

ఈమాట వినినతోడనే భిక్షుకుడు తుళ్లిపడి వింత తెరగున చూపుల నామెపై బరపెను. ఆమెయు నాతని చిత్రవర్తన కచ్చెరువందుచు,

“నీ కీ కలవరమునకు కారణ మే” మని ప్రశ్నించెను.

“ఏమియును లేదు. మీతల్లి, నన్ను శంకించుచుండెను. నాకీ ప్రపంచమున పరుండుటకు గృహమైనను లేదు. నీతండ్రి యింటనుండిన యాయన యనుమతిని బడసి యీరాత్రి యిచ్చటనే నిదురింప నెంచితిని. ఇప్పు డాయన రాత్రికి గూడ రాకున్న నాగతి యేమి కావలయును?”

“భిక్షుకా ! నాకును విచారమగుచున్నది. కాని కారణాంతమున నీకిక్కడ పరుండుట కనుమతి నీయజాలము. దగ్గరనే యొక సత్రమున్నది. అచ్చట పరుండుము. నాకు బాధ యెక్కుడ మగుచున్నది. నే బోవలయును.” అని చెప్పుచు నామె యాభిక్షుకుని సాగనంపి లోని కేగి తలుపు వైచుకొనెను.

భిక్షుకు డెవరు? తనతండ్రి విషయ మారయుట కాతని కేమి యవసరము? అతని కళవరమునకు కారణ మేమియను సంస్థ లామెను బాధింపకపోలేదు. ఆమె యింకను ఎట్టికష్ట ముల కొడిగట్టవలయునో యని మనమున శంకించుచు నా రాత్రి జాగరూకతతో పరుండవలయు నని నిశ్చయించు కొనెను.



## 18

### చెవిటివాడు.

లలిత తనహృదయపోద్బల్యము ననుసరించియుండిన తక్షణ మావృద్ధభిక్షుకునికి తన గృహమందు పరుండుటకు కొంచెము చోటిచ్చియుండెడిదే. కాని యామె మనస్సాక్షి యామెను వారించెను. ఆభిక్షుకుడును లలితచే వెడలగొట్ట బడి వడివడిగ కుంటుకొనుచు నాగ్రామసత్రమును జేరుచుండ మార్గమధ్యమున నిరువురు యువకులు దాపరించిరి. ఈతని జూచినతోడనే వారిలో నొకడు,

"ముసలోడా! ఏడకెల్తుండావు?" అని ప్రశ్నించెను. ఆప్రశ్న నాలించి యావృద్ధుడు తనతలనెత్తి జాగ్రతగ వానిని పరిశీలించి తాను లలితతో సంభాషించునప్పుడు తమ్ము బరి కించుచుపోయిన యువకులలో నొకడని గుర్తించి, శిరమును కంపించుచు చెవిటివానివలె నటించుచు తనచేతిని చెవిపై

జేర్చి రిత్తవడి యాతనివంక జూడసాగెను. రెండవవాడు తన మిత్రునిజూచి,

"యీాడు సెవిటోడ్నాగున్నాడా?" అనెను.

మొద—నేకపోతె దొంగేసం యేత్తుండాడేమో?

రెం—ముసలోడా! నీకినపడదా?

ఈప్రశ్నకా భిక్షుకుడు తిరిగి శిరమును కంపించి తన యుంగీనుండి యొక చిన్నపలకయు నొకబలపమును దీసి వానికిచ్చెను.

రెం—సరే! తెల్సిందిలే. ఒరే! యీాడి కినపడదురా.

మొ—యినపడకపోతే కళ్ళులేవా? మన్నిగుర్తించాడంటే తిరిగి సెప్పలేడా?

అం—యీాడితో కొంత మాటాడి సూద్దాం. ఏం సెప్తాడో.

అని యాపలకపై నిట్లు వ్రాసెను.

"నీవిప్పుడు కూకుం డింటికాడ నాకరువా?

భిక్షుకుడు కాదని సూచించుచు తల కంపించెను. తిరిగి యాతడిట్లు "అక్కడుండు మనుసులనుగూర్చి తెల్చునా?" పూర్వమువలెనే తెలియదని యావృద్ధుడు శిరఃకంపము గావించెను.

"నీ దీ వూరేనా?"

"కాదు"

"యీవూరు బాగా యెరుగుదువా?"

"ఎరగను."

"స్వైనాజీ గోర్నెరుగుదువా?"

"ఎరుగుదును."

"మంచోడేనా?"

"తెలియదు."

వీరిద్దరు నిట్లు సంభాషించుచుండ నాతని యనుచరు డిట్టి వృథాప్రలాపములవలన ప్రయోజనము లేదనియు కా లయాపనమగుచున్నదనియు చెప్పి తన స్నేహితుని దోడ్కొని సమీపమునన్న యొక కల్లుపాకవద్ద కీడ్చికొని పోయెను. వృద్ధభిక్షుకుడును తనలో నేదియో గొణుగుకొనుచు నేమి యు నెరుగనివానివలె వారివెనుకనే పోయి యాకల్లుపాక కావలిభాగమున వీరిని గాచుచు కూరుచుండెను.



## 19

### పెనుభూతము! జాగ్రత!!

అరమణీయమందిరశయనాగారమం దిరువురు వ్యక్తు లాసీనులై తమలో దామేదియో చర్చించుచుండిరి. అందొక డు మన లలితను న్యాయవాది వేషమునవచ్చి మోసగించిన కిరమ్చందు. రెండవవాడు మన కథాచక్రమునకు సాక్షా త్కరించిన విష్ణుమూర్తి, యాస్వైనాజీ పాలకుడు. వా రిరు

వురు నిప్పుడు స్వైనాజీగృహమందలి శయనాగారమునందు సుఖాసీనులై కూర్చుండియుండిరి. వారిద్దరికిని నడుమ నొక మేజాబల్లయుండెను. దానిపై నప్పుడే తెచ్చిన తెల్లగుర్రముమార్కు విస్కీబుడ్లు రెండు పదిలపరుపబడి యుండెను. వారు మధ్య నొక హుక్కాగొట్టమును బెట్టి తమ కీజన్మమునందు వేఱుసౌఖ్యము లేదనునట్లు పొగద్రాగుచు పరవశమును జెందుచుండిరి. వారు వింత తెరగుల విడుచు ధూము మూగదియందు చుట్టలుజుట్టికొని యాకసమున కెగయుచుండెను. మనము ప్రారంభించుసమయమునకు స్వైనాజీ మాట్లాడుచుండెను. "కరమ్ చంద్! మన మీవ్యూహము నత్యద్భుతముగ కొనసాగింపగలిగితిమోయి. ప్రారంభమున మనము వేసికొనిన అంచనా ఫలించకపోయినను పరియవసానము మన మనుకొనినదానికంటె వేయిరెట్లనుకూలముగ పరిణమిల్లెను."

కరమ్—మిత్రమా! మనకు సానుకూలముగ మన ప్రయత్నములు ఫలించెనని సంతసించుచుంటివి. కాని నేటితోడ మనకష్టము లభివృద్ధిజెందుట కూడ ప్రారంభించెనని గుర్తింపకుంటివి.

స్వై—నీ వెప్పుడును కష్టములును, ఆపదలను గూర్చియే ప్రసంగించుచుందువు. అట్టిమాటలయందు నాకెంత మాత్రమును నమ్మకము లేదు.

కర—నీతలంపులన్నియు నిట్లనే యుండును. శారద

యకస్మాత్తుగ నీకెదురుదిరిగి ప్రత్యక్షమయ్యెనా నీపాట్లప్పు డు కనబడును.

స్వా—అదియా నీభయము? ఆమె యీపాటికే చచ్చి యుండును. చనిపోవకున్న నేడో రేపో ఆమెను చంపుటకై నాయనుచరులను పంపియే యుంటిని.

కర—ఆమె తప్పించుకపోయిన—

స్వా—ఈ స్వానాజీ బొందియందు ప్రాణముండునం తదనుక నట్టియవాంతరములను జరుగనీయడని నమ్ముము. లక్ష్మాజీని నేడో రేపో యురిదీయుదురు.

కర—అతనిని రక్షించుటకు ప్రయత్నములు జరు గుచుండెనేమో?

స్వా—జరిగినప్రయత్నము లింతకు పూర్వమే జరి గెను. అతనిని రక్షింప నీమూడులోకములందు నెవ్వరును గాన్పింపరు. కాని వీరడు తప్పించుకపోవుటయు, నాతడు శా రద జీవించుట చూచితినని చెప్పుటయు, నాదినమున స్త్రీవే షమున మనలనుమోసగించి లలితను సంరక్షించుటయు, నా దినముననే నానిజనామమున జయసేనా యని సంబోధించు టయు జూడ నావీరడొక్కడే తగు సాక్ష్యమును గొనివచ్చి రక్షింపవలయును. కాని యతనికి సాక్ష్యమిచ్చువా రెవరు? అతడుగాకున్న నెచ్చటనుండియైన పూర్వగాథలయందు జెప్పి నట్లొక పెనుభూత మకస్మాత్తుగ వచ్చి రక్షింపవలెను.

అని స్వేనాజీ పల్కుచుండ లోనుండి "అవును. ఆ పెనుభూతమే యాతని రక్షించి నిన్ను మట్టుబెట్టను." అని యొక కేక వినబడెను. ఆశ్చర్యము! ఈ కేక యెచ్చటిదో గదా! ఆసనములపై గూర్చుండిన వ్యక్తులిరువురు నొక్కగంతున లేచి నిలువబడి ఒకరిముఖమొకరు జూచికొనుచు నిలువబడిరి.

కర — ఈ కేక యెక్కడనుండి?

స్వే — మనసంభాషణల నెవ్వరో వినుచున్నట్లు నాకనుమానము గల్గుచున్నది.

కర — ఎవ్వరోగదా!

స్వేనాజీ కిటికీవద్దకేగి తొంగిచూచెను. తలుపోరగా తెరచియుండెను. అదిగని కరమ్ చందు నంసుండ నియమించి యావరణము వెదకుటకు బయలుదేరెను. కాని యావచ్చినవాడీవరకే పలాయనమైయుండుటచే నట్టియన్వేషణ వ్యర్థమని యాతని మిత్రుడు నుడువుటచే తన ప్రయత్నమును మానెను. కాని యాపురుషు డెవ్వరో కనుగొనవలయునుగదా! "వీరడా!" యని వారి కనుమానముగల్గెను. అట్టి సాహసకార్యములను జేయువాడు వీరడు గాక మరియెవ్వడైయుండును! అను శంక వారిని పీడింపసాగెను.

వా రిట్లు వారిలో వారు సంభాషించుచుండ సేవకు డొకడువచ్చి ఎవ్వరో యిద్దఱు యువకులు ద్వారముకడ వే

చియున్నారని వర్తమానమును దెచ్చెను. వారిరువురు నొకరి నొకరు జూచికొనినపిమ్మట—

కర—ఎవ్వరై యుండును?

స్వే—ఊహింపజాలవా?

కర—వారిని లోనికి ప్రవేశపెట్టకవా ?

స్వే—అవును.

అని చెప్పుచు పరిచారికను బిలచి వారిని లోనప్రవేశపెట్టుమని యానతీయ నామె వల్లెయని యొక్కక్షణములోపున మనభిక్షుకునితో సంభాషించిన యువకు లిరువురను ప్రవేశపెట్టెను. వారిని జూచినతోడనే స్వేనాజీ ముఖము వికసింప,

"నేననుకొనినట్లే వచ్చితిరి. మీరేయని సరిగ యూహింపగల్గితిని."

యువకులు—అవును. యింకేటో సంగతులు మాటాడుదా మని వొచ్చాం.

స్వే—ఏమి సంగతులు?

యువ—ఆపిల్లని సూశాం.

స్వే—సరే! మీ రాప్రదేశములలోనే కాపుండి సమయమును గాచియుందుము.

యువ—అది సరేగాని, మీరాపని మేమనుకొన్నంత తేలిగ్గా లేదు. కూంత కట్టంవుంది మాపెరిబో !

స్యే—కష్టమా! సరే తెలిసింది. మీకష్టమునకు-
అర్ధము యింకా డబ్బుకావలెనా?

యు—అంతేనండి బాబూ!

స్యే—నేను మీకు మొట్టమొదటే చెప్పినాను. నూ-
రురూపాయిల బహుమానం. బాగా కల్లుపోయిస్తా! గొర్రెపో-
తునిస్తా. ఇంకేమికావలె? అపిల్లనుతీసుకువచ్చి నాకు వొప్ప-
గించాలి. సరే! యింకాకావాలి అని అంటూ వున్నారుగనుక
యింకొకయాభైరూపాయిలు యిస్తా సరా!

యు—శిత్తం బాబూ! మీరు సెప్పిన పెకారం మీబం-
డికాడి కాపిల్లనెత్తుకొని వత్తాం. మీకొప్పగిత్తాం. తరవాత
మీయిట్టం మీది మాయిట్టం మాది.

స్యే—సరే!

యు—మేము యెల్తాం.

అని చెప్పి సెలవుగైకొనిపోవుచుండ తిరిగి యకస్మా-
త్తుగ "పెనుభూతము! జాగ్రత!!" యని యొక కేకవినవచ్చెను.
ఆ తెరువరులిరువురు నులికిపడి పరుగుపరుగున స్యేనాజీకడ-
కేతెంచి జరిగిన చిత్రమును జెప్పి నివ్వెరగంది నిలచిపోయిరి.
కాని స్యేనాజీ వారి భీతికి నవ్వి తన రామచిలుక కావాక్య-
ము చిన్ననాటనుండియు నేర్పితిననియు, అవచ్చిన కేక రామ-
చిలుకముఖమునవచ్చి యున్నదనియు భీతిజెందవలదనియు
నోదార్చి వారిని బంపివేసెను. కాని యీపర్యాయము మాటడు

న్వయముగ వారిని వెంటబెట్టికొని సాగనంపి వారు దృష్టి మేరదూరము దాటునంతవరకును జూచి లోనికివచ్చెను. క రమ్‌చందు తనస్నేహితునికొరకై వేచియుండెను. స్యేనాజీ నివ్వెరగందిచూచుచు "మిత్రమా! కడువింతగనున్నది. మనల నెవ్వడో కనిపెట్టియున్నట్లు నాకనుమానము ధృఢమగుచున్న ది. తత్క్షణము వానిని బట్టి తగువిధమున నుపశాంతిచేయవ లయును. లేదా, మోసము వాటిల్లగలదు."

## 20

### అనుమానపిశాచము.

ఆయువకులు సారాదుకాణమునుండి వెల్వడునప్పటి కొక గంటకాలము పట్టెను. వృద్ధభిక్షుకుడు అప్రమేయుడై వారికొరకై వేచియుండి వారు స్యేనాజీగృహమార్గమును బట్టి పోవుట గుర్తెరిగి వారిని వెంబడించెను. అప్పటికప్పుడే ప్రొద్దుగ్రుంకెను. చీకటి నలుదెసల వ్యాపించెను. కొంచెముదూరముననున్న మనుష్యులను గుర్తించుట కష్టతరముగనుండెను. వారు స్యేనాజీగృహములోని కేగుచుండ నాతడు మెల్లగ నాదొడ్డి వాకిలికడకేగి దొడ్డిగుమ్మపుమెట్లపై గూరుచుండె ను. అట్లాతడు పదిహేనునిముషములు కూరుచుండుతరి పెర టితలుపు తెరువబడెను. లోనుండి యొకస్త్రీ వెలుపలకు వచ్చెను. ఆమెయే స్యేనాజీపరిచారిక. నాంచారి. ఆమెయే

మనయువకులిరువురను లోన ప్రవేశపెట్టినది. ఆమె కీద్వార గుమ్మముకడ నేమిపనియుండివచ్చెనో గదా!

తలుపుతెరచునరి కీవృద్ధభిక్షుకుడు కంటబడెను. అతని గాంచినతోడనే యామె తన వ్రేలిని పెదవిపై జేర్చి తన్నెవ్వరును వీక్షింపకుండిరని పదిలముగా నలుదెసల పరికించి యావృద్ధుని సంబోధించి "నేడే మనపనిని నెరవేర్చుకొనవలయును. చేతనయినంత త్వరితముగ నీగృహమును వీడిపొమ్ము. నిన్ను వంతెనవద్ద కలసుకొనెదను." అనిచెప్పి లోనికేగి తలుపుమూసివైచెను. ఆవృద్ధభిక్షుకుడును మెల్లగ లేచి తావచ్చినదారినే పోనుద్యమించి నడుచుచుండ నకస్మాత్తుగ మార్గమధ్యమందొకవ్యక్తి యాతని కడ్డునిలచి "ఎవరువా"రని ప్రశ్నించెను. వృద్ధుడు నిలచిపోయెను. కాని యేవిధమగు ప్రత్యుత్తరము నీయక తనహస్తమును పెదులకడ జేర్చి తలపంకించెను. అంతలో రెండవవ్యక్తి యచ్చోటనే ప్రత్యక్షమయ్యెను. "కరమ్‌చంద్! ఆహా! చూచితివా? యితడెవ్వరో!" యని మొదటివాడు రెండవయాతని సంబోధించి మనభిక్షుకునికై వ్రేలుచూపెను.

కర—నేనును యీవిషయమునుగూర్చియే యాలోచించుచుంటిని. ఇతడు మనుష్యుడా లేక యేదయిన పెద్ద భూతమా!"

స్వే—లోనికి గొంపోయి విచారింతము.

అని చెప్పుచు నావృద్ధుని లోపలకు రమ్మని సైగ జేయ నాతఁడును మారుమాటాడక వారిని వెన్నంటి లోనికి బోయెను. స్వైనాజీయును కరమ్‌చందును ఆవిచిత్రవిగ్రహము నొక్కనిముష మామూలాగ్రము పరికించిన పిదప స్వైనాజీ యిట్లనియె.

స్వై—ఎవరు నీవు? ఇక్కడ నేమిచేయుచుంటివి?

మునుపటివలెనే భిక్షుకుఁడు తనచెవులకై జూపి తలఁ పంకించెను.

స్వై—నీకేమి వచ్చినది, చెముడా?

భిక్షుకుఁడు పూర్వపద్ధతినే యవలంబించెను. కాని యీపర్యాయ మాతఁడు తనపలకను బలపమును వెలికిదీసెను. స్వైనాజీ తన ప్రశ్నలను దానిపై వ్రాయ నాభిక్షుకుఁడు తగు విధమున సమాధాన మీయ మొదలిడెను.

స్వై—నీవెవరు?

భి—నేనొక భిక్షుకుఁడను. పేదవాఁడను. ముసలివాఁడను. ఏమయిన మెతుకులు దొరకునో యని వచ్చితిని.

స్వై—నీవెక్కడ నివసింతువు?

భి—ప్రపంచమంతయు నానివాసమే. నాకు యిల్లు లేదు, వాకిలి లేదు.

ఇంతలో నాంచారి సావడిలోనికి వచ్చెను. స్వైనాజీ యామెను జూచి యిప్పుడు సమయముగాదని చెప్పుచు నాభి

షుకుని జూపి "యితని నెరుగుదువా?" యని ప్రశ్నించెను.

నాం—ఎరుగుదును.

స్వా—ఎవ రీతడు?

నాం—అత డెవ్వరో నాకు తెలియదు గాని "మిగిలి పోయిన అన్నమున్నదా" యని అప్పుడప్పుడు వచ్చుచుండును.

స్వా—అప్పుడప్పు డనగా చాలకాలమునాటినుంచి యని యర్థమగును గదా! నీవు నాగృహమందు సేవచేయుట కు కుదిరి యింకను పూర్తిగ రెండువారము లయినను కా లేదు గదా ?

నాం—వారమున కొకతూరి యని నాయర్థము. క్రిం దటి పర్యాయ మీదినముననే వచ్చియుండెను.

స్వా—నీవు రమ్మని చెప్పితివా ?

నాం—చెప్పియుంటిని. ఇంటిలో నెప్పుడయిన మిగిలి యున్నప్పుడు వచ్చినట్లయిన భోజనము పెట్టెదనని చెప్పి యుంటిని.

స్వా—అతని పే రడిగితివా ?

నాం—లేదు.

స్వా—ఇప్పు డడుగరాదా ?

నాం—ఆపలకమీాద వ్రాయుడు. అతడే ప్రత్యుత్తర మీాయగలడు.

"సరే నీవు పొమ్ము" అని యామెను బంపి యామెవ

లన నెట్టి వింతసంగతు లెనుంగజాలకపోవుటచే తనమిత్రునిజూ చి "మనచింటక యూమె గాదు. వేరెవ్వరో గదా!" యని చెప్పి తిరిగి మఃభిక్షుకునితో సంభాషణను ప్రారంభించెను.

స్వే—నీకొక రూపాయనిచ్చెదను. కావలెనా?" యని యడిగెను. అంతటితో నాభిక్షుకుడు తన బధిరత్వమును బా యునని స్వేనాజీయభిప్రాయము. కాని, యాతని యూహాలెం తమాత్రమును సరియైనవి కావు. ఆవృద్ధుడు గొలనుమాత్రము పంకించి వెర్రిచూపుల నాతనిపై బరపెను. స్వేనాజీహృదయ ము శంకారహితమయ్యెను. ఆకాలికిన యశరీరవాణి వేరొక నోటినుండి వచ్చెనని యు నీభిక్షుకుడు నిర్దోషియనియు నిశ్చ యించి యాతని బంపివేయజూచెను. కాని, యాతనిమిత్రుని కింక పూర్తిగ శంకలుపోలేదు. అతని కేదియో యొక యాలో చన దోచియుండవచ్చును. అతడు స్వేనాజీవంక జూచి "నీ వా యువతి నీవరకెన్నడైన నెరుగుదువా?" యని ప్రశ్నించెను.

"ఎరుగను. నాభార్య పుట్టినింటికి బోవునపుడు పరిచా రికనుగూడ దీసుకపోవుటచే నీమెను కుదుర్చుకొంటిని. ఈ ప్రశ్న యేలకలిగెను?"

కర—ఏమియులేదు. ఈగృహమందు మనము ను ఆయువతియు దప్ప వేరొకరు లేరుగదా!

స్వే—నాకు తెలిసినంతవరకును లేరు. కాని నీయు ద్దేశ్యము నాకర్థమగుట లేదు.

కర—నాకాయువతిని జూడ ననుమానము స్ఫురించు చున్నది.

స్యే—కారణము?

కర—ఆమెచూపులయం దేదియో యున్నది. చెప్ప జాలను. ఆమె ప్రతిప్రశ్నకు తగునట్లు సమాధానము తడు ముకొనకయే చెప్పుటజూడ కడుజాణవలె నున్నది.

స్యే—నేనెన్నడును యిట్టి సామాన్యవిషయములను గుర్తింపలేదు.

కర—ఏమో! యీభిక్షుకుడును ఆమెయు నేదియో నేత్రాభినయము చేసిరని నాయనుమానము. అదియును సరిగ మన మీభిక్షుకునితోడ మాట్లాడు సమయముననే పని యేమియునులేక నామె సావడిలోని కేల రావలయును?

స్యే—ఆమెయే నాకపకృతి యొనర్చియుంచిన ప్రాణ ములతో తప్పించుకొని ఎక్కడికి పోగలదు."

కర—మిత్రమా! త్వరపడకుము. ఆమెయం దనుమా నము కల్గినట్లు మన మామెకు తెలియనీయరాదు. అది యటుండనిమ్ము. నీకు భూతములందును దయ్యములందును నమ్మక మున్నదా?

స్యే—అంతగా లేదు.

కర—ఆయశరీరవాణి పల్కినప్పుడు మనము దేనిని గూర్చి ప్రసంగించుచుంటిమో జ్ఞాపక మున్నదా?

స్వే—జ్ఞాపక మున్నది.

కర—ఒక మనుష్యవాక్యము మనలను బెదరించెను. అది ఎవ్వరిదై యుండునో యూహించితివా ?

స్వే—లక్ష్మాజీ ! స్నేహితబృందములో నొకరిది.

అని స్వేనాజీ చెప్పుచుండ తిరిగి పూర్వస్వరము వారి పాదములకు సరిగా యడుగుభాగమునుండి "నిశ్చయము" అని పల్కి వారి భయసందర్భమందు త్రోచెను.

ఆముసలివా డేమియును చలింపక యట్లే నిలచియుండెను. వారావృద్ధుని కంఠమును చేతితో బట్టి "ఎవరు పలికిరో చెప్పెదవా? చచ్చెదవా?" యని బెదరించిరి. కాని యావృద్ధు డేమియును మారుపలుకలేదు. అతడు కాదని స్వేనాజీ నమ్మకము కాని కరంచందుమాత్రము భిక్షుకుడు లేకున్న నాపరిచారిక, నీ రిరువురలో నొక్కడుమాత్రము పల్కియుండవలయు నని నిశ్చయించుకొనెను. వారి కేమియును కర్తవ్యము తోచలేదు నిజము తెలియునంతవరకు నావృద్ధుని పట్టి బాధించి యుంచవలయు నని కరంచందు తన యభిప్రాయము ను వెల్లడించెను. వా రిద్దరు నేకగ్రీవముగ నందుల కొడంబడి యాతనివద్ద నేవిషమైన కాగితము లుండెనో యని శంకించి, లోనికి గొంపోయి యొకగదియందుంచి శోధింప నారంభించిరి. కాని వారు తమపనిని పూర్తిగ ముగింపకపూర్వమే యత్యాతురమున తలుపును తట్టుచు నెవ్వరో పిలువసాగిరి. అంత

త్వరితముగా చేయవలసిన పని యేమి సంభవించెనని వారా వృద్ధు నాగదియందుంచి వెలుపల బీగమువైచి యాంపిలచిన వా రెవ్వరాయని చూడబోయిరి. తలుపును కొంచెము తెర చెనో లేదో ముగ్గురు తాగుబోతులు స్యేనాజీ నావలకు దోసివైచి లోన బ్రవేశించిరి.



## 21

### ఆమె శారదయా !

లలిత ఆముసలివారితో సంభాషించిన సమయముననే కారాగృహమందు లక్ష్మాజీ లలితనుగూర్చి తలపోయుచుండె ను ఆతని ప్లీడరుగా రతనితో సంభాషించి మోదాప్పటకు వచ్చియుండిరి. తిరిగి విచారణ కనజ్ఞ సెయ లేదనియు, శిక్షను తగ్గింపుడని వేడిన ప్రార్థనల నిరాకరించిరనియు, తప్పక మర ణదండన ననుభవించి తీరవలయునవనియు కన్నులనీరు వెట్టుకొని "మిత్రమా! సాక్ష్యము లేక నీవన్యాయముగ మృతినొందవలసి వచ్చెను. నీపై నేరము మోపుగా ఋజువు చేయబడుటచే నీవు నిరపరాధివని న్యాయమూర్తు లెరింగి నీయందు జాలిజెం దియుండినప్పటికిని, శాసనములకు గట్టుబడి నీకీశిక్ష విధింపవ లసివచ్చెను. విధి నెవ్వరుతప్పింపగలరు? నీవిషయమున నింకే మిచేసినను లాభము లేదు. నీకు మరణమే ధ్రువము."

లక్ష్మ్మి—నేను మరణించుటకు సిద్ధముగనే యున్నా డను. నాకు మరణమన్న నిసుమంతయు భయము లేదు. నేనొ క్కరుడనే యీవిపరీతశిక్షకు బాల్పడిన నే నంత దుఃఖించు వాడనుకాను గాని నాబొందితోడ వేరొకశరీరము కృశించి పరలోకముజేరునని మిక్కిలి చింతించుచున్నాడను. ఆహా! యీతీర్పు రెండువైపులను వాడిగలకత్తివలె రెండు ప్రాణ ములను దీయుచున్నదే! ఏమిచేయగలను?

స్త్రీ—కాలమే నీదీనత్వము నాలించి యదృష్టదేవత తోడ మొరపెట్టుకొనునేమో?

ల—అయ్యో! యింకెక్కడియదృష్టదేవత! నాపాలి ట యదృష్టదేవత యీవరకే పరిసరించెను. కొన్నిగంటలకా లములో నాయీతనువును బాసి నిరంతరసౌఖ్యము నందగ ల్గుదును. కాని నాప్రేయసి—నానామమే సర్వకాల ము చ్చరించుచు, నాయాకృతినే మనమునందు నిల్పి నిరంతర ధ్యానమొనరించు నాలలిత—నాప్రేమపుదీప్తి—యిల్లెంత కాల మన్ననీరము లకు దూరమై నిద్రయనున దెట్టిదియో మ రచి కృశించి, యీపుడమిని వంతల జెంది మనవలయునో గదా!

ఈవచనములు పల్కునపుడు ధీరుడయ్యు, లక్ష్మ్మజీ యొకబాలునివలె రోదనము చేయసాగెను. అతని జూచుచు నిలచినవారందరును స్తంభీభూతులై యొ దార్చుటకైన శ

లేక నిలచిపోయిరి. అతడా కొంతతడవునకు తెప్పరిల్లి,

“నిజ మెన్నటికైన ప్రపంచమునకు వెల్లడియగునని తెలిసియుండిన నే నీయసువులను నిశ్చింతగ బాసియుండెడివాడను, కాని యకారణముగ నిట్లు నిందలపాలై లక్ష్మోజీ స్త్రీహత్యకై శిక్షింపబడెనను యపవాదు నొకదానిని వెంటగట్టుకొని పోవలసివచ్చెనుగదా యని విచారించుచుంటిని.”

ప్రీ — నీకు నావలన గల్గెడి సహాయముచేయుటకు సిద్ధముగనున్నాడను. కాని నిన్ని శిక్షనుండి విముక్తిచేయుటకు నాకేమియు మార్గము దోపకున్నది,

లక్ష్మో— మీరేమియు నావిడుదలకై ప్రయత్నములు చేయనవసరములేదు. నేనాడుదానను కాను. నామరణమును ధీరత్వముతోడ నెదుర్కొనగల్గిన పురుషుడనయ్యునే నధైర్యము జెందుదునా? మహాశయా! యీదుఃఖమంతయు నాతనువుకొరకని యూహించుచుంటిరా? కాదు. ఇతరులకొరకు— పరమేశ్వరుడఁ దరిమోడలను కనికర ముంచి వారిని రక్షించుచుండుగాత!

అయ్యా! యిప్పుడు చేయవలసినకర్తవ్యము. నే నిప్పుడొక విల్లును వ్రాయవలసి యున్నది. దానిని మీరు గొంపోయి ఆమలులో పెట్టించుడని నా కడపటిప్రార్థన. నాయాస్తి సర్వస్వమును నాప్రేయసియగు లలితకు ధారపోయుచుంటిని. ఇందేమయిన నాక్షేపణ మున్నదా?

స్త్రీ   నీపిత్రార్జిత మేమైన నున్నదా?

ల—నేనుండుగృహముమాత్రము స్థిరాస్తి. తక్కిన చరాస్తి పిత్రార్జితమైన నేమి, స్వార్జితమైన నేమి?

స్త్రీ—సరే వ్రాయుము.

లక్ష్మాజీ యొకకలమును కాగితమును చేబూని తన మనోభిప్రాయము నందు వెల్లడించెను. స్త్రీ కరుగా రదిగైకొని లలితనుగూడ తీసుకవచ్చి తగుపెద్దమనుష్యులను దోడ్కొనివచ్చి సంతకములు చేయించెదనని వెడలిపోయెను.

స్త్రీకరుగా రేగినతోడనే చెరసాలకాపరి వచ్చి "అయ్యా! ఎవ్వరో యొకముసలివాడు మీదర్శన మపేక్షించి ద్వారము కడ వేచియున్నా" డని చెప్పి యాతని యాజ్ఞకై నిరీక్షించుచు నిలచె. వీరకు మారువేసముల నెన్నిటినో దాల్చి తిరుగుచుండుటచేతను, అది తన కవసానకాలమగుటచేతను, ఎద్దియైన వార్తను దెచ్చియుండెనేమో యని యూహించి సత్వరము ప్రవేశపెట్టుమని యనుమతినిచ్చెను. క్షణములో నావేచియున్నవృద్ధుడు లక్ష్మాజీయెదుట నిలచెను. వారిద్దరి కీక్రింది విధమున సంభాషణ జరిగెను.

ల—మీ రెవ్వరో అనుగవచ్చునా?

వృ—నేనెవ్వరినో తెలియుటకుపూర్వము నేను వచ్చినపని తెలుసుకొనిన సమంజసము.

ల—మీ రెవ్వరో ముందెరుగగోరెదను. మీ పేరు?

వృ—నాపేరు రామోజీ. దానివలన గల్గు ప్రయో
జన మేమి?

లక్ష్మి—నేనెన్నడు నట్టిపేరు వినియుండలేదు.

వృ—అందువలననే నన్నెరుంగుటనవసరమని ప్రా
రంభముననే చెప్పియుంటిని.

లక్ష్మి—సరే! నీవు వచ్చినపనియేమి?

వృ—నీ వీచెరనుండి తప్పించుకొనిపోవ నుపాయ
మొకదానిని చెప్పవచ్చితిని. నీయిచ్ఛవచ్చినచో నెరవేర్ప
వచ్చును.

లక్ష్మి—నాకు వింతగుచున్నది. అదెట్లు?

వృ—నీ కిష్టమేనా?

లక్ష్మి—కార్యసాధనము చెప్పినమీదట నాయిష్టా
యిష్టములను జెప్ప నలవియగును. అంతకుపూర్వమే యెట్లు
చెప్పనగును.

వృ—నీప్రాణమును, స్వేచ్ఛను నీకిప్పించెదను.

లక్ష్మి—అందులకు షరతులు: నేను నేడు తప్పిం
చుకపోయిన రేపటినుండి స్త్రీహత్యామహాపాతక మొక్కటి
యేగాక రాజద్రోహమహాపాతకముగూడ వెంటనంటును గదా!

వృ—అట్లెన్నటికిని జరుగనేరదు. నీవు స్వేచ్ఛగ
చరించుచుండ నిన్నుజూచి "యీతడే స్త్రీహత్యనొనర్చె"నని
యొక్కడైన ముక్కుపై వ్రేలిడజాలడు.

లక్ష్మి—నీవాక్యము లతిచిత్రముగ నున్నవే!

వృ—అయియుండవచ్చును.

లక్ష్మి—ఎట్లు తప్పింప గల్గుదువు?

వృ—నీవు నిర్దోషివని ఋజువుచేసి.

లక్ష్మి—నేను నిర్దోషినని నీ వెరుంగుదువా?

వృ—ఎరుగుదును.

లక్ష్మి—నీవు ఋజువుచేయగలవా?

వృ—చేయగలను.

లక్ష్మి—అట్లయిన నీవింతదనుక నేల యుపేక్షించితివి. నాకీ శిక్ష విధింపకపూర్వమే లక్ష్మీ నిర్దోషియని ప్రపంచమున కేల చాటిచెప్పవైతివి? ఆహా! నీవును ఒకమానసివా? అట్లయిన నీయందు మానసికభావము లేకారణమున ప్రవహింపకుండెను! ఒకనిరపరాధి యిట్లన్యాయముగ హింసింపబడుటను జూచి నీవు సహింపగలవా?

వృ—సహింపగలను.

ల—అట్లైన నీవు మానసివి గావు. నీవొక్క పిశాచివి. నాయెదుటనుండి పొమ్ము ఆవలకు బొమ్ము. నీముఖమును చూడనొల్లను.

వృ—నీకు స్వేచ్ఛయం దభిలాష లేదా?

ల—నీవు నన్నీ యపవాదునుండి విముక్తిచేయగల్గి యుండియు నేల చేయక చూచుచుంటివి?

వృ—స్వలాభాపేక్షచే.

ల—నాకర్థము కాలేదు.

వృ—నాకు కొంతద్రవ్యము కావలయును.

ల—నాకీశిక్ష విధింపకపూర్వమే యేలయడుగకుంటివి?

వృ—స్వలాభము లకనువగుకాలము గాకపోవుటచే.

ల—అట్లయిన ద్రవ్యమిచ్చిన నాప్రాణమానములను గాపాడెదవా?

వృ—అవును.

ల—విత్త మశాశ్వతము. ప్రాణమును అశాశ్వతమే యయినను విత్తమునకంటె ఎక్కుడుగదా!

వృ—నాయభిప్రాయ మదియే; అందువలననే ననిచ్చటికి వచ్చితిని.

ల—నీకెంత ద్రవ్యము కావలయును?

వృ—నీయాస్తి సర్వస్వము కావలయును.

ల—అంతయునా! నీ కీద్రవ్య మెప్పుడీయవలయును. విడుదల చేసినపిదపనా?

వృ—కాదు. పూర్వమే.

ల—ఇంకేమయిన షరతులున్నవా?

వృ—నీవొకకాగితమును వ్రాసి యీయవలయును. నీవు విడుదలయయిన పిదప నీశిక్షకు కారణభూతులైనవా-

రెవ్వరికైనను నీవేవిధమగు చర్యను తీసుకొనవని.

ల—నీభావములను నేను గుర్తింపగజాలకున్నాడను.

వృ—అర్థమగుట కేమున్నది. నీజీవిత మింక కొన్ని గంటలలో పరిసమాప్తము నొందగలదు. నీ కీరెండుమార్గము లకు మించి వేరుమార్గము లేదు. నాపరతుల కొప్పుకొందు వా జీవింతువు. లేవా ఉరికొయకు పాల్పడుదువు.

ల—నేనాపరతుల కొప్పుకొనకున్న నేమగును?

వృ—నీవు చావవలసినదే.

ల—అట్లయిన నీపరతులను నిరాకరించెదను.

ఈవాదన జరుగుసమయమునందు లక్ష్మాజీ యావృద్ధుని నతిజాగ్రతగ పరిశీలించుచుండెను. ఈకడపటి ప్రత్యుత్తర మాతని నోటినుండి వెల్వడునప్పటి కాతని మనోభావములు విస్ఫుచ్ఛక్తివలె పర్వులెత్తి యాతనివదన తేజమును వికావికగావించెను. కండ్లు పైకుబికి భీకరరూపమును దాల్చెను. ఇట్లొకమైదునిముషము లావృద్ధుని తదేకదృష్టితో దిలకించి "నీవెవ్వ"రని తిరిగి ప్రశ్నించెను.

వృ—నీకింతకు పూర్వ మొకసారి చెప్పియుంటినిగదా!

ల—అసత్యము పల్కితివి. నీవు ప్రచ్ఛన్న వేషమును ధరించియుంటివి. నిన్ను గుర్తింపజాలననుకొంటివా? నీవెవ్వరో నే నెరుంగుదును.

వృ—నే నెవరు? చెప్పుము.



# 22

## పాపము!

"పాప మామ్ముసలివా డీరాత్రి యెచ్చట తలదాచుకొనునోగదా! అన్యాయముగ పంపివేసితిని" అని యాభిక్షుకుడు పోయినపిదప లలిత పశ్చాత్తాపపడజొచ్చెను. ఆసమయమునకే యామెతల్లియు పావడిలోనికివచ్చి తనకుమార్తెవచనము నాలకించి "అమ్మాయీ! నీవింతకుపూర్వ మనుభవించిన కష్టములు చాలవా? క్రొత్తవారిని నిజానిజము లెరుగకయే విశ్వసించుట యెట్లు?

ల—అమ్మా! ఆభిక్షుకుడు మంచివాడువలెనే యున్నాడే.

తల్లి—అమ్మాయీ! నే నొరులను విశ్వసింపకుండుటకు కారణము లున్నవి. లక్ష్మీజీప్రాణ మెంతవిలువదో నీప్రాణమును ప్రస్తుతహంతకుల కంత యెక్కుడువిలువగ నున్నదట. నీప్రాణముల దీసిననేకాని వారియుద్యమము పరిసమాప్తము కాదని మీతండ్రి నాకు మొన్నటిరాత్రి చెప్పెను.

లక్ష్మీజీ యనుశబ్దము నామె వినులబడకుండ జననీజనకులు విశ్వప్రయత్నములు చేయుటచే నామె కామాట వినులపోక చాలకాలమయ్యెను. కాని నేడు తిరిగి తనతల్లి లక్ష్మీజీని గూర్చి ప్రస్తావించుటచేత తన పూర్వాయుదంతముల నన్నిటిని జ్ఞప్తికిదెచ్చికొని " అమ్మా! ఆత డింకను

జీవించియుండెనా?" యని ప్రశ్నించెను.

తల్లి—ఇంకను బ్రతికియేయుండెను.

ల—శిక్ష నెప్పుడు విధింతురు?

తల్లి—ఎప్పుడో తెలియదు—కాని యాతని స్నేహితు లాతని విడుదలకై విశ్వప్రయత్నములు చేయుచున్నారు. ఫలించిన, యాతనికి మరణదండన తప్పిపోవును.

ల—అమ్మా! నీకు వీరసింహుని వృత్తాంత మేమయిన తెలిసెనా?

తల్లి—అతడు మరణించెనట.

ల—మరణించెనా!

తల్లి—అని వాదుక, కాని మీతండ్రి యామాటల నెంతమాత్రము విశ్వసింపలేదు.

ల—నాకెంతమాత్రము నమ్మకములేదు.

తల్లి—ఎందువలన?

ల—అతనిని వారు చంపియుండిరని నానమ్మకము. స్వైనాజీకి వీరడన్న సింహస్వప్నము. అతని మరణమును గూర్చి యేమని చెప్పుకొనుచుండిరి?

తల్లి—రక్షకభటు లాతని బట్టుటకు వెంబడింప నొకనదియందుబడి మరణించెనని.

ల—మరణకారణమును గాని చనిపోయినపిదప నాతనిశవమునుగూర్చిగాని విచారణచేసిరా?

తల్లి—చేసినట్లు లేదు. అతడొక సామాన్యుడగుట చేతను తాగుబోతగుటచేతను తదుపరి చెంతనుండి పారిపోయినవాడగుటచేతను యెవ్వరు నాతనికై మిక్కిలి పరిగణింప లేదు. గోదావరిపై యొకడింగినెక్కి పారిపోవుచుండ పోలీసు లాతని వెంబడించిరనియు, మధ్య వేరొకపడవకు కొట్టుకొని డింగీ పగిలిపోయెననియు, పిదప ప్రవాహమునబడి మునిగిపోయెననియు చెప్పిరి.

ల—ఆతరుమువారు నిజమైన పోలీసు వారేనా?

తల్లి—నాకు తెలియదు. తరువాత నతని మరణవృత్తాంతమునుగూర్చి ప్రసంశయే లేదు.

ల—ఇదియంతయు వట్టిపన్నాగము. వా రాతని బలాత్కారముగ పట్టిచంపిరి. ఇక లక్ష్మాజీ విడుదలయగు ననుమాట వట్టికల్ల.

తల్లి—అప్పటితో నీవు నిస్పృహ జెందనవసరము లేదు. నీతండ్రి నేడు చెన్నపట్నం పోయియుండెను. పెద్దపెద్ద ప్లీడర్లను విచారించివచ్చెదనని చెప్పెను.

ల—నేను లక్ష్మాజీని చూడవలయును.

తల్లి—చూడవచ్చును.

ల—తక్షణము చూచితీరవలయును.

అని చెప్పుచు దిగ్గనలేచి లోనికేగెను. ఆమెవదనమునందొక నిశ్చలభావము తాండవమాడుచుండెను.

సాయంత్రమగుసరి కామెకు తిరిగి జ్వరమువచ్చెను. క్రమముగ నది తగ్గి రాత్రియగునరికి కొంచెము నిద్దుర వట్టెను పాపము!

## 23

### ముసలోఁడ్రా.

అదియొక చీకటిరాత్రి. అక్కడక్కడ నక్షత్రములు మినుక్కు మినుక్కుమనుచు నాయంధకారము నొక్కింత నుపశమింప జేయుచుండినను, చిన్నచిన్నమబ్బు లచ్చటచ్చట వ్యాపించుచు నానక్షత్రములను మరగుపరచుచుండెను. రాత్రి రెండుగంటలు కావచ్చెను. క్రమముగ నాచిన్నమబ్బు లన్నియు గుమికూడి యాకసమంతయు దట్టముగ నావరించుచుండెను. అట్టిదే వర్షపాతమునకు ప్రథమసూచన. ఆనిశీథమం దిరువురు దుర్వినీతులు లలితగృహమార్గమును బట్టి పోవుచుండిరి. అందొక డాకసమువంక జూచి "సత్తిగా! వానొచ్చేటట్టుందిరా" యని మెల్లగ తన యనుచరునకు తన యభిప్రాయమును వెల్లడించెను. అందులకు రెండవవాడు "ఒరే లచ్చిగా! యీవాన గాలి, దుమారం, చీకటి, యియ్యన్నీవత్తేనే మనపని నవరగా సాగుతుంది."

"అవునురా! నువ్వుసెప్పింది సత్తెం. అందుకనే నీపేరు సత్తిగా దన్నారు."

లలిత తనశయ్యపై నిశ్చలముగ నిద్రించుచుండెను. రక్తహీనముచే పాలిపోయిన యామె ముఖకాంతు లామె శయనించిన తెల్లని తల్పములతో నెకసక్క మాడుచున్న ట్లుండెను. ఒకహస్తము శిరముక్రిందను, వేరొకచేతిని ప్రక్కనున్న బాలీసుపైనను జేరవైచి తన వేణీభరము వీడి యాపాన్పుపై చిమ్మిరేగ, సౌఖ్యముగ నిదురించుచుండెను. బల్లపై నొకదీపము మిణుక్కు మిణుక్కుమని వెల్గుచుండెను. అకస్మాత్తుగ కిటికీవద్ద కిరకిరమని శబ్దమయ్యెను. ఆమె కొంచెము కదలెను. ఆశబ్దము నిలచెను. ఇట్లొక్క పావుగంట గతించెను. తిరిగి కిరకిరయను శబ్దము వినవచ్చెను. తిరిగి యామె కదలెను. శబ్దమాగిపోయెను. ఈపర్యాయ మొక్క యరగంటకాలము నిశ్శబ్దముగ నుండెను. తిరిగి యాధ్వని వినవయ్యెను. ఈపర్యాయ మామె కదలలేదు. ఒకశిర మాకిటికీనుండి లోనికి తొంగి చూచెను. క్రమముగ నాశిరము లోనికి సాగుచుండెను. ఆనయనము లతినిపుణతతో నాగది నలువైపులను పరిశీలించుచుండెను. క్రమముగ నొకపురుషవిగ్రహ మాగవాక్షమునుండి లోనికిపడెను. అతని నయనములు తదేకదీక్షతో నాశయనించియున్న యువతిపై బ్రసరించుచుండెను.

అదియొక ప్రకృతి వైచిత్ర్యము. పరు లెవ్వరయిన లోన ప్రవేశించినపు డొకయదృశ్యశక్తి యాతని రాకను ప్రచురణచేయును గాబోలు. లలిత విసుగుకొనునట్లు కండ్లునులుము

తాను మఱలేచి గది కిరువైపులను పరిశీలించి చూడసాగెను. అం
తయు నిశ్శబ్దముగ నుండెను. వస్తుసముదాయము లన్నియు
తమతమ స్థలములయందే యథావిధిగ నుండెను. ఆమెకండ్లు
తమంతట మూతలువడెను. పాపము! ఆమె తనదృష్టుల
నా గవాక్షముపై బరపియుండిన నేమయ్యెడిదో కదా! ఆమెకు
మూల నొదిగి నిలచియున్న యొకపురుషవిగ్రహము కన్నుల
బడియుండదా! ఆమె తనతల్లినో తండ్రినో ఎలుగెత్తి కేకలు
వైచి యాచోరునిబట్టి యుండకపోయెడిదా? కాని యాపాడు
నిద్ర యామె కన్నులను మూసివైచెను. తిరిగి యథాప్రకా
రము నిదురింపసాగెను. సత్తిగాడు—లోనప్రవేశించినది మన
సత్తిగాడే యని మన చదువరులకు పూర్వము చెప్పకుండి
నందులకు క్షమింతురు గాక—మెల్లగ తానిలచిన ప్రదేశము
నుండి బయలుదేరి మంచమును సమీపించి చూచుసరి కామె
నిద్రావస్థయందు మై మరచియుండెను. ఒకచోరు డామె
శయ్యను సమీపించుట నిసుమంతయు నెఱుగదు. ఆ తెరువరి
యు వేవేగము తన యంగీనుండి యొకచిన్న సీసాను వెలికి
దీసి, దాని మూతనుదీసి యాశయనించియున్న యువతి నాశి
కాగ్రమున జూపెను. అందేమి యోషధి యుండెనో గదా!
ఉపాయము నెంతమాత్రమును గ్రహింపనేరక లలిత యావా
యువును లోనికిబీల్చెను. క్రమముగ నామె యుచ్ఛ్వాసనిశ్వా
సములు విపరీతవైఖరి దాల్చెను. సత్తిగాడు తన సీసాను జేబు

నం దిమిడ్చి, పిల్లియడుగులతో గవాక్షమును జేరి, వెలికి తొంగిచూచి, లచ్చిగా, బద్రిం, వస్తుండా అనిచెప్పి మంచము వద్దకు వచ్చి నిదురించు యాయువతిని తన కరద్వయమున నిరికించికొని పైకి లేవనెత్తి భుజములపై మోసికొని పోవ మొదలిడెను.

అతని యుద్దేశ్య మెద్దియో మనపాఠకులు గ్రహించి యుందురు. వా రిరువురను స్వేనాజీ పనుపున వచ్చిన చోరులని వేరుగ చెప్పనవసరము లేదు. ద్రవ్యమునకు గడ్డికరచి యిట్లొంటిగ నిర్భయముగ నిదురించు మన లలితను, నీచుడును, దుష్టకర్ముడును, నిర్దయాత్ముడును, అగు స్వేనాజీహంతకుని కర్పణము జేయ తస్కరించుక పోవుచుండిరి. ఆమెకు వాసన చూపిన దొక మత్తుపదార్థమగుటచే నామె కీబాహ్యప్రపంచవృత్తాంతము లెవ్వియు జ్ఞాననేత్రమునకు గోచరింపకుండెను. సత్తిగాడు లలితను గవాక్షముదరికి గొంపోవునప్పటి కాతని యనుచరు డొకనిచ్చెన నాగవాక్షమున కాన్చి, మెల్లగ వారిరువురును క్రిందకు దిగిరి. ఆచల్లని గాలి యామె వదనమును దాకినంతనే యామెకు కొంచెము స్పృహాగల్గ ప్రారంభించెను. అది గన్పట్టి సత్తిగాడు తిరిగి యామెకు మత్తుమందును వాసనజూపి యామెను మోసికొని వెలుపలి కేగుచుండెను. ఈసమయమున లచ్చిగాడు నిచ్చెననెక్కి లోనికురికి యాగదియందుగల విలువగల సామానులను చేతబట్టి తన యనుచరుని గలసికొనెను.

సత్తి—అరే! మనపని మనంచేశాం! సరిగ్గానే జరిగింది. మనలోఁటేంటి- సేనాజీగోరి కిపిల్లనిత్తాం. డబ్బుచ్చుకుంటాం మన కేంకొదవ.

వారిట్లు సంభాషించుకొనుసమయమున దీపకాంతిని లలిత గృహప్రాకారముపై నొక మానవవిగ్రహఛాయ పొడకట్టెను. వారిరువురును దానిని గాంచి యామెతో పరువెత్తిపోవ నుంకించుచుండిరి. కాని, యెలుగెత్తి "కదలకుడు. ప్రాణములు దక్కవు. నిలువుడు." అని యొకకేకయు క్షణములో పిస్తోలును చేతబట్టి గురిపెట్టు యొకవిగ్రహమును వారికంట బడెను.

"అరే! ముసలోఁడా!" అని సత్తిగాఁడరచి తనభుజముపైనున్న లలితను క్రింద పారవైచి, పరువెత్తిపోవుటకో లేక యాతని చావమోదుటకో ప్రయత్నించు సూచనల వెలిజేసెను. కాని, యతని యాలోచనలకు క్రియాస్వరూపము నీయకపూర్వమే మనవృద్ధవ్యక్తి తనజేబునుండి రెండుసంకెలలను దీసి పిస్తోలును గురిపెట్టుచు సత్తిగాని హస్తద్వయమునకు తగిలించెను. ముసలివాని కేకవిని యిరుగుపొరుగువారందరును లేచి వడివడిగ పరువెత్తి వచ్చుచుండిరి. సత్తిగాఁడు పట్టుబడెను. లచ్చిగాఁడు సమయమును గనిపట్టి తనమిత్రునిగతి నిసుమంతయు దలపక నొక్కఁ ఉరుకున యాయంధకారమందదృశ్యమయ్యెను.



# 24

## నే నెవరికి చెప్పను.

"నీవా — ఎవరిహత్యకై నేను —

ఈసమయమందే చెరసాలతలుపు అకస్మాత్తుగ తెరువబడెను. కాపరి వడివడిగ బర్వెత్తివచ్చి యావృద్ధుని హస్తమును బట్టి "రమ్ము! అరగంటకాలము మించిపోయెను. ఇంక మాట్లాడుట కనుజ్ఞ లే" దని లక్ష్మాజీ తాజెప్పబోవు వాక్యములు పూర్తిగ జెప్పకపూర్వమే వెలుపలి కీడ్చుకొనిపోయి చెరసాలాకవాటమును బంధించివైచెను. వెలుపలి కేగ నతనితో నాత "అయ్యా! నా కీవ్యవహారమందు ముప్పువాటిల్లునట్లు తోచుచున్నది."

"ఎందువలన?"

"నేను నిన్ని చెరసాలలోని కేగుట కుత్తరువిచ్చినట్లు లక్ష్మాజీ ప్రతికక్షులు తెలిసిన నే నాతనితోడ నేకీభవించి కుట్రచేయుచున్నానని నాయుద్యోగ మూడదీయుదురు."

"వా రెట్లెరుగగలరు?"

"అబ్బా! ఆస్యైనాజీవద్ద నేదియైన మంత్రబలిమి యుండియుండవలయును. జరిగినవిషయము జరుగుచుండగనే పూసగుచ్చినట్లంతయు నెరుంగగలడు. ఇంతవరకెన్నియో సారులనుభవించితిని అతని మహత్తు."

"అట్లయిన నన్ను లోనికి ప్రవేశపెట్టుటకు పూర్వ మేల యోజించుకొనలేదు?"

"నీదారిద్ర్యమున కాసించి."

"అట్లయిన నీమార్పునకు కారణము? సరిగ నాపనిని సానుకూలముజేయు సమయమున నన్నిడ్చికొనివచ్చితివి. నీవు నాకు జేసినయుపకార మేది?"

"నేచేయునది లేదు. నీవు పూర్తిగ నరగంటసేపు మాట్లాడితివి. కాని నీవు మాట్లాడునప్పు డొకవింతగ జూపట్టు వృద్ధభిక్షుకు డొకడు చెరసాల కావలిభాగమున దిరుగుచుండుట జూచితిని. ఈహత్య జరగినప్పటినుండియు వివిధమగు మనుష్యులు వివిధరూపములతో ప్రత్యక్షమగుచుండిరి. అందువలన నేను నిన్నివల కీడ్చికొని వచ్చితిని. మీయందరినడుమను నాయుద్యోగము పోగొట్టుకొనజాలను."

"ఉరిదీయు టెప్పుడు?"

"శుక్రవారమున."

"శిక్ష మార్పుచేయుట కవకాశము లేదా?"

" ఇంక లాభము లేదు. "

" వింతగ నున్నది. ఇతడు జవ్వనమునం దుండియు నొకగొప్పవాడుగ నుండియు నట్టిదానిని సాధింపజాలక పోయెనా ? "

"అతని స్నేహితులు చేయుచుండిరి. కాని ప్రయోజనము లేకుండెను"

"చిత్రము."

"చిత్రమో! కాదో! నాకు తెలియదు. నిజమది."

"పెనుభూత మని పేరుగాంచిన యపరాధపరిశోధకుని నీ వెరుగుదువా?"

"వింటిని. అత డెచ్చటనైన నకస్మాత్తుగ ప్రత్యక్షమగుచుండునట. అత డిప్పుడు లక్ష్మీజీపక్షమున పనిచేయ ప్రారంభించె నని వినియుంటిని. ఉరిదీయు సమయమున వాయురి స్తంభము వద్ద ప్రత్యక్షమై యాతడు నిర్దోషియని నిరూపించునేమో!"

"నాకు నమ్మకము లేదు."

"కారణము?"

"అత డీమధ్య మరణించెనని వాడుక."

"నేను నమ్మను. ఇట్టి విపరీతపురుషులు పెక్కుసారులు చచ్చుచుందురు. చచ్చెనని యందరును విశ్వసించియుండ నకస్మాత్తుగ ప్రత్యక్ష మగుచుందురు. వారిని బలిమార్చుట యంత తేలిక యనుకొంటివి గాబోలు!"

"వీరడు మరణించెను."

"అవును. నాకు తెలియును."

"అతడే యీ పెనుభూతము!"

"ఏమీ! అత్రిగుణోత్తుపీరడా! కల్ల. మిత్రమా! పొరబడుచుంటివి."

"లేదు. నాకు పూర్తిగ తెలియును. వారిద్దరు నొక్కటే. అత్రిగుణోత్తు పీరడే యీ పెనుభూతమును, యీరహస్యాపరాధపరిశోధకుడును."

"నీ వెవరు?"

"అదియే నన్ను లక్ష్మాజీ ప్రథమమున ప్రశ్నించిన ప్రశ్న."

"అతనికి సమాధాన మిచ్చితివా?"

"లేదు"

"నాకు జెప్పెదవా?"

"చెప్పను."

"అట్లయిన నీవే యా పెనుభూతమవయి యుండ వచ్చును."

"కాదు. అతడు మరణించెనని చెప్పుటలేదా? ఇటు విను. శుక్రవారములోపున నే నాతనితోడ తిరిగి మాటాడవలయును."

"అప్పు డాలోచించెదను."

"సరే!" అని చెప్పుచు నావృద్ధుడు తనదారిని బట్టి పోయెను. అత డేగినపిదప నాచెరసాలకాపరి "వీడి వింక నానిచ్చిన నాపేరు మారుపేరు బెట్టుడు. ఇతడు లక్ష్మాజీని

తప్పించుట కేదియో యుపాయ మాలోచించు చున్నటు లున్నది."

ఇత డిట్లువితర్కించుకొనుచుండగనే చెరసాలాంతర్భాగమున లక్ష్మోజీ యిటునటు పచారుచేయుచు "నేను ప్లీడరు గారితో జరిగిన విషయమునుగూర్చి ప్రస్తావింపవలెను. ఇట్టి కుటిలను సాగనీయరాదు. నా కిప్పుడు నాజీవితములపై యాస గల్గుచున్నది. ఆహా! శారదా! నీమాయరూపమును గుర్తింపజాలకపోతినని యూహించితివా? అయ్యో! నే నెంత వెర్రివాడను. చేజిక్కినదానిని యూరక విడిచి యిప్పుడు నేను శారదను చూచితినని చెప్పిన నెవ్వరు విశ్వసింతురు? ఆచెరసాలకాపరి యాగడమును నేను నమ్మజాలను. నేను మాటాడుట కత డవకాశ మీయకయే యామె నీడ్చికొని పోయెను. ఆమె యునికి యెచ్చటోగదా! ప్లీడరుగారుమాత్ర మేమిచేయగలరు? ఆహా! జడమతీ! మందబుద్ధీ! చేజిక్కిన శారదను నిర్వారగంది చూచుచు పోనిచ్చితివే! ఇంక నీ కామె కంటబడునా?

అయినను ఆమెయే శారద యని యెట్లుచెప్పనగును! గొంతుసవ్వడిని బట్టి చూడ నొకపురుషునివలె నున్నాడు. రూపమున నెచ్చటను శారదను పోలియుండలేదు. ఆమె నయనములను, ఒడ్డుపొడుగులను బట్టి యుపోహ జెందియుంటిని. కాని మనుష్యునిబోలిన మనుష్యు లెందరుండరు! ఐనను

నన్నన్యాయముగ యురిశిక్షకు పాల్జేసిన యాభయంకర దుష్టపిశాచి నేడు నాప్రాణములను రక్షించెదనని వచ్చునా? పట్టికల్ల! ఇది నాయొక్క మతిభ్రమ. సర్వమును కల్ల. ఈప్రపంచమే కల్ల. మిథ్యయగు యీప్రపంచము దీనను పొక బుద్బుదము. దీనికై నే నిట్లు పరితపింపనేల? అయ్యో! దాహము చెందియున్న పాంథు డెండమావులను జూచి నీర మని భ్రాంతి మోసపోయినచందమున నేను కల్లనిజముల నారయలేక నేజూచిన సర్వమును శారద యనియే భావించుచుంటిని! ఎంతచిత్రము! జ్ఞాని యని పేరందిన యీ లక్ష్మోజీ జ్ఞాననేత్ర మెంతలో గ్రుడ్డి దయ్యెను. నాలలితనైన జూడజాలకున్నది గదా! అయ్యో! లలితా! నీవును నాయట్టి యవస్థయందే యుంటివా? లేక వేయిరెట్లధికముగ బాధింపబడుచుంటివా? ప్రేమయొక్క మహిమ, వలపుయొక్క విపరీతభావములు చిరకాలమునుండి గ్రంథములయందు చదివి హర్షించితినే కాని మున్నెన్నడు నట్టిదాని ననుభవింపలేదు. నేడు నాకే యట్టి యవస్థ సంభవించినది. ఇందు చిత్ర మేమున్నది? లీలామానుష విగ్రహుడగు యాపరమేశ్వరుని యభీష్టము లెవ్వ రెరుంగగలరు? పుట్టించును. గిట్టించును. ఒక్కొక్కతరి మహదైశ్వర్య సర్వభోగముల నిచ్చి యానందింపజేయును. వే రొకతరి సర్వమును వినాశము గావించి యీప్రపంచమున గవ్వకైన కొరగాకుండ జేసి

యీతనుపునం దుండెడి లేశమాత్రవ్యామోహమును భగ్నము చేయును. ఈప్రపంచమందు నేనును ఒకవ్యక్తినే. అట్టి నే నిట్లు విచారింపనేల? నాప్రాణములపై తిరిగి వ్యామోహము జెందనేల? నాతో సంభాషింపవచ్చిన నూతనవ్యక్తిని జూచి శారద యని భ్రమింపనేల? లక్ష్మీజీ! యూరడిల్లుము. గతమునుగూర్చి చింతింపకుము. భావిజన్మమందు నీ కిట్టి దుర్దశను గల్గకుండునటు లాపరమేశ్వరుని కీర్తింపుము. ఓం శాంతి శ్శాంతిః. జగద్రక్షకా! సర్వేశ్వరా! ఆహా!



## 25

### అసాదృశపరిణామములు.

వీరడు—అతడే మన లలిత నాచోరుల హస్తములనుండి యావృద్ధభిక్షుక వేషమున వచ్చి తప్పించినది—పారిపోవుచున్న లచ్చిగాడిని తరుముకపోలేదు. తన కేక కందరును లేచి పరుగుపరుగున వచ్చుచుండుటచే తా నాసత్తిగాడినిమాత్రము పోనీయక పదిలముగ బట్టియుంచెను. లలితయు, ఔషధపటుత్వమూ తప్పి, క్రమముగా స్పృహ జెందుచుండెను. లలిత తల్లి వీధిలోనికి వచ్చినతోడనే తనకుమార్తె పడియుండుటయు నామెప్రక్క నావృద్ధభిక్షుకుడు నిలచియుండుటయు జూచి, తా నావరకే యాతని శంకించియుండుటచే నతడే తనకుమార్తె కగ్గానరింపవచ్చెనని తలచి కెవ్వున యొకకేకవైచి

'అతడే, అమ్మయ్యో! వాడే రండు రండు " అని కేకలిడ జొచ్చెను. ఇంతలో నొకబాలుడు వీరనిపక్క వచ్చి చేరెను. వీర డాతని జూచి చిరునవ్వునవ్వి "నీ వీతని భద్రముగా జూచుచుండుము, నే నీమెను లోనికి గొంపోయి విడచివచ్చెదను" అని చెప్పుచుండ లలితతల్లి కేకలకు మితిలేదు. దానికి కారణమును వీరడు గ్రహించి "అమ్మా! నీకుగాని నీకొమరితకుగాని వచ్చిన భయములేదు. బిగ్గరగా కేకలువేయకుము." అని యూరడించుచుండ నొకడు విపులముగా "గోలపెట్టావంటే పోలీసోళ్లొస్తారు. మోసం రాగల్దు, ఏడవమాకు" మని చెప్పెను.

తల్లి—నీవెవరు; నాకుమార్తె నేమిచేయు చుంటివి?

వీ—నే నెవరినో చెప్పవలయునా? నాపేరు వీరడు. నీకుమార్తె నిరువురుచోరులనుండి యిప్పుడే రక్షించితిని.

వీరనిపేరు చెవులబడినతోడనే లలిత తెప్పరిల్లి "వీరడూ! వీరడూ! నీవేనా! అమ్మయ్యో!"

వీర—భయములేదు. లలితా! ముందు నీతల్లితో గోలచేయవద్దని చెప్పుము. లేకున్న మోసము సంభవించును." అని చెప్ప నామె తనతల్లికి నచ్చజెప్పి కేకలిడకుండ జేసెను.

వీర—నే నిక్కడ నొక్కక్షణమైన నుండనోపను. ప్రజలందరును వచ్చుచుండిరి. నే నవ్వారినో వెల్లడయ్యెను. లక్ష్మీజీ రక్షింపబడును. నీవు ధైర్య మవలంబింపుము.

లలి—అయ్యో! నన్ను స్వైనాజీ నిలువనిచ్చుట లేదు.

పీ—అగును. నీప్రాణముల దీయుటయే యిప్పుడు స్వైనాజీకి ముఖ్యకర్తవ్యము.

లలి—నన్నేమి చేయుమనెదవు?

పీ—నీవు గృహమును కదలక జాగ్రతగ మెలగు చుండవలయును.

లలి—నీవేల యీవృత్తాంతమును ప్రభుత్వమున కెరింగించి యీస్వైనాజీపై ఫిర్యాదు సేయరాదు?

పీ—కాల మింకను పరిపక్వము కాలేదు. నన్ను బట్టి యిచ్చినవారికి వేయిరూప్యములు బహుమానమట. ఇది స్వైనాజీ పన్నాగము. కాని సమయము పరిపక్వమైనతరువాత నాతని వ్యూహమంతయు నొక్కపర్యాయ మకస్మాత్తుగ కూలిపోవునని యెరుగడు.

ల—లక్ష్మాజీని దర్శించివత్తునా?

పీ—కొన్నిగంటలసేపు తాళుము. లక్ష్మాజీయే నీకడకు వచ్చును.

లలి—ఉరిదీయుకాలము సమీపించుచున్నదిగదా!

పీ—నే నెరుగనా? లక్ష్మాజీ యురిశిక్షచే మరణింపనేరడు. నమ్ముము. అతని ప్రాణరక్షణ మొక్కటియేగాక నతడు నిర్దోషియని లోకమునకు చాటిచెప్పెదను. వేచియుండుము. నేను పోవలయును.

లలి—నన్నొంటిగా విడచిపోయెదవా? నాయండ నుండి నన్ను రక్షింపవా? స్వైనాజీని కొట్టువారి కొప్పగింప రాదా?

వీ—తరుణముగాదని చెప్పియుండలేదా? సాక్ష్యమంతయు పూర్తిగ సమకూరకుండిన బుజువు చేయు టెట్లు సంభవించును.

ఇట్లు వారు త్వరితముగ సంభాషించినపిమ్మట వీరడు లలితను దీసికొని గృహములోని కేగెను. ఈసంభాషణ నామూలాగ్రముగ నాలకించు యాసత్తిగాడు వీరడు లోపలి కేగుటయు పదునైగు వత్సరంబుల బాలుఁడొకడు తన్నుగా చుచుండుటయు జూచి చేతులు బంధింపబడియున్నను నదియే మంచితరుణమని యెంచి లేడిపై నురుకు కొదమసింగమువలె యా బాలునిపై నొక్కపెట్టున లంఘించెను. కాని కుశాగ్ర బుద్ధియు వీరనివంటి పరాక్రమశాలివద్ద యారితేరిన నిపుణుడును అగు యాపెంక డిట్టి యనాదృశపాటున కీల్గునా? సత్వర మతడు తన మోకాళ్లపై భూమిపైబడి మహోన్నతముగ మీదబడనున్న యాసత్తిగాని పాదములకు తన బాహులను లంకెవైచెను. సత్తిగాడును తనచేతులు గట్టబడియుండుటచే దొరకు యాధారమునైనను బట్టుకొనజాలక, ప్రక్కనుండి ప్రవహించు యొక మురుగు నీటికాల్వయందు బోర్ల బొక్కలుగ పడెను. అతడు తనహస్తములు స్వాధీనము లేకపోవుటచే ముక్కు

దియంగుళములలోతుగల్గిన యామురుగునీటియందు ప్రాణము
ను బాసియుండెడివాడే కాని వెంకడు సత్వరము లేచి యాతని
రెండు కాళ్ళనుబట్టి వెలికీడ్చుటచే బ్రిదికి బయటబడెను. ఇం
తలో వీరడు లోనుండివచ్చి జరిగినవృత్తాంతము నెరిగి యా
చోరునిజూచుచు నీకు తగినశాస్తి చేసెదనని చెప్పుచు ప్రథము
మున వానిహస్తులను దడిమి యందుండి యొకపదునైన పెద్ద
చాకును, రెండుపిస్తోళ్ళను, చోరులవద్ద భద్రపరుపబడు
కొన్ని పరికరములను గ్రహించి తన యంగియందు భద్రప
రచి యాచోరుని వెంటనిడుకొని ప్రయాణము సాగించెను.
వారు గోదావరీతీరమును జేరి నడుచుచుండిరి. క్రమముగ వం
తెనను దాటిరి. ఎక్కడికేగుచుండిరి? వీరనికిని, వెంకనికిని త
ప్ప మరెవ్వరికిని దెలియదు. వారట్లు కొంతదూరము పోయి
రోడ్డునకు చూపుమేరదూరమున నున్న గోదావరిగట్టుపై
పోవుచుండ నశ్వశకట మొకటి వచ్చు ధ్వని వినవచ్చెను. వీ
రడు వానిజాడ లెరుగగోరి వెంకని నడుపుమని యాజ్ఞాపించి
తానుమాత్రము కొన్నియడుగులు రోడ్డునకు దగ్గరగాపోయి
చూచునరి కొక గుర్రపుబండి, దానిని దోలుచు కరంచం
దు కన్నులబడెను. వారు తమ్ముజాడ లేదనియుగూడ గ్రహిం
పగల్గెను. కాని వారెచ్చటికి బోవుదురో యని యచ్చటనే
గాచియుండెను.

వెంకడు సత్తిగాడిని దీసికొని కొంతదూర మేగినపిదప

రనికై వేచియుండుట మంచిదని తలచి యట్లుచేసెను. సత్తి గాడుమాత్రి మెట్లు తప్పించుకపారిపోవుదునా యని యాలోచించుచుండెను. ఇట్లు వారయిదునిముసము లచ్చట నిల్చియుండ నకస్మాత్తుగ నాబాలుడు చంగున యొకగంతువైచి సత్తిగాడి మెడను కౌగలించుకొనెను. దానికి కారణ మొక పాము వడివడిగ వెంకనిప్రక్కనుండి పాకిపోవుటయే. అంత చతురుడయ్యు నబ్బాలునకు సర్పమన్న భీతియుండుట యాశ్చర్యమే! కాని యాసర్పము కరచునో యని భీతిల్లి, ఎదుటనున్నవానిని బట్టుకొనెను. అది గాంచి యాచోరు డాబాలుని క్రిందబడద్రొబ్బి పైనెక్కి తన చేతనున్న యినుపసంకెలలతో వాని తలపై మొత్తి యాతనికి నిస్పృహగల్పించి వడివడిగ వెనుకకు బరుగెత్తెను. మార్గమధ్యమున వీరను భూమిపై బడుండి తదేకధ్యానముతో రోడ్డునకై జూచుచుండ నేను రుపాటున వెనుకనుండి యాతని నెత్తిపై యొకదెబ్బ తనహస్తముననున్న యినుపయరదండములతో గొట్టెను. ఆదెబ్బకు వీరడు స్మృతిదప్పెను. ఆసమయముననే బండియు సత్తిగాని కంటబడెను. అతడు పరుగుపరుగునబోయి బండిపై గూర్చున్న కరంచందునుజూచి "అయ్యా! నాబంధముల నూడదీయుడు, రండు రం"డని తొందరింప లోనుండి తనమిత్రుడగు లచ్చిగాడు వెలుపలకురికి "ఓరీ! నీవెట్లు వచ్చా" వని కౌగలించుకొని యరదండముల నూడదీసి, యాతనిముఖమున వీర డసతి

దూరముననే పడియుండెననియు, తమ కభ్యంతరము గల్పించి నవాడు వృద్ధభిక్షుకుడు గాడనియు, వీరడేయనియు, సర్వము ను గ్రహించి కరంచందున్దోడ్కొని వీరనికళేబరమును స్వాధీనము జేసికొన బయలుదేరిరి.

ఆహా! వీరని కెట్టిపాటు సంభవించెను. అత డెన్నిసారులు వీరిబారినుండి తప్పించుకొనగల్గియు నేడొకచోరుని బట్టబోయి తానే పట్టుబడుట ఎంతవిపరీతము! అత డిప్పుడీక్రూర సర్పములచే జిక్కిన నింక లక్ష్మాజీనేరమునుమాపి యాతని రక్షించువారెవ్వరు? ఆహా! భగవానుడా! నీమాయలెంతయద్భుతమోగదా! ఏమికానున్నదో చూచెదముగాక.

వారట్లు వీరనికళేబరముపడియున్నతావునకై పోవుచుండ నకస్మాత్తుగ వెనుకనుండి "అయ్యో! చచ్చితి చచ్చితి రక్షింపుడు" అనియొకస్త్రీయార్తనాదము వారివీనుల బడెను. ఆకేకలు విడువక హృదయమును భేదించుచుండుటచే వారందరు నొక్కపరుగున నాదెసకై పర్వెత్తిరి. కాని వా రెంతదవ్వేగిన నారోదన మంత దవ్వగుచుండెను. వారెంత వోపికతో పరువెత్తినను ఆరోదనము మరింతదూరమగుచుండెను. చివరకు వారు మిక్కిలి యాయాసము జెంది యిదియేదయిన కారవిదయ్యమై యుండవలయునని నిశ్చయించి తమమార్గమును వెనుకకు మరలించిరి. క్రమముగ నాధ్వని యంతర్ధానమయ్యెను.

సత్తిగాడు తక్కినవారినిజూచి "మన మిక్కడిట్లా ఆ
ల్చెంచేస్తే, యీారకు మెుగవోడు మెునకే మాయమౌతాడు.
కదండి దబ్బుని" అని హెచ్చరింప వా రతిత్వరితముగ పోజొ
చ్చిరి కాని తిరిగి పూర్వస్వరమే "తండ్రీ! పోవుచుంటివా!
నన్ను విడచెదవా! అయ్యో! అయ్యో! రమ్ము రమ్ము.
రక్షింపుము" అని పూర్వముకన్న వేయిరెట్లు జాలిగొల్పుచు
వినబడెను. కరంచందు నిశ్వరగంది "ఎవరు? నీ వెవ్వరో!
ఎక్కడ నుంటివి?" అని కేకవేయ "తండ్రీ! యిచ్చట నుం
టిని! ఆలస్యము చేయకుము. అమ్మయ్యో! చచ్చితిని, చచ్చి
తిని. రండు రండు!" అని తిరిగి దిక్కులు ప్రతిధ్వనించునట్లు
రోదనము వినవచ్చెను. అట్టి యార్తనాదము చెవుల సోకు
చుండ నెట్టి నిర్దయాత్మునకైన మనము కరుగకుండునా!
సత్తిగాడిని లచ్చిగాడిని పీరని బట్టుటకు వినియోగించి కరం
చందు వేరొక యనుచరుని దీసికొని యాధ్వనివచ్చు దిక్కు
నకై పర్వెత్తిపోయెను. మన చోరశిఖామణు లిరువురును
తమ మార్గము పీరడు పడియున్న దిక్కునకై సాగించుచు
వారిలోవా రిట్లు సంభాషింప దొడగిరి.

సత్తి—లచ్చిగా! యిసారంగా వున్నావేంటా?

లచ్చి—యిసారం గాదురా యీ కేకల్నిసూత్తే నా
కనుమాన మేత్తోంది.

సత్తి—ఎందుకని? ఆకేకలకిన్ని నీకున్నూ సంబంద మేంటి?

లచ్చి—అయ్యి మడిసినోట్లోంచి రావటం లేదని తలు స్తుండారా?

సత్తి—ఓరి నీపిచ్చిగాల. బయమేత్తా వుందా యేంట్రా?

ల—బయం కాదురా.

సత్తి—మరేంటి?

ల—మనకా ఏడిచేమడిసి కనబడిందా మరి.

స—యినపడ్డకాడి కెల్లకుండా ఎట్టాకనమడుతుంది. యిదేం యెర్రిగోలా?

ల—నీవు సచ్చిందాకా యెల్లినా నీ కామడిసి కన మడదని అబిప్రాయం.

స—నీ మొగం.

ఈసంభాషణ జరుగుచున్నంతకాలము సత్తిగాడుకూడ లచ్చిగాడి భయములందు కొంచెము పాల్గొననే కాని వీరడు పారిపోవునేమో కార్యభంగమగునేమో యని తన యనుచరుని హెచ్చరించుచు ప్రయాణము వడివడిగ సాగించుచుండెను. వా రప్పటి కప్పుడే యతడువడియుండు ప్రదేశము ప్రవేశించిరి. వారి యాశ్చర్య మేమని చెప్పవచ్చును. వీరడు లేడు. ఎక్కడికి పోయియుండునోగదా!

# 26

## స్వామిభక్తి.

రోదనము క్రమముగ వృద్ధియగుచు గర్భనిర్భేద్య
మగుచుండ నాయార్తి యెవ్వరిదోగదా యని కరంచందు
నకు శంకవొడమెను. ఆధ్వనిని తాను మున్నెన్నడో విని
యున్నట్లున్నదే! అతడు దారియు డొంకయు నరకుగొనక
హృదయప్రోద్బలము మిట్టిపడ, కాలికొలదిని పరువెత్తుచుం
డెను. అతని కాయాసము మిక్కుటముకాగా త్వరితముగ
నడువసాగెను. కాని ఎచ్చటను తన గమ్యస్థానము కనబడ
కుండెను. ఇది చిత్రముగదా! తా నొక పరిహాసకార్య
మునకు లోనైతిగదా యని యతని కొక శంకయు, రోష
మును హృదయమును వేల్చుచుండెను ఎట్టకేల కత డొక
ప్రదేశమున నిలచి యెలుగెత్తి "నీ వెవ్వరో నా కగుపడుట
లేదు. నీ వెవ్వరో తెలియ జెప్పుము. లేకున్న నేను మరలిపో
యెదను" అని బెదరించెను. కాని యాయార్తనాదము మరింత
మిక్కుటమై "అయ్యో! నన్ను వీడిపోయెదవా! నా కిక ది
క్కెవ్వరు?" అని ఏడ్వసాగెను. కరంచం దచ్చెరువంది నీ వె
వ్వరో చెప్పరాదా? యని రెట్టించెను. తిరిగి యాయదృశ్య
స్వనము "నేను శారదను, శారదను. అయ్యో! అయ్యో!
బాబోయి!" యని మరింత బిగ్గరగా నేడ్వసాగెను. శారద
యనుమాట చెవిని బడినతోడనే కరంచందు లేని శక్తిని

ప్పికొని యాదిక్కునకు పర్విత్తెను. కాని యతని కింకను
రద కాన్పింపదయ్యె. పరువెత్తుచు "అయ్యో! శారదా!
క్కడ నుంటివి? నే ననుకొనినట్లే యయ్యెను. ఎక్కడ నుం
వి" అని మరిమరి ప్రశ్నించుచు "ఇదుగో యిక్కడ యి
డ" అను పదములను మార్గదీప్తిగ గైకొని పోయిపోయి
గాయకు అంధగౌతమీతీరమున యొక పెద్ద యొరకముపై
బవబడి పోయెను. అతడింకెచ్చటికి పోగలడు? అఖండ
తము తనకు క్రిందుగ ముప్పది యడుగుల దూరమున ప్ర
హించుచుండెను. ఏమరుపాటున నొక్కయడుగు గిడియుండిన
ంత డాప్రవాహమున బడియుండెడివాడే కాని యూతను
ంచెను వెల్తురుగ నుండుటచే తన తప్పిదమును గ్రహించి
న్నెవ్వరో మోసముచేయుచుంటిరో లేక యెద్దియైన కారవి
య్యము తన్నట్లు మోసము జేయుచున్నదోయని శంకించి
ఎక్కడనుంటివో తిరిగి చెప్పు" మని యనుగ "గోదారిలో
నుమికి రా. నీ దగ్గర కూంత దాగముందా?" యని పక్కన
యొకనవ్వు వినవచ్చెను. ఇంక విశదముగా కేమున్నది? ఆజిత్తు
బమారి వెంకడు తన్ను మోసము జేసెనని గ్రహించెను. అతని
యాగ్రహమునకు మితిలేదు. కాని యాయంధకారమం
దా బాలుని వెదకి పట్టుకొనుట యెట్లు? ఈవర కెన్నియో
సారులాతని నిట్లు మాయజేసెను. వీరడితోడ నాతని కెద్దియో
సంబంధ ముండితీరవలయునని శరంచండు గ్రహించెను. తన

తప్పిదమునకు తానే నవ్వుకొనుచు వెనుకకు మరలి మార్గ మును సమీపించుసరికి సత్తిగాడును, లచ్చిగాడును చేతు లూపుకొనుచు "పారిపొయ్యాడు, పారిపొయ్యాడు" అని చెప్పుచు సమీపించుచుండిరి.

కరం—వీర డేడీ?

స—పారిపొయ్యాడు.

కరం—ఎక్కడికి పారిపోవును?

స—ఏమోగాని ఏడిచిం దెవరో తెల్చిందా ?

కరం—ఆ!

స—ఎవరా అమ్మాయి అంతగా ఏడుత్తోంది. పాపం!

కరం—అమ్మాయికాదు, అబ్బాయే!

స—యిదేంటి యీసితర్గం. ఎవరుమరి?

కరం—వెంకడు. ఆచిలిపి వెధవ.

ల—దొరికాడా?

కరం—దొరికితె వీపు చీరెయ్యును వెధవని.

ల—అడ్నిగనక ఓక్రైనా వట్టుకుంటే నూరుహూపాయి లిస్తా. మరి సూస్కోండి. నన్నింత బయమెట్టాడు.

కరం—నరేగాని వీరడ్ని పట్టుకొనుట యెట్లు?

స—ఆ డెక్కడికెల్తాడు. యీమద్దే ఎక్కడో న క్కాడు. నెలుకితే ఆడే కనపడతాడు.

ల—కాని ఎట్టాతప్పించుకు పొయ్యాడంట?

కరం—ఎట్లాపోతే మీ కేమి? నాకు వీరడ్ని పట్టి యిస్తే అయిదువందల రూపాయిలు బహుమానం చేస్తా. పొండి. మీ అదృష్టం చూసుకోండి.

స—ఎల్లాం పదరా. అదృష్టంవుంటే రూపాయిలు కుప్పల్లాగ వస్తాయి.

వా రిట్లు సంభాషించుకొనుచు వీరని వెదకుటకై బయలుదేరి పోయిరి. కరంచందు పట్టణమార్గమును బట్టి పోయెను.

చూచితిరా చిత్రము! వీరడు పట్టువడుట నియే యందరి తాత్పర్యమును కాని, యదృష్టవశమున తప్పించుకొనగల్గెను. సత్తిగాడు వీరని తనయరదండములతో మొత్తి కొనయూపిరి తో విడచిపోవునరికి పెంకడును వేరొకచోట స్పృహ తప్పి పడియుండెను. కాని యతనికి దెబ్బ మోపుగ తగలకుండుటచే వెంటనే తెప్పరిల్లి వీరనిగతి విచారించుచు వచ్చుచుండ వీరం దరును తన యాజమానుని బట్టుటకై పోవుచుండుట గ్రహిం చి యతిత్వరితముగ వెనుకకు బర్వాత్తి, సహజముగ నద్భుత ముగుజిత్తులమారియగుటచే నిట్టివన్నాగమును బన్ని, వారి నందరను వెనుకకు మరలించి కాలయాపనజేసెను. ఈలోపు న వీరడును తెప్పరిల్లి జరగినమోసమును గ్రహించి లేవలేక పాకుచు సమీపమునందున్న యొకపాదరింటియందు తన కాయమును భద్రముచేసికొని ఎవ్వరికిని గన్పడకుండ దాగి

యుండెను. అది తానింతకుపూర్వ మెన్నియోపర్యాయములు
తన సంకేతస్థలముగ నుపయోగించియే యుండుటచే దాని
యొద్దనుండుట భద్రమని యతడెరుంగును. వెంకనిరాకకై వేచి
యుండెను.

వెంకడును తనవైరులందరను మాయముజేసి వీరని
వెదకుచువచ్చి యీసంకేతస్థలమును జేరి జూచునరికి తన నాయ
కుడు మిక్కుటమగు రక్తస్రావముచే సొమ్మసిలి పడియుండు
టజూచెను. అదియునుగాక నాతనికి మిక్కుటమగు దాహ
మును, ఆకలియు నగుచున్నట్లుగూడ గ్రహింపగల్గెను. కాని
యానిశీథమందెచ్చట వాని కిట్టిపదార్థములు సమకూడును?
అప్పటికప్పుడే తెల్లవారవచ్చెను. కాకులు కావుకావుమని
కూయుచుండెను. [illegible]ంగల పక్షిసంతానమంతయు తమ
తమ కులాయములను విడచి మేతకై పర్వెత్తిపోయెను. కాని,
ప్రజలెవ్వరును మార్గమున బోవుటలేదు. అప్పుడప్పుడు గోదా
వరీస్నానముచేయుట కొరకు వృద్ధులో లేక గోవిందారామయ
నుచు తావళమును చేబట్టిపోవు నొకరిద్దరు వితంతువులో
లేక తెల్లవారుజామునసే బయలుదేరి ప్రయాణములు సాగిం
చు నొకటిరెండు శకటములో తప్ప వెంకని కేమియు గన్పడు
టలేదు. అచ్చటికి సమీపమున నొక కాఫీహోటలుమాత్ర
ముండెను. సమయస్ఫూర్తిగల యావెంకనికి కాఫీహోటలుం
డుంగతి జ్ఞాపకమునకు వచ్చెను. నవీననాగరికత ప్రబలముగు

కొలదిని రేచీకటి కండ్లనింకను మూయుచుండగనే యిడ్డెనలు కాఫీ మొదలగు పదార్థము ఉదరమునబడిననేగాని మన యువకులు మిక్కుటమగు క్షుద్బాధ నాపుకొనజాలరనియాత డు దినదినమును చూచుచుండెను. అతడును అప్పుడప్పుడు సంతస సమయమున వీర డొకటిరెండు నాణెముల నాతని కిచ్చినపుడు కొంకులేక వెంకడుకూడ నా కాఫీహోటలునం దు రెండిడ్డెనలుకొని తినుచుండెడి వాడుకకూడ కలదు. ఆకా రణమున నిప్పుడు వెంకనికి కాఫీహోటలు జ్ఞాపకమునకు రా గా వీరని జేబులనుదడిమి యుండుండి రెండునాణెములను చే బట్టి యాకాఫీహోటలునం దేమయిన దొరకిన దెచ్చి తన యజమానునికిచ్చి సేదదీర్చెదనుగాక యని బయల్వెడలెను. స్వామిభక్తియున్న నిట్టిదే కదా!

---

## 27

రు 1000/- బహుమానము.

వెంకడు హోటలువద్ద కేగుసరికి వంటలవారు తిను బండారములను వడివడిగ తయారుచేయుచుండిరి. సరియగు సమయముననే వచ్చితినిగదా యని యాతడు తిన్నగ లోని కేగక దొడ్డిగుమ్మమువద్దకు వచ్చి యందొకని బిలచి నాకు రెండిడ్డెనలిచ్చెదవా యని యడుగ నాత డాబాలుని కసరి యచ్చటికి రాకూడదని యాజ్ఞాపించెను. వెంకడు చేయునది

లేక సావడిలోని కేసరికి నత్తిగాడును లచ్చిగాడును ఉదరపోషణార్థమై కునికిపాట్లు పడుచు నాబల్లలపై కూర్చుండియుండిరి. వెంకడు వారిని గుర్తించెను. అతనిమనమునందు చిలిపితన ముద్భవించెను. వంటలవాడు రెండిడ్డెన లోకపోట్లము గట్టియిచ్చెను. మెల్లగ వాటినందికొని యాచోరుల కంటబడకుండ సత్వరము వెలికివచ్చి యాయావరణమునుబట్టి చూచుసరి కొక గోడనాని యొకమనుష్యుడు కూర్చుండియుండెను. వెంకడు పిల్లియడుగులతో యాతనిదరిజేరి తననోటిపై చేయిబెట్టి నిశ్శబ్దముగ నుండుమని సూచించుచు తనయంగీనుండి యొక యచ్చుకాగితమును దీసి యాతనిచేతి కందిచ్చెను. అందిట్లు లిఖింపబడి యుండెను.

గొప్పబహుమానము! రు 1000 గొప్పబహుమానము!!

వీరని బట్టియిచ్చినవారికి.

అని క్రింద యాతనిగూర్చి కొంతచరిత్రయు నొద్దుపొడుగుల వర్ణనయు వ్రాయబడియుండెను. దానినిజూచి యావ్యక్తి "సరే! దీనితో నేమిచేయమనెదవు? దీని నింతకుపూర్వము పెక్కుసారులు చూచియుంటిని."

వెంక—అతడెక్కడనున్నదియు నేనెరుగుదును.

వ్య—నిజమేనా?

వెం—నిస్సంశయముగా.

ఈవృత్తాంతము వినినంతనే అనాథనవ్యక్తి ముఖము వికసింప యాబాలుని దగ్గరకుదీసి యాప్యాయముగ సంభాషణను ప్రారంభించెను. దరిద్రమన్న నెట్టివారికైనను ఆశయే గదా!

"నీ పేరేమి?"

"వెంకడు."

"నీవెవరు?"

"సేవలోడ్ని."

"వీరడ్నింతకుపూర్వము చూచియున్నావా?"

"ఆ"

"ఎంతకాలము క్రిందట?"

"అయిదు నిముసాలకిందే"

"అబద్ధము. అతడు మరణించినట్లు వార్తాపత్రికలు చెప్పుచుండ నీకు అయిదు నిముషములక్రింద కనబడవచ్చునా?"

"యిప్పుడు నేను చూచియుండగానే-బీమసంపాదు?"

"ఎక్కడ చూచియుంటివి?"

"యిక్కడే"

"అంటే?"

"ఆకాపీ ఒటల్లో"

"అయితే సరే తెలిసింది. వట్టి అబద్ధము. ఇంతకుపూర్వము నీవెప్పుడైన యతని నెరుగుదువా?"

"ఎరుక్కేం. రాజమండ్రిలో లచ్చసార్లు సూశా. సరే యియన్నీ యెందుకు? అడుగోసూడు పెద్దతలగుడ్డట్టుకుని కూకున్నోడే యీరడు. నువ్వు పట్టుకుంటావా బహుమాన మిత్తారు లేకపోతే యింకోడికి సెపుతా."

ఈమాటపై నావ్యక్తికి ఆశబుట్టెను; కాని వీరని పట్టుటయెట్లు? మున్నెందరినో మాయజేసి తప్పించుకొని పోవునుగదా యని యోజించి యాబాలునిజూచి "ఎవరి కెరింగింపవలెను." అని యడిగెను.

"పోలీసువోరికి. యింకోమాట. నేను కాదని తప్పించుకు పారిపొయ్యేందుకు పెనుగులాడతాడు. విడవమోకు. బద్దిరెం."

"సరే! నీవుపోయి రోడ్డునం దెవరయిన పోలీసువున్న యిచ్చటకు బంపుము. నేను కాసియుండెదను."

వల్లెయని వెంకడు బయలుదేరి యొక్కగడియలో నొక పోలీసువానిని వెంటబెట్టుకొని వచ్చెను. అతడు సర్వమును విని ఆ కూర్చున్నవారిలో వీరడెవరో బాగుగ గుర్తించి యాహోటలునందు ప్రవేశించుచుండ లచ్చిగాడు వుమ్మివేసికొనుటకు బయటికివచ్చెను. మొట్టమొదట వాడు చూచినది పోలీసువాని విగ్రహము. వానివెన్క వెంకడు నిలువబడియుండెను. ఆబాలుని చూచినతోడనే యాతని కక్కడలేని యావేశమును జనించ నాబాలునిపై కురికెను. అతడు వెం

కని తలపై నొకదెబ్బ వేయువాడేకాని యాపోలీసు వాని క డ్డగనిలచి రెండుచేతులనుబట్టి సంకెలలువైచి నిలువబెట్టెను. వెంకడు నవ్వుచు "ఆరెండోవాడు రెండోవాడు" అని యరచెను. కాని మనయుద్యోగి యాచోరుని సమీపించునప్పటి కాతడచ్చటికో పారిపోయెను. పోయినవానికై చింతింపక చేజిక్కినదే పీరడగుటచే నాతనిబట్టి దీసికొనిపోజూచుచు రమ్మని సైగజేసెను. లచ్చిగానికీయరెస్టు క్రొత్తగాదు. మున్నెన్నోసారులు కారాగారమున బంధింపబడెను. అందువలన పోలీసువారన్న నతనికి భయములేదు.

"నన్నెందు కట్టుకున్నా" రని ప్రశ్నించెను.

"ఎందుకా? నీకు తెలియదు. ఇదుగో బహుమానము. ఎక్కడికి వెళ్లగలవు." అని య్యాయుద్యోగి తనచేతనున్న అచ్చుకాగితమును వీనికి జూపెను. అందులకు నవ్వి లచ్చిగాడిట్లు చెప్పెను.

ల—ఓరి నీపిచ్చిగాల! నేను యీారడ్నికాను. కావలిత్తే సెప్తా నెలుకోండి.

వెం—నేను సెప్పలే! కాదంటాడని."

ల—నువ్వేనా కారణాం. బద్దిరం.

వెం—వదలకండి. యీాడే యీారడు.

లచ్చి—అబద్ద మాడతావెందుకు? పోలీసుగోరూ! ఆణ్ణికూడా మట్టుకోండి."

పో—ఎందుకు ?

లచ్చి— నేను యీారడ్ని కాను. అబద్దం సెప్పాడు.

పో—మేజస్ట్రీటుగారిదగ్గిర ఋజువుచేసుకో.

లచ్చి—సాచ్చికానికి కావాలి ఆబుడ్డోణ్నికూడా పట్టుకోండి.

కాని ఆపోలీసువాడు తనమనమును నిశ్చయము చేసి కొనకపూర్వమే వెంకడు ప్రక్కనుండి మెల్లిగా నావలకు జారి "యీాడేయీారకు. వదలకండి. నిజంచెప్పినందుకు నన్ను సాచ్చెమేద్దామనుకొంటుండారు. యిదా మీారుసేసే ఉపకారము. వదలకండి" అనిచెప్పుచు కాలికొలదిని యాపొలముల కడ్డముగాబర్వె త్తిపోయెను. నేను కాదని మొరబెట్టుచున్నను వినక నాపోలీసు యుద్యోగి లచ్చిగాడిని ఠాణాకు దీసికొని పోయెను.

అన్నా ! ఎంతచిలిపివాడు వెంకడు!!

---

## 28

### విశ్వప్రియత్నము

వీరడు విశ్వప్రియత్నములు చేయుచుండెను. ఎక్కడ జూచిననక్కడ సాక్షాత్కరించి యొకభూతమనియు, మానవ మాత్రుడు కాడనియు తనవైరులహృదయమునందు భీతిపుట్టించెను. స్వైనాజీ, వీరనివృత్తాంతమంతయు ననుమానాస్పదము

గనుండెను. అతని నిజనామము నెల్లెరుంగగల్గెనో యనుసంశయముచే పీడింపబడి దుష్టమగు తన పూర్వచరిత్రము ప్రస్తుతరహస్యములను ఆమూలాగ్రముగ గ్రహింపగల్గెనో యని తహతహపడుచుండెను. అతనివ్యూహమంతయు నొక్కవీరడే విచ్ఛిన్నము చేయగల్గునని నమ్మియుండుటచే నాతనిబట్టి ప్రాణముదీసినగాని తన దుర్నయములన్నియు వెల్లడగునని యోజించి, "వీరనిబట్టియిచ్చినవారికి రు 1000/ బహుమానముజేసెద" నని ప్రకటించెను. కాని యతనియనుచరు లెవ్వరికి జిక్కక వీర డత్యద్భుతముగ తప్పించుకొనిపోవుచు, వారెచ్చటనైన రహస్యములుచెప్పుకొనుచుండ నచ్చటప్రత్యక్షమై వారి సంభాషణల నాలకించి, వారు తనపై గవిసి పట్టబోవ నత్యద్భుతముగ మాయమగుచు వారిసందరను చీకాకుపరచుచుండెను. అతడొకపర్యాయ మర్ధరాత్రియందిట్లు స్వేనాజీ గృహప్రాంతములయందు సంచరించుచు శారదనుపోలిన యొకయాకృతిని జూచెను. నిజ మరయునంతలో నాయువతి యంతర్ధానమయ్యెను. శారదను మరగుపరచినస్థల మింతవరకును తెలియలేదు. రాత్రులందుమాత్ర మొకపడవపై నప్పుడప్పుడు స్వేనాజీగృహమునకు వచ్చి తెల్లవారకుండగనే వెడలిపోవునని మాత్రము పసిగట్టెను. కాని యతడెన్నిదినములు కాపుండినను ఆమెను బట్టజాలకుండెను. స్వేనాజీయు వరినైపుణ్యమున నామెను గాచుచుండెను. రహస్యము బయల్పడుటకు సిద్ధముగా

నున్న సమయములందెవ్వియో యవాంతరములు గల్గి యభీ
ష్టార్థము లభింపకుండెను. ఆహా! వీరనిపై నెంతభార మాని
యుండెను. ఒకవైపు తనమిత్రుడగు లక్ష్మాజీప్రాణసంరక్షయు
నతని నిర్దోషిత్వమును ఋజువుచేయుటయు, వేరొకతరి తన
మనోనాథునికై చింతించి కృశించు లలిత నూరార్చి యామె
ను స్యేవాజీబారినుండి రక్షించుటయు, వానినిమించి తనప్రా
ణరక్షణకై సంకేతస్థలమున డాగియుండి యనేకమారువేసము
లతో తనకార్యములు నిర్వర్తించుకొనుటయు—ఇవన్నియు
తానొక్కరుడే, బాలుడగు వెంకజినసహాయముతోడ నెరవేర్చు
కొనవలసియున్నది. అతని కన్నహారములు సకాలమునందు
కుదురక శరీరమంతయు జర్ణించిపోవుచుండెను. శక్తి యుడిగి
పోయెను. కాని హృదయాంతరాళములందు ప్రజ్వరిల్లు రోషా
నలజ్వాలలు, తనమిత్రుని ప్రాణసంరక్షణచేయవలెనను కృత
నిశ్చయము, ఒకద్రోహి యన్యాయముగ నీప్రపంచమున
తనదుష్టవర్తనలచే వర్ధిల్లుచున్నాడను యహంకార మాతని
సర్వనాడులయందును విద్యుచ్ఛక్తివలె బ్రవహించి యాతని క
పూర్వబలమును గూర్చుచుండెను. కాల మంతమగుచుండెను.
నేడు గురువారము. రేపటియుదయ మారుగంటలకు తనప్రా
ణమిత్రుడును, సన్మార్గుడును, నిర్దోషియునగు లక్ష్మాజీని
యురిస్తంభముపై నుంచెదరు. ఇంకొక్కపగలును, ఒకరాత్రి
యు గతించిన తనప్రయత్నములన్నియు బూడిదబోసిన పన్నీ

రగును. ఈప్రపంచమందు వీరనిజీవితము నిష్ఫలమగును. అరితేరిన యపరాధపరిశోధకుడయ్యు, వాదుష్టుడగు స్వేవా జీవృత్తాంత మామూలాగ్రముగ నెరింగియుండియు ఋజువు చేయుట కేమియు నాధారములులేక తానిప్పుడు హస్తములను గట్టినట్లయ్యెను. తన యుద్యోగముద్రికను వెల్వరచి శారద జీవించియున్నది. లక్ష్మాజీ నిర్దోషి యని ప్రభుత్వమున కెరింగించిన నేమిఫలము. అపరాధపరిశోధకోద్యోగమున నున్నంతమాత్రమున తనమాటలను విశ్వసించువా రెవ్వరు? క్రిమరీతిని నరము ధృవపర్చబడెను. శారద జీవించియున్న వాపెవిగ్రహమును కన్పరచవలయును గదా! వట్టిమాటలక డ నేమిప్రయోజనము.

వీరని కేమియు దారి గాన్పింపకుండెను. వెంకడు తెచ్చి యిచ్చిన ఫలహారములను, నీరమును స్వీకరింప కొంతబలము చేరుకొనెను. లేచి కూర్చుండి యాలోచించుచుండెను. వెంకడు కొంచెముదూరముననే నిలచి తనస్వామి ముఖమును పరిశీలించుచుండెను. అతని యాశ్చర్యమునకు కారణము నేడెన్నడును లేని వింతకళయొకటి తనస్వామి ముఖమండలమున తాండవమాడుచుండుటయే. దానియం దపూర్వతేజస్సును, మేధాసంపత్తియు, ధీరగుణమును అంతర్గతమై యుండెను. అతడొకరాతికి చేరబడి యాకసమువంక జూచుచు నిశ్చలముగ నాలోచించుచు "చేయవచ్చునా? చేయగలనా?" యని పొ

ద్రిరో తలపోయుచుండెను. పైనుండి వర్షబిందు వొకటి యా
తని నొసటను బడెను. దానిని దుడుచుకొనుచు “ఈవర్షపాత
ము నేటిరాత్రి వచ్చినబాగుండియుండునుగదా!” యని నిట్టూ
ర్పు నిగిడ్చెను. ఇట్టిభావముల నిసుమంతయు గుర్తింపనేరక వెం
కడు చేతులనుగట్టి, చూపులను తనస్వామిపై బ్రసరించు
చుండెను. వీరడు లేచెను. ఇటునటు పచారుచేయుచు నా
లోచింపసాగెను. అత డొక వృద్ధభిక్షుకుని వలువలలోనుండి
నను అతనిముఖ మొక నడివయస్సుగల యుత్తమవంశజుడని
చాటుచుండెను. త్రాగుబోతు వీరని కట్టి తేజస్సుగల్గుట య
ద్భుతంబుగదా! వెంకడు వెర్రిచూపుల జూచుచుండెను. ఈ
వీర డొక గొప్పయపరాధపరిశోధకు డనియు, కారణాంతర
మున త్రాగుబోతు వీరడని బరగుచుండెననియు వాతని కేమి
తెలియును!

వీరడు శారదనుబట్టుట కింతవరకును చేసినచర్య లద్భు
తములు. ప్రారంభమున లలిత తన మనోనాథుని కొక యు
త్తరమీయుట కేగినప్పుడు తానుగూడ నామెను మారువేష
మున వెన్నంటి శోధింపబోవుచుండ చెరసాలారక్షకుని భా
ర్యకు తన యధికారముద్రికను జూపి యామెను తన స్వాధీ
నము గావించుకొని, తన యుత్తరమును లక్ష్మోజీ కందియజే
సెను. ఆదినమునుండియు రుక్మిణి తనకు చేదోడువాదోడు
గ నుండెను. స్త్రీనాటి గృహకృత్యములు నిర్వర్తించుటకై

నియమించుకొనిన పరిచారికకు గొప్ప బహుమానము లొసంగి యామె ముఖమున నెప్పటికప్పుడు తన వైరిబృందము యొక్క రహస్యముల నెరుంగుచుండెను. పరిచారిక తనకు మిత్రురాలగుట యాతని ప్రధానజయభేరి. శారద యప్పుడప్పుడు రాత్రులందు వచ్చుచుండుటచే నామెరాకను తన కెరింగింపుమని యా పరిచారికను వినియోగించెను. ఆమె వలన స్వేనాజీ శారదను జంప యత్నించుచుండెననియు గ్రహించెను. ఆమె యునికి యొక్కటిదప్ప సర్వమును సానుకూలమయ్యెను. అదియునుంగాక తా నావృద్ధభిక్షుకవేసమున యింటింటను దిరుగుచునెచ్చటనైన శారద యాకృతి గన్పడునాయని వెదకెను. కాని యామె యాతని కాపట్టణమునం దెచ్చటను గాన్పింపకుండెను. ఆమె నాపరిసరగ్రామముల లో నెచ్చటనో లేక యొద్దియైన సంకేతస్థలముననో మరుగు పరుపబడెను. ఆమెను కనుగొని కోర్టువారికి ప్రదర్శించుట యే వీరని ప్రధానకర్తవ్యము. దానితోడ నతని యుద్యమము పరిసమాప్తము నందును. వీర డెవ్వడో ప్రజలకు విశదము గాగలదు.



# 29

## శారద జీవించియున్నంత కాలము ముప్పవాటిల్లును.

" శారద జీవించియున్నంత కాలము నాయైశ్వర్యమునకు ముప్పవాటిల్లును. మాయోపాయమున నామెను నా యాలోచనలయందు లీనముగావించి, లక్ష్మీజీ యాస్తియందర్ధభాగము నిత్తునని యాసజూపి నావ్యూహము జయప్రదముగ నెట్టుకొని వచ్చితిని. రేపటి యుదయమున లక్ష్మీజీ యురిస్తంభముపై ప్రాణములు బాయగలడు. నేనే యాతనికి వారసునని యింతకుపూర్వమే కోర్టునందు చెప్పికొని యుండుటవలనను, సన్నిహితవారసు లీప్రదేశమం దెచ్చటను లేని కారణముననుూ, నన్నీపట్టణమున నెవ్వరును ఎఱుగకుండుట వలనను, కరంచందుమున్నగు అనుచరుల సాక్ష్యముపై నాతని యాస్తి సర్వమును కైంకర్యము గావించుకొనెదను. ఆహా ! స్వామీజీ ! నీభాగ్యమే భాగ్యము. స్వగ్రామమునందు నీయాటలు చెల్లకపోయినను, సమయమును గనిపెట్టి యీలక్ష్మీజీ జాడలను దీసి వ్యూహము పన్నినందులకు దైవానుకూలముచే సిద్ధించెను. శారదను గూడ నెవ్వరికిని దెలియకుండ వధించిన యామె సగముద్రవ్యమును గూడ నేనే యనుభవించుచు నా చేష్టల కభ్యంతరము జెప్పవా రెవ్వరును లేక నిర్భయముగ గుండెపై చేయినిడికొని నిమురింతును. ఈవీర డింకేమిచేయ గలడో చూచెదగాక!"

అని యీవిధముగ దుష్టుడును, వినీతిపరుడును, జిత్తులమారియు, నిర్దయాత్మకుడును, పరద్రవ్యాపేక్షపరుడును, నీచుడును, అగు స్వేనాజీ తన శయనాగారమునం దొంటిగ పరుండి యాలోచించుచుండెను. శారద జీవించియున్నంతవర కెన్నడో యొకదినము ముప్పు వచ్చునని యాతడు గ్రహించెను. అదియునుగాక వీర దమాసుమశక్తివలె తనసంకేతస్థలముల నెల్ల దిరుగాడుచు తన యనుచరుల రహస్యవర్తనము లెల్ల నెరుంగుచుండెను. అతడు తన నిజనామ మెరింగియుండుటచే మరింత జాగ్రతగ నుండ వలసివచ్చెను. శారదను వెదకుటయే ప్రధానకార్యమని వీరదు ప్రయత్నించుచుండిన సమయమం దెట్టివిషమకాలము నం దైన యామె యాతని కండ్లబడిన నింక చేయగలిగినదేమున్నది? స్వేనాజీ తనదుష్కృత్యముల ఫలితము నిస్సందేహముగ ననుభవింపవలసినదే గదా? స్వలాభము, స్వశ్రేయము, స్వాతంత్ర్యము యీమూడును శారదజీవితముపై నాధారపడియున్న సమయమునందు, క్రూరాగ్రేసరుడును, వినీతుడును, ముక్కిడియు నగు స్వేనాజీ శారదజీవితములను దీయకేల యూరకుండును? శారద స్వేనాజీ కౌమరితయా? పాఠకులారా! తెలియజెప్పెదను వినుడు. శారద బొంబాయి నగరమునందొక విటకత్తె ఆమె స్వేనాజీతో చాలకాలము నుండి సఖ్యము గావించుచుండెను. ఆమె స్వేనాజీ కౌమరిత

కాదు. లక్ష్మీజీని నిజముగ ప్రేమించియుండలేదు. వలపు
వెరమున నాయువకుని యాస్తియంతయు నపహరింపవలె నను
యుద్దేశ్యముతో జయసేనుఁడు, అనగా మన ప్రస్తుతస్యేనాజీ
తనతండ్రియని యొకకథ కల్పించుకుని లక్ష్మీజీస్నేహము నపే
క్షించెను. కాని నిర్మలమగు లక్ష్మీజీహృదయ మిట్టి సామా
న్యవిటకర్తైమనముచే నాకర్షింపబడునా! హృదయ మొక
సూదంటురాయివంటిది. సామాన్యమృత్తికారేణముల నాకర్షిం
పజాలదు. లక్ష్మీజీ తనప్రేమకు ప్రతిప్రేమజూపుటలేదని
శారద గ్రహింపకపోలేదు. ఆమె క్రోధమునకు మేరలేదు.
ఒకతరి తన యోచనలన్నియు నిష్ఫలములయ్యె ననుయీర్ష్య
యొకవైపునను, తన్ను నిరాకరించెనను క్రోధము వేరొకవై
పునను ఆమె మానసమును చీకాకుపరుప సాక్షాత్కరించిన
పైశాచికనారీశిరోమణివలె లక్ష్మీజీ నేకాంతభాషణకు పు
రికొల్పి యాతని నాయుఖండగాతమియందు ద్రోసి క్రోధ వి
ముక్తయగుటకు సమకట్టెను. కాని తానొకటి దలప దైవము
వేరొకటితలచుననునట్లు లక్ష్మీజీ గజయీతగాడగుటచే ప్రా
ణములను రక్షించుకొనగల్గెను. తనను గూడ నయ్యాతురము
వదిలోని కీడ్చెను. ఆమె కేయుపాయము దోచక, మార్గసర
ణి నాలోచించుచుండ రెండవదినమున వేమువనే యొకస్త్రీ
శవ మాప్రవాహమునందు కొట్టుకొనివచ్చెను. అది యెవ్వరి
దో ఎట్లాప్రదేశమునకు వచ్చెనో యేరికిని తెలియదు. కాని

యాశవదర్శన మయినంతోడనే మనస్వైనాజీ యట్టికుతంత్రమున
కమోఘమగుమార్గము స్ఫురించెను. శారద నొక సంకేతస్థల
మున మరగుజేసెను. ఆకొట్టుకొనివచ్చిన యువతియే శారద
యని ఋజువుచేయజూచెను. ఇదియే మన ప్రస్తుతవ్యూహము.
ఇదియే యొక చిత్రకథ. శారద స్వైనాజీ కొమరితగాదు.
లక్ష్మీజీ యామెను చంపలేదు. ఆమె యింకను జీవించియే
యున్నది.

స్వైనాజీ తన శయనాగారమందు గతవిషయములను
గూర్చి యాలోచించుచు భవిష్యన్మార్గమునుగూర్చి యోజిం
చుచుండ వడివడిగ కరంచందు లోనికి ప్రవేశించి తలుపుదట్టె
ను. అతనిముఖమందపూర్వకళవరము తాండవమాడుచుండె
ను దానికి కారణ మేమియుండును?

స్వైనాజీ దిగ్గనలేచి యాతని కెదురేగి కారణమును
చెప్పుమన వారిద్దరి కీక్రిందివిధమున సంభాషణ జరిగెను.

కరం—రాత్రి లలితను బట్టనియమించిన చోరుల
ప్రయత్నము నిష్ఫలమయ్యెను.

స్వై—ఎందువలన ?

కరం—వీర డకస్మాత్తుగ నచ్చటికి వచ్చి వారిని బట్టు
కొనెను. ఆవృద్ధభిక్షుకవేషము మనచేత జిక్కి తప్పించుక
పోయిన వాడే ఆవీరుడు. చేజిక్కినవానిని విడచిపుచ్చితిమి.

స్వై—నిశ్చయముగనా? అన్నా! యెంతమోసము

జరిగెను. ప్రచ్ఛన్నవేష మెంతగూఢముగ ధరింపగల్గెను. పెనుభూతము! జాగ్రత!! యని కేకవైచినదియు నాతడేయని నాకిప్పుడు నిశ్చయమయ్యెను. తరువాత నేమయ్యెను?

కరం—ఆచోరులలో నొకడు పరుగెత్తివచ్చి బండిని దీసికొని నియమితస్థలమున కేగుచున్న నాతో జెప్ప మేమిరువురము గలసి వడివడిగ నాతని బట్టుటకు పోవుచుంటిమి. ఈ లోపుననే మాయోపాయమున నాచోరుడు వారిబారినుండి తప్పించుకుని వీరనిచావమోది ప్రాణావశిష్టుని గావించి వచ్చుచున్న మనుష్యులను గలసికొనెను.

స్వా—మీరు తక్షణము వీరని నేల పట్టియుండ లేదా?

కరం—సావధానముగ నాలకింపుము. మే మాతడు పడిన స్థలమునకై వడివడిగ బోవుచుండ నొకగొప్ప యాపత్సమయమున నున్న యొకస్త్రీ యార్తనాదము వినవచ్చుటచే కారణ మారయుచు నావైపునకే బర్వెత్తితిమి. కాని యా యార్తి ఎవ్వరిదని తలచెదవు?

స్వా—గ్రహింపజాలను.

కరం—వీరని యనుచరు డగునొకబాలుం డాయంధకారమందు మమ్ములను మోసముజేసెను. అతడే యాయార్తి నాదము సల్పినది.

స్వా—ఎంత తప్పుచేసితిరి. వీరడు దొరకెనా?

కరం—ఈకాలయాపనమునం దాతడు తప్పించుకొని పారిపోయెను.

స్వే—ఎంతమోసము. కరంచంద్ ! ఇంతకాలము నుండి నీ విట్టియుద్యమములయం దెన్నిసారులో పాల్గొనియుండియు చేజిక్కిన వైరి నన్యాయముగ పోనిచ్చితివే. తిరిగి యాతని నెట్లు పట్టగలము?

కరం—ఆచోరులనిరువురను వెదకుడని పంపియుంటిని. అది యటుండనిమ్ము! నేడొక వార్త వింటిని. దాని నిజమును మాత్రము తెలిసికొనవలసి యున్నది. శారద మారువేసమున దిరుగుచు మనచర్యల నన్నియు బరిశీలించుచుండెనట.

స్వే—శారదయే !

కరం—అవును. మొన్నటిదినమున లక్ష్మీజీ కారాగారమున కేగి యాతనితోడ నేదియో ప్రసంగించి వచ్చెనట.

స్వే—నమ్మజాలను. నీకెట్లు తెలియును ?

కరం—ఆమె చెరనుండి వచ్చుచుండ మనసేవకులలో కొకరు గుర్తించిరి. వృద్ధబిక్షుకవేషమున నున్న వీరడును ఆ ప్రదేశములయందే యాసమయమున దిరుగాడుచుండెనట. ఈవిధముగ సంచరించుచుండిన మనకు మోసము వాటిల్లుటకు సందియము లేదు. ఆమె లక్ష్మీజీతో నేమి ప్రసంగించెనో గదా ?

స్వేనాజీ—కరచంద్! ఏమిదేదియో మోసమున్నట్లు నాకు శంకపొడముచున్నది. నీవు సత్వరము పోయి శారదను తక్షణము దీసికొని రమ్ము. ఆమెతో సంభాషింపవలసి యున్నది.

వీరిట్లు మాట్లాడుకొనుచుండ నొకసేవకుడు పరుగు పరుగున వచ్చి "వీరదు పట్టుబడెను. వీరదు పట్టుబడెను. కాఫీ హోటలునందు గూర్చుండియుండ నొకపోలీసువాడు అరెస్టు చేసి తీసుకువచ్చెను. రండి రండి" అని యరచుచు పరువెత్తి వచ్చెను. ఆవార్త వినినతోడనే లేని సంతోషము దెచ్చికొని స్వేనాజీ కరంచందులు ఠాణాకు మోటారుపై బయలుదేరి పోయిరి. పాపము! పట్టువడినది వారి సేవకులలో నొకడగు లచ్చిగాడని వారికేమి తెలియును? ఇది వెంకని యద్భుతలీల!

స్వేనాజీ కరంచందు లట్లు వడివడిగ పోవుచుండ లోనుండి నాంచారి సావడిలోనికి వచ్చెను. ఆమె వీరిసంభాషణల నాలించుచు తలుపుప్రక్కనే నిలచియుండెను. స్వేనాజీ శారదల సంభాషణలను గూడ వినవలయునని నిశ్చయించుకొని వీరదు పట్టుబడె ననువార్త హృదయమున నొకపిడుగువలె ప్రతిధ్వనింప తానును ద్వారమును మూసి పరుగుపరుగున ఠాణాకు పరుగెత్తెను.



# 30

## విషసర్పము.

భానుడు తీవ్రకిరణములచే ప్రపంచమంతయు దహించుచుండెను. స్యైనాజీ గృహాంతర్భాగమందొక యాలోచనా గృహమందు శారద యొంటిపాటున నెవరికొరకో వేచియుండెను. ఆమెముఖమందనేకవిధాభిప్రాయములు తాండవమాడుచుండెను ఆమెముఖము దీనతగాంచియుండుట జూడ తన దుష్కృతమునకు పశ్చాత్తాపపడుచుండెనా యనుశంక గలుగకమానదు. ఆమె తనలో దానేదియో వితర్కించుకొనుచు "రేపటియుదయముననే యురిదీయుదురు. లక్ష్మాజీ నన్ను గుర్తించియున్న ట్లాతనిసంబోధనలవలన తేటతెల్లమగుచుండెను. తిరిగి నేనాతనికడ కేగి నిన్ను చెరనుండి విముక్తిచేసెదనని చెప్పుదునా! ఇదుగో శారదయని నన్ను ప్రభుత్వము వారి కొప్పగింపకమానడు. నాప్రచ్ఛన్నవేషము నాతడు పోల్చగల్గెను. ఇంకేమియుపాయము. స్యైనాజీ నాతో ప్రస్తావింపకుండగనే ఎన్నియో కార్యములను చక్కబెట్టుచుండెను. ఇతనిచర్యలనుజూడ నాకు మిక్కుటముగ యనుమానము జనించుచున్నది. ఇతడే యాలక్ష్మాజీయాస్తి సర్వస్వమును గ్రహించిన నేనేమిచేయగలను. తరువాత నాభాగము నాకు పంచియిమ్మని నేనెట్లు తగాదా చేయగలను. మరణించెనని చెప్పినయువతి తిరిగి యెట్లు పునర్జీవితురాలగును. ఆహా!

విధీ! నేనొక్క తుచ్ఛునివాక్యములు విశ్వసించి యాతని కను సొన్నల కోడి స్వలాభమును గోల్పోవుటయే గాక నిరంతరభీతి దాయకమగు రహస్యపరిశోధకుల పాల్బడి సంతతము సంకే తస్థలములందు సంచరింపవలసిన దుర్గతి నందవలసివచ్చెను. ఇంకేమియుపాయము? స్వలాభము గోల్పోవనుంకుటయే గాక నన్యాయముగ నిర్దోషియగు నొకసన్న్యాసిని పరలోక మున కేగజేయుచుంటినే! అతని ప్రాణములపై లలితప్రాణ ములుగూడ నాధారపడియున్నమాట నిక్కము. నాయొక్క దురాగతముచే నిరుప్రరప్రాణముల నొక్కసారి దీయుచుచుం టిని. వీరి నట్టి యిక్కట్టునుండి తప్పించుటెట్లు?

ఈదినమున స్త్యేనాజీ నన్ను బిలువనంపిన కారణ మే మయియుండవచ్చును. నేను లక్ష్మోజీతో సంభాషించియుండు ట ఎవ్వరయిన జూచి చెప్పియుండిరా? నాపరిచ్ఛన్న వేషము నెవ్వరైన గుర్తింపగల్గిరా? ఈదుష్టుడు నాచెయిదము నెరిం గిన నూరకుండునా? అబలనగు నాపై నెట్టియస్త్రమును బ్ర యోగించునో గదా. అన్నా! ఎంతమోసము సంభవించెను. ఎ చ్చటికైన పారిపోవనుంకించినను యీవీరడు నావెన్నంటి నిలువనిచ్చునట్లు లేదుగదా! ఇతడు మానవమాత్రుడు గా డు. నాజీవితము తుద కెంతహేయముగా పరిణమిల్లెను? స్త్యే నాజీ యెంతకుతంత్రుడు! నన్నొకపరికరముగా గ్రహించి నిరభ్యంతరముగ తన వ్యూహమును నెరవేర్చుకొని, కార్య

సాఫల్యమైనవెనుక నాపరిశరమును దోచిపైచుట జూడ నా హృదయ మాందోళన జెందుచున్నదిగదా! యింకేది దిక్కు?"

అని యిట్లు తలపోయుచుండ ద్వారము తెరచిన శబ్దము విననయ్యెను. ఒక్కనిముసమున స్వైనాజీ లోన బ్రవేశించెను. అతని వెనుకనే మన పరిచారికయగు నాంచారి ప్రవేశించి "తలుపు వేయుదునా?" యని యడుగుచు శారదముఖమై ఖరి నొక్కసారి పరికించి వెలికేగెను. ఆమె శారదను జూచుట స్వైనాజీ ఎంతమాత్రము సహింపజాలడు కాని, గతించినదానికి చింతించిన నేమిఫలము. నాంచారి తలుపుమూసి వెలికేగి యాగోడమాటుననే నక్కియుండి వారి సంభాషణల నాలించుచుండెను. వారిట్లు మాట్లాడదొడగిరి.

శా—నన్ను బిలువనంపిన కారణమేమి?

స్వై—నీసంకేతస్థలము భద్రముగనున్నదా?

శా—ఉన్నది. అట్లు ప్రశ్నించుటకు కారణము?

స్వై—ఏమియు లేదు. పెనుభూతమని పేరుగాంచిన యా పరిశోధకుడు మన సంకేతస్థలముల నన్నియు గుర్తించుచుండెను. ఆకారణమున నీసంకేతముగూడ భద్రముగనుండెనో లేదో కనుగొనుటకై పిలిపించితిని.

శా—భద్రముగనే యున్నది. లక్ష్మోజీని యురిదీయుట లేపేగదా!

స్వై—అవును. నీవీమధ్య నాతనితో సంభాషించితి

వని వినియున్నాను. నిశ్చయమేనా ?

శా—నీవెట్లు విశ్వసించితివి. నామహాత్మ్యౌగదా యీ తని చెరయందుంచి యుఱిశిక్ష విధించినది? అట్టివానినే నేను చూడబోతినని చెప్పుటయం దర్ధమేమయిన నున్నదా? అంత యు వట్టికల్ల. అసమంజసము.

స్యే—అసమంజసమే యయియుండవచ్చును. పరిచ్ఛన్న వేషమున బోయి సంభాషింపగూడదా ?

శా—గుర్తించిన మోసము వాటిల్లదా?

స్యే—గుర్తింపబడుటచేతనే యిట్లు నిన్నింతగా యడుగవలసివచ్చెను. శారదా ! నావద్ద నీవేలదాచెదవు. ఈప్రపంచమందు నీరహస్య మెఱింగినవాడను నేనొక్కరుడనే. అట్టి నాయెడగూడ నీవు రహస్యవర్తనము చేయజూచి నాస్నేహమును పోద్రోచిన నీ కీప్రపంచమున నిలువనీడ ఎక్కడగల్గునో యొక్కసారి యాలోచించుకొనుము. నావద్ద నన్నృతము లేలయాడెదవు?

శారద దీర్ఘముగ నాలోచించెను. స్యేనాజీ చెప్పిన వాక్యములు నిక్కము లని యామె మనమునకు బోధపడెను. కాని యతని కేమిప్రత్యుత్తర మీయగలదు ? మారుమాటాడక కూర్చుండెను. నిశ్శబ్ద మంగీకారసూచకమే యగును. అందువలన స్యేనాజీ తనయుద్దేశ్యమును గ్రహించునని యామె యూహ.

స్యే—నీవు నీతప్పిద మొక్కొకొనకుండినను నీజాడలను వేయికన్నులతో గాచుచుంటిని. నీవు ఆజ్మాజీతో నేమని ప్రస్తావించితివి?

శారద పూర్వమువలెనే మాట్లాడకూరకుండెను. ఆమె కేదిచెప్పుటకును దోచుట లేదు. నిజముచెప్పిన స్యేనాజీ తోక ద్రొక్కినత్రాచువలె తనపై కురుకును. ఏదయిన కల్పనాకథ జెప్పుట కేదియును స్ఫురింపకుండెను.

స్యే—అతనితో నేమిమాట్లాడితివో చెప్పవా?

శా—చెప్పుట కేమున్నది. చెరయందాతని యవస్థ ఎట్లున్నదో పరీక్షించుట కేగితిని.

స్యే—ఏమియు మాట్లాడ లేదా?

శా—తన్నన్యాయముగ చెరయందు బంధించిరని విల పించెను. ఇంతలో చెరసాలాధికారి కాలాతీతమగుచున్నదని చెప్ప నేను వెలుపలికి వచ్చితిని. ఇంతకుమించి వేరువిషయ ము లేవియును లేవు.

స్యే—నీ వేవేషమున వచ్చుటి కేగితివి?

శా—వృద్ధపురుష వేషమున.

స్యే—నీ కొకవృద్ధభిక్షుకు డగుపడెనా?

శా—కనబడెను. అతడు భిక్షుకుడు గాడా?

స్యే—అన్నా! మోసము వాటిల్లెను. అతడే వీరడు. నిన్ను గుర్తించియేయుండును.

శా—వీరడే! ఇంకేది కర్తవ్యము. నన్ను గుర్తించి యుండునా ?

స్వై—అతనియంతటి కుశాగ్రబుద్ధి వేరొకడీ ప్రపంచమున నుండబోడు. అతనిపేరు వీరడు కాదు. వేరొకనామమై యుండవలయును. కారణాంతరమున నిట్టి మారువేసము ధరించి యుండవచ్చును. నిన్నటిరాత్రి యతనినిబట్టుటకుబంపిన మన చోరులలో నొకనిని వీరడని యాతని సేవకుడగు నొక బాలుడు పోలీసువారిని మోసముజేసి యపహాగకల్పించి చెర యందు బెట్టించెను.

శా—నాసంకేతము నాతడు గుర్తించి యుండడు. చూచియుండిన నావెన్నంటి వచ్చియుండెడివాడే.

స్వై—ఎట్టులైన నీ వాప్రదేశమునందుండుట మంచిదిగాదు. నటిరాత్రి తిరిగి యిక్కడకురమ్ము. అప్పుడు నీనివాసము వేరొకప్రదేశమున స్థాపించుకొనవచ్చును.

శా—ఎన్నిగంటలకు?

స్వై—పదకొండుగంటలకు. నేను నిన్ను తీరమున కలిసికొనెదను.

శారదను వీడ్కొల్పుచుండ కరంచందు వడివడిగ లోనికి ప్రవేశించి "స్వైనాజీ! లక్ష్మాజీ తనయాస్తి సర్వస్వము లలితకు ధారబోసి విల్లువ్రాయుచుండెనట. అతనిప్లీడరు

ముట్టించునా? యను ప్రశ్న వీరనిమనమును కలచుచుండెను. కాని కానున్న దానికై యోజింపనేల? వడివడిగ నాయిరువురు వ్యక్తులును వీరడు డాగియున్న తావునకే వచ్చుచుండిరి. క్రమముగ వారిసంభాషణములు స్పష్టమగుచుండెను. స్వైనాజీ మృదుమధురభాషణముల నామె నోలలాడించుచుండెను. ఏమి! రేపటియుదయమున జరుగనున్న యురిశిక్షయేమి? స్వైనాజీ యొక్క సర్వప్రయత్నములును విల్లును సంతకముచేయుట యందే యాధారపడియుండుటేమి? స్వైనాజీ శారదతో సరసస ల్లాపములాడుచు కాలము బుచ్చుటేమి? ఇందేదియో కుట్ర యున్నది. లేకున్న నామెనొంటిపాటుగ నిట్లుగొనివచ్చి యసందర్భప్రలాపములు చేయుడు. శారద వానియుద్దేశ్యమును గ్రహించెనేమో! అత డెన్నిసారులు చెంతకుజేరదీసినను దూరముగనే తొలగి నడచుచుండెను. అతని విలాసభాషణములకు ప్రత్యుత్తర మీయుటలేదు. అట్లు వారిరువురును వీరడు డాగియున్న పొదనుజేరిరి. వారిలో వా రిట్లుప్రారంభించిరి.

స్వై—శారదా! నేడేల ఖిన్నురాలైయున్నావు. నాతోడ మనసిచ్చి యేలమాట్లాడుటలేదు?

శా—నాశరీరమం దస్వస్థతగానున్నది.

స్వై—నీప్రియు డగు లక్ష్మాజీ మరణింపనుండెననియా?

శా—లక్ష్మాజీ నాప్రియు డెట్లగును?

స్త్రీ—నీవాతని ప్రేమించి యుంటివిగదా?

శా—నాతోడ పరిహాసము లేలయాడెదవు?

స్త్రీ—పరిహాసములు కావు. నిశ్చయవాక్యములే. నీ వాతని నేకారణమున సందర్శింపబోయితివి. జయసేనుడు వట్టి తెలివిమాలినవాడనియా నీయభిప్రాయము. నేడు చూచెదవు గాక నాప్రజ్ఞ. నాహస్తమున కడ్డు నిల్చెడివా రెవ్వరో చూచెదగాక.

అని యకస్మాత్తుగ తన యంగీనుండి యొకబాకును చేతబట్టి యామెయురమునకు గురిపెట్టెను. ఒక్కక్షణమునమన శారద పరలోకమున కేగి యుండెడిదే. అట్టి యబ్బురపాటు నామెకనులను మూసివైచెను. నివ్వెరగంది నిలచిపోయెను. కాని సర్వాంతర్యామి యని పేరుగాంచిన మనవీర డచ్చట ప్రత్యక్షముగ నుండెనుగదా! వెనుకనుండి యొక్కపరగున బోయి స్త్రీనాజీహస్తమును గట్టిగ బట్టికొని చేతనున్న యాయుధము నూడబెరికి యావలపారవైచి శారద పారిపోవునో యని తనపిస్తోలు నామెయురమునకు గురిపెట్టి సిలిపి యొక సన్నని యీలవైచెను. ఒక్కక్షణమున పుడమి యీసిన ట్లాతని యనుచరులు పరిసరసంకేతస్థలములనుండి పర్వెత్తికొని వచ్చి వారిరువురహస్తపాదములను బంధించి మోసికొని పోసాగిరి.

శారద చిక్కెను. వీరని యుద్యమము సఫలమయ్యెను.
స్యేనాజీ వ్యూహము విచ్ఛిన్నమయ్యెను. స్యేనాజీ కొంతవర
కును పెనగులాడెను. కాని పెక్కురుగలసి యాతని బట్టినపు
డొంటిపాటున నేమి చేయగలడు ?

## 32

### ఉ రి తీ త.

ఉదయ మారుగంటలు కావచ్చుచున్నది. పక్షిసంతా
నమంతయు తమ యాహారార్థమునకై కువకువనినాదముల జే
యుచు నేగుదెంచుచుండెను. కారాగారమునం దురిస్తంభము
కడ పరికరములు గూర్పబడుచుండెను. ఆపురవాసు లందరు
నట్టి విషాదచర్యను జూచుటకై వేనవేలుగ నాచెరసాలాప్ర
దేశమున మూగుచుండిరి. లక్ష్మాజీ తన కారాగారమునందు
చింతాక్రాంతుడై మిక్కుటమగు దుఃఖము గలిగినప్పుడెల్ల
చిరునవ్వు నవ్వుచు నెద్దియో యాలోచించుచు "లలితా! లలి
తా!" యని కలవరించుచు వీరడు తన్ను రక్షింపకుండుటకు
కారణ మేమైయుండునా యని విచారించుచు తన చావునకై
సిద్ధముగ నుండెను. లలిత తన్ను ప్రేమించియుండియు, తనకై
యెంతయో విలపించి కృశించుచుండియు తానట్టి మరణావస్థ
యందున్న సమయమునం దేకారణమున సేదదీర్ప వచ్చియుం
డలేదో యనుపెద్దశంక యాతనిమనమును బాధించుచుం

డెను. గడియారము అయిదుగంటలన్నర కొట్టెను. నిమిష
ములు క్రమముగ గతించుచుండెను. లక్ష్మాజీహృదయపరి
వేదన మృత్యువ్యథయును క్రమముగ నభివృద్ధిగాంచుచుండెను.
ఆవేదన యెట్లుండునో కదా! పాఠకులారా! అట్టి యవస్థ లెన్న
డును గల్గకుండుత గాక యని పరమేశ్వరుని ప్రార్థించుదము.
అతని ముఖకమలము క్రమముగ వాడిపోవుచుండెను. హృద
యకలశము ముకుళించుకొని పోవుచు లో సమిడ్చికొనియున్న
రక్తబిందువులను వెలికిజిమ్ముచుండ ముఖ మెఱ్ఱనారి గుండెలు
మహావేగమున గొట్టుకొనుచుండెను. లక్ష్మాజీ! నీ యవసాన కా
లము సమీపించెనని చాటుచుండెను కాబోలు! అతని జీవ
నాడులు తమయంత జామె పటుత్వము దప్పుచుండెను. తన కా
రాగారప్రాంతమున నెచ్చటనైన చిటుక్కుమను శబ్దము విన
వచ్చిన యమదూతవలె నాభటుడు తన్ను గొంపోవుటకు
వచ్చుచుండెనా యని బెదరి చూచుచుండెను. ఎట్టి ధీరహృద
యునకైనను ప్రత్యక్షమరణము పట్ల భీతి జనింపకుండునా?
అది మానవస్వభావము. ప్రకృతి.

ఎట్టకేలకు గడియార మారుగంటలు కొట్టెను. కారా
గారముతలుపు తెరువబడెను. పాఠకులారా! ఏమని చెప్పుదు
ను. లక్ష్మాజీయంతటి ధైర్యవంతుడగు కంఠవెంబడి యొక్క
యశ్రుకణము చెక్కిళ్ళపై బడెను. కాని కర్మఫల మనుభవింప
కతప్పునా? అన్నబిందువొక్కటి కర్మసముదాయమునంతను

శుభ్రము చేయగల్గునా? మహాపారావారధిని గొనివచ్చినను
కర్మఫల మానీటిపై తాండవమాడుచునే యుండును. "నడువు"
మని భటుడు హెచ్చరించుచుండెను. దీనుడై చూచుచు ల
క్ష్మీజీ మెల్ల మెల్లగ నడుగులిడుచుండెను. హరిజనసమూహము
వచ్చుచున్న లక్ష్మీజీని చూడవలయునని యొకరినొకరు త్రో
సికొనుచు, నొకరినిమించియొకరు ముందునకు వచ్చుచుండిరి
క్రమముగ యురిస్తంభము సమీపించెను. దానినిగాంచినతో
డనే లక్ష్మీజీహృదయము జల్లుమనెను. చిన్నతనమునందు
యమలోకమునందు దుర్మార్గుల బాధించెడి స్తంభము ఎన్ని
యో చూచియుండెనుగాని ప్రత్యక్షముగ నట్టిది నేడు శారద
పుణ్యవశమున ననుభవించుచుండెను. తన్నిక రక్షించువా
రెవ్వరును లేరని నిస్పృహజెందెను. క్రమముగ నా నిస్పృహ
యాతని వదనమున వింతరంగుల నీనుచుండెను. అదియొక చి
రునవ్వుగ పరిమళించెను. లక్ష్మీజీహృదయము శిలాతుల్య
మాయెను. అతడు తనప్రక్కనున్నవానిని జూచి "అయ్యా!
యిప్పుడు చేయవలసిన కార్యక్రమము త్వరగా ముగింపుడు."
అని యనుగ నాతడు నీకేదియైన మనమున కోర్కెయున్న చె
ప్పుకొనుమని యడిగెను. పాపము! లక్ష్మీజీ కాప్రశ్న హృ
దయవేదనమును తిరిగి ప్రతిష్ఠాపన చేసెను. కాని తక్షణము
హృదయమును చిక్కబట్టి "నాకేమియు కోర్కెలు లేవు. కో
ర్కెలన్నియు నింతకుపూర్వమే గతించినవి" అని ప్రత్యుత్తర

మిచ్చెను. అతని నురిస్తంభము పైకి భటులు గొంపోవుచుండి
రి. ఒక్క నిముసము. ఒక్క నిముసమునందు లక్ష్మోజీ యీ
భూలోకబాంధవ్యము లన్నియును వీడి పరమపదమునందును.
వీరనిప్రయత్నములు వ్యర్థమగును. లలిత తననాథుని గోల్పో
వును. కాని యీమె కాతని యాస్తి యంతయు సంక్రమించును
గదా. లక్ష్మోజి యింతకుపూర్వమే తన విల్లునందు తన యా
స్తి సర్వస్వ మామెకు ధారపోసియుండెను. కాని యీమె
మానసప్రియుడగు లక్ష్మోజీ పోయినవెన్క నతనియాస్తి యీ
మెకు రుచించునా! ఇట్టిచర్చలిప్పుడసందర్భములగుటచే వ్రా
యనెంచక గ్రంథవిస్తరభీతిచే ముగించుచున్నందులకు పాఠకు
లు క్షమింతురుగాక!

లక్ష్మోజీ యురిస్తంభము జేరెను. అకస్మాత్తుగ నాసమూ
హమునుండి "ఆగుము! ఆగుము! ఉరిదీయకుము!" అను
యొక పెద్దకేక ఎల్గెత్తివచ్చెను. జనసమూహమునందు త్రో
క్కులాట హెచ్చుచుండెను. వెనుకనుండి యొకవ్యక్తి పరుగు
పరుగున నాజనములను ద్రోయుచు యురిస్థంభముకడకు వచ్చు
చుండెను. 'వీరుడు వీరుడు' అనుశబ్ద మంతరిక్షమున కెగయు
చుండెను. ఉద్యోగీయులు నిర్వారగంది చూచుచుండిరి. లక్ష్మో
జీహృదయకలశమునందు నూత్నబీజములు మొలకలెత్తుచుం
డెను. ఆహా! అట్టికష్టదశయం దుండెడి యల్లకల్లోలము నూ
హింపవలసినదే గాని వ్రాయనలవిగాదు. వీరుడు రంగస్థలము

ను బ్రవేశించునరికి యుద్యోగులలో నొకడు పట్టాడు "పట్టు
డు సంకెలలతో నీతని బంధింపుడు. ఇతనిని బట్టినవారికి వేయి
రూప్యముల బహుమానము ప్రకటింపబడెను" అని తక్కిన
యుద్యోగులను పురికొల్పుచు నాతని సమీపించెను. కాని,
వీర డెంతమాత్రమును చలింపక వారి సమీపమునకేగి "ఆ
గుడు! ఉరిదీయుకుడు. శారదనుబట్టి తెచ్చితిని" అని వారిని
సంబోధించెను. కాని నా రాతనిమాటలను విశ్వసింపక పూర్వ
మువలెనే తనమిత్రుని ప్రాణములను రక్షించుట కిట్లు చెప్ప
చుండెనని యూహించి యాతనిహస్తముల కరదండము లేయ
జూపిరి. వీరడు వారివంకజూచి చిరునవ్వునవ్వుచు తనయంగీ
నుండి యొకరేకునుదీసి తనయధికారముద్రను జూపెను.
అచ్చటనున్న యుద్యోగులు తెల్లబోయిరి. వీరడొక యపరా
ధపరిశోధకుడా? ఎంతచిత్రము! వీర డపరాధపరిశోధకుడని
యు శారదను జీవనములతో బట్టితెచ్చెననియు, పెనుభూతము
నుపేర బరగుచున్న యపరాధపరిశోధకుడును వీరడునొక్క
డేయనియు విద్యుచ్ఛక్తివలె ప్రజావళియందు బ్రసరించెను.
ఎంతమోసమనువారును, సత్యమే ఎన్నటికైన జయముగాం
చు ననువారును స్వేవాజీని దిట్టువారును కంటతడిబెట్టువారు
నుగ నానాతెరంగుల జెలగిరి. లక్ష్మీజీహృదయమెట్లుండు
నో పాఠకులే యూహింతురుగాక. యింతలో నొకపోలీసు
యుద్యోగి అర్జరు నొకదానిని దీసికొనివచ్చి, 'యిరిశిక నా

పు జేయుడు' అని ప్రభుత్వాధమతిని జదివెను. భటులు తిరిగి లక్ష్మీజీని కారాగారమునకు గొంపోవ ప్రారంభించిరి— దైవ మాయ యెంతచిత్రము!!

## ఉపసంహారము.

నిండుకొలువు ప్రభూటమునందు న్యాయమూర్తులు తీర్చి కూర్చుండియుండ ఆకోర్టునందే యొక ఫిర్యాదుగ నిలచి జయ మును గాంచిన స్వేనాజీ నేను ముద్దాయిగ నిలచియుండెను. ప్రాగుభోతపురడే ? ర్యాదిగ నిలచియుండెను. ప్రమాణానంత రము విచారణ ప్రారంభ మయ్యెను. వీనడు తన యధికార ముద్రికను ప్రభుత్వమున కెరిగించి యీ స్వేనాజీ యనుచరుల లో నొకడు బొంబాయినగరమునందు హత్యచేసి పారిపోయి వచ్చుటచే నాతని జాడలదీయుటకు స్వేనాజీ వెన్నంటి వచ్చితి ననియు, తాను వీనడను ప్రచ్ఛన్న వేషమును దాల్చియుంటి ననియు నెరింగించిన పిదప క్రమరీతిని తనఫిర్యాదును జే సెను. అతనికి సాక్ష్యము జీవించియున్న శారదయే. శారదను రక్షకభటులు ప్రవేశపెట్టిరి. జనుల యారాటము నాప నలవి గాకుండెను. ఆమెను జూచినతోడ న్యాయమూర్తు లందరును పెదవిపై వ్రేలిడికొని యచ్చెరు వందిరి. ఆమెను గుర్తించు టకు సాక్షులు వేనవేలు కొల్వుకూటమునందే యుండిరి. ఆహా యెంతదుడితము! ఎంతదురితము! ఎంతసాహసము!

విచారణానంతరము లక్ష్మాజీని విడుదలచేసిరి. స్వేనాజీకి ద్వీపాంతరవాసశిక్ష విధించిరి. శారదకు జన్మాంతము వరకును కారాగృహవాసము తీర్మానించిరి. అతనియనుచరుడగు కరంచెం దెచ్చుటకో పలాయన మయ్యెను. తక్కిన వా రందరకును తగు విధమున శిక్ష యొసంగిరి. వీరనిగూర్చి యొకవర్తమానము ప్రభుత్వమునకు బంపిరి. అం దిట్లుండెను.

"అపరాధపరిశోధకుడు రూపసింగు. ఈ గ్రామమున జరిగిన యొక గొప్ప విచిత్రనురాగతమున ప్రమేయుడై యద్వితీయబుద్ధికుశలతలతో సత్యనిరూపణము గావించి విఖ్యాతి జెందెను. ప్రభుత్వము వా రీతని నాదరింతురని మా ప్రార్థన."

వీరనిపేరు రూపసింగగుటయు, స్వేనాజీపేరు జయసేను డగుటయు, శారద యొక్క కులటయగుటయు స్వేనాజీ కామిత ఎంతమాత్రము గాకుండుటయు విని ప్రజలందరు నాశ్చర్యము నందిరి. పదునైదువత్సరముల బాలుడయ్యు వెంకడు, తన స్వామి కొనర్చిన మహోపకారములకు ప్రజలతని కొనియాడిరి. లలిత యానందమును వర్ణింపతరము గాకుంటచే వ్రాయలేదు. లక్ష్మాజీ లలితల పునస్సంధానమెంత యానందదాయకమో గదా! వారు రూపసింగు, వెంకని యెడల జూపిన కృతజ్ఞతకు మితియుండునా! లలితతలిదండ్రుల ముఖము వికసింప వారి యానందము మేరమీరి

యీవృత్తాంతమును వారి కంటబడిన ప్రతివ్యక్తికిని దెలియ బరచుచుండిరి. రూపసింగు, వెంకని వెంటబెట్టుకొని తన పూర్వయుద్యమమునకు కడంగెను. లక్ష్మాజీ యతనికి ప్రాణమునైన ధారబోయ సిద్ధుడైయుండెను. న్యాయము తిరిగి మూర్తీభవించెను. దుష్కృత్యము శిక్షింపబడెను. లక్ష్మాజీ పునర్జీవితు డయ్యెను. పెనుభూతము, పెనుభూతమువలెనే యెక్కడజూచిన నక్కడ ప్రత్యక్షమగుచు నతిరయమున మరణించిన శారదకు జీవితమును గల్పింప గల్గెను. పాఠకులారా! మీరును పెనుభూతము వచ్చుచున్నట్లు వినిన జాగ్రతగ నుండుడు.

స మా ప్త ము.



# రోషనార

అను

# జహ్వారీబాయి.



ఏశూరనారీలలామ—ఢిల్లీ సామ్రాజ్యమును అట్టుడికిం
చిన ట్లుడికించి—సర్వభారత రాజ్యరమానాయకుఁడగు
నాలంఘీరు పాదుషాయంతటివానిని తోలుబొమ్మను గావించి
యాడించెనో—ఏరణరంగ విద్యావిశారద—స్వరాజ్యసంస్థా
పన బిరుదువహించిన శ్రీఛత్రపతి శివాజీయంతవాని సేనల
నుయ్రాతలూగించి విడిచెనో—ఏనిరుపమలావణ్యరాశి తన
సౌందర్యాస్త్రప్రయోగమాత్రమున దావూద్ రజాఖులను
—వెఱ్ఱికోతులం జేసెనో—ఏమేధావిశారద—మోఅజీ
ముచే బలవంతముగ సంతకము చేయించి యాజ్ఞాపత్రముంగొని
పురుషాకృతిని సమస్తయవనసేనల కధికారిణియై రామసిం
హునికంట దుమ్ముగొట్టెనో—ఏప్రణయప్రతిమ—తన నిశ్చ
లానురాగమున-ఎన్నియాశలు చూపినను లొంగని శివాజిపై
ద్వేషమువహించి తుట్టతుద కాతని నాశనముంగోరి—స్వర
క్తప్రాణములను రణరంగమున శివాజీ పాదసన్నిధిని బలియి
చ్చెనో—ఆరోషనార దివ్యచరిత్రము 8 అంకముల నాట
కము. గ్రంథకర్త సోమరాజు రామానుజరావుగారు. చక్కని
పాటలుగలవు. వెల రు 1—0—0

# చింతామణి

(గ్రంథకర్త:— సోమరాజు రామానుజరావుగారు)

ఇంతవరకు ముద్రింపబడిన చింతామణులకన్న బహు విధాంశములు విశేషముగాగల్గిన నూతననాటకము- చింతామణికి స్వప్నమున —నరకలోకము కాన్పించుట—చిత్తశుద్ధి యైనదని గర్వమందిన బిల్వమంగళుని కన్నులకు నవమోహనాంగియు పతివ్రతయునగు—భాగీరథియనునామె కాళీపుర గంగాఘట్టమున గాన్పించుట—అతని హృదయము మోహసంక్షుభితమగుట—భాగీరథిపతియగు నాగరసేతు గృహమునకు బిల్వమంగళుండు భిక్షుకై చని, భాగీరథీవ్రతమును వాంఛించుట—భాగీరథివైరాగ్యబోధ—బిల్వమంగళుండు విరక్తుండై తనకు మోహభ్రాంతిగల్గించిన కన్నులను పొడుచుకొని, మధురాపురికి శ్రీకృష్ణదర్శనమునకై చనుట—శ్రీకృష్ణుడు గోపబాలవేషమున చింతామణీబిల్వమంగళులను చేయుత రీతి-మూఢభక్తుల యజ్ఞానము-కృష్ణుడు తనగర్భమున శూల నొప్పియనియు—అందులకై మానవరక్తము కావలయు ననియు నడుగ కృష్ణునికొరకై చింతామణి మరణించుట— కృష్ణుడు చింతామణి బిల్వమంగళులకు మోక్షమిచ్చుట మొదలగు నూతనఘట్టములు గలవు. చక్కని పార్సీమట్లు గల పాటలు.

వెల రు 1—0—0

# దానవీరకర్ణ



(గ్రంథకర్త:—దేశపాండ్య, సోమరాజు రామానుజరావుగారు.)

దానగుణమున, సుప్రసిద్ధుడగు కర్ణుడు విశ్వాతుకముగా శాపములనంది విశ్వేతుడగు ఘట్టములు మిగుల కర్ణకల్యాల వాదము మోతురంగము గనవంతములగు భాగములు గ్రంథము ప్రారంభించినదాదిగా తుదివరకు ప్రతిఅక్షరమును రసబంధురములు—కర్ణుని తల భారతము అనుటకు యీనాటకము ప్రత్యక్ష ప్రమాణము. శరించినవారందరును మిగుల స్తుతియించియున్నారు. కౌరవుల అన్యాయపరిపాలనమును కర్ణుడు స్తుతించుట విచిత్ర విమర్శనాసహితము. శంకిణీ లంకిణీ యను బ్రాహ్మణస్త్రీల చమత్కారము చదివితీరవలెను. వేదవ్యాసు నాగ్రహము శ్రీకృష్ణుని సత్యాగ్రహ ప్రబోధము చదవతగినది.

వెల రు 1—0—0.

శ్రీ రామకృష్ణా బుక్కు డిపో,

ఏలూరు.

# హంతకుఁడెవరు?

## (అద్భుతాపరాధపరిశోధక నవల.)

గ్రంథకర్త:-సోమరాజు రామానుజరావుగారు.

"ఏమి! ఎవరు!—హంతకుఁ డెవరు" రని—ప్రతిప్రకరణాంతము నందును చదువరులను దిగ్భ్రాంతులనుగాఁ జేసిన నవల!—హంతకుని రహస్యము గ్రంథాంతమువఱకుఁగాని బయల్పడదు—అది గడుసువగు అనుమానము—హత్యలో రహస్యము—హత్యాన్వేషణమున వేఱొకహత్య బయల్పడుట—పోలీసుకర్మచారులందే పోల్పజాలని మహారహస్యము—బ్యాంకి దోచుకొనుట—తెలియనిమూలమున హత్యచేయు సాధకవిధి చూచు—విద్యుచ్ఛక్తిలో వింతైన మరణము—నారాయణసోదరుల ప్రతీకారఫలము—హంతకుఁడు దొరకని చదువరు లానందింపవలసినగాముగ వంతయు తలక్రిందులగుట—చదువరు లెన్నివిధముల నాలోచించినను, పట్టుపడని రహస్యము—"గోపిల్లా" యను వారిపిశాచిని చేసిన దురంతములు—హత్యలు—చదివి తీరవలసిన నవలారాజము—గ్రంథకర్త పటముతో నున్నది—300 పుటలు.

వెల రూ 1-12-0.

# మీర్ జుంలా.

పులవర్తి కమలావతీదేవిగారు.

మీర్ జుంలా మహమ్మదీయ యుగంధరుడు. అందగాడున్న, హంతకుడు కాడాయన్న—చంద్రహాసముచే పగతుర నొంచును— మందహాసముచే మగువల లోబరచుకొనును. ఏమహాత్ము లెంత శక్తులు యిముడ్చుకొని యుండే యుండుట. యెన్నడైనా గాంచితివా! దుర్లభము. దుష్టుడు—గూఢాగ్రహుడు—సముద్రములు గడచి, ద్వీపములు దిగులొందజేసి, హామహాయంతవాని తైలె కాళ్ళాడించి, తానీపాప తగవులు కల్పించి, ముస్సేను చివరకొని, అన్న పదితెల అంతము గనకొని, తా వలచిన దానికై ధర్మపథముగా సముంగవలెనని చాటుటకు మంత్రిపదవి చాలకమాయమైనాడు. వెల 1-0-0.

---

కాయల కన్నయ్యనాయుడు, రామకృష్ణా బుక్ డిపో, ఏలూరు.

ఏమిభూతమిది! జాగ్రత్త
(అద్భుతాపరాధ పరిశోధక నవల)
గండిమెడి శ్రీరామశర్మగారు బి.ఏ

13953